# ఆంధ్రసచిత్రవారపత్రిక



ANDHRA PATRIKA
ILLUSTRATED WEEKLY

25 నయాపైసలు
17-9-58

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై.

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 53
సంచిక 1
17-9-58

Founder : K. NAGESWARA RAO


## వినాయక చతుర్థి కథల ప్రత్యేక సంచిక


విలంబి భాద్రపద శుద్ధ పంచమి బుధవారం


## విషయానుక్రమణిక

ముఖచిత్రం !
వినీతార అంజలీదేవి.





# ఒకమాట

సెప్టెంబరు 16—వినాయక చతుర్థి.

ఇది మన పెద్దపండుగలలో ఒకటి. పిన్నలు, పెద్దలు సమాన భక్తిప్రపత్తులతో మహాగణాధిపతిని ఆరాధించే రోజు.

ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కూడా ఇది చాలా ముఖ్యమైనరోజే. ఎందుచేతనంటే, సరిగా యాభై సంవత్సరాలక్రితం ఈ గణపతి నవరాత్రుల సమయంలోనే ఆంధ్ర పత్రిక వారపత్రికగా ప్రప్రథమంగా అవతరించింది. అందుచేత ఇది మన సచిత్ర వారపత్రికకు పుట్టినరోజు పండుగన్నమాట. యాభయ్యో వార్షికోత్సవ శుభసమయంలో సచిత్ర వారపత్రిక స్వర్ణోత్సవ సంచిక ప్రచురించాలని సంకల్పించి కావలసిన ఏర్పాట్లన్నీ చేశాము. పోటీలను ఏర్పరచి కొన్ని రచనలు సేకరించాము. అయితే కొన్ని కారణాంతరాలచేత స్వర్ణోత్సవ కార్యకలాపాన్నీ, ప్రత్యేకసంచిక ప్రచురణను వచ్చే సంక్రాంతినాటికి వాయిదా వేయవలసివచ్చింది. ఈ విషయం పాఠకులకు విదితమే.

అయినప్పటికీ, వినాయక చతుర్థి సందర్భంలో ప్రత్యేకసంచిక ప్రచురించడం రివాజు. గత సంవత్సరం ప్రత్యేక హాస్య సంచికగా వెలువడి సచిత్ర వారపత్రిక పాఠకుల మన్ననల నందుకున్నది. ఆ సందర్భంలోనే పలువురు పాఠకులు, శ్రేయోభిలాషులు ప్రత్యేక కథా సంచికను కూడా ప్రచురిస్తే బాగుంటుందని సూచనలు చేశారు. జన్మదినోత్సవ సమయమే దీనికి తగిన తరుణమని భావించి ఇప్పుడు ఈ కథల ప్రత్యేకసంచికను ప్రచురిస్తున్నాము. సహృదయ పాఠకుల హర్షామోదాలు దీనికి లభ్యమవుతాయనే విశ్వసిస్తున్నాము.

న్యూఢిల్లీ లేఖకు, నక్షత్ర ఫలితాలకు మాత్రమే స్థానమిచ్చి మిగతా శీర్షికలను మినహాయించాము. వచ్చే వారం వివిధ శీర్షికలతో యథాప్రకారం పత్రిక వెలువడుతుంది.

ఇక పోతే, బాలల సంఘం విషయం: ఈ సంచికలో బాలల సంఘం సభ్యత్వపు దరఖాస్తునుగాని, సభ్యుల పేర్లనుగాని ప్రచురించ లేదు. సెప్టెంబరు 1 నాటికే సభ్యుల సంఖ్య ఐదువేలు దాటిపోయింది. ఇప్పటికే చాలామందికి వారి వారి సభ్యత్వపు కార్డులు అందివుంటాయి. వచ్చే వారం పదిరోజులలో మిగతావారందరికీ కూడా అందజేస్తాము. అందుచేత కార్డులు పంపేపని పూర్తి కాగానే, అక్టోబరు 1-వ తేదీ సంచికలో తిరిగి దరఖాస్తును, పేర్లను ప్రచురించి ఇతర కార్యక్రమానికి ఉపక్రమిస్తాము. ఈ లోపుగా కార్డులు అందినవారు అవి తమకందినట్లు వెంటనే తెలియజేస్తే సంతోషిస్తాము. ★



[శ్రీశైల ఆలయంలోని రత్నగర్భ గణపతి.
—ఫోటో: జోడి వాసుదేవరావు.]

# న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ



## లోక్‌సభచర్చలలో సభాపతిసమయస్ఫూర్తి

లోక్‌సభాపతి అనంతశయనం అయ్యంగార్ తమ ప్రజ్ఞను, ప్రాభవాన్ని, సమయస్ఫూర్తిని క్రితంవారం బహుచక్కగా నిరూపించారు. మనది ఫెడరల్ రాజ్యాంగమనే విషయాన్ని సభ్యులకు మరోమాటు గుర్తుకుతెచ్చారు. ప్రతిపక్ష సభ్యులు ఉత్తరప్రదేశ్ ఆహార సమస్యను సాకుగా తీసుకొని నానా హంగామా చేయడంతో సభాపతి జోక్యం కల్పించుకొని స్థిరవైఖరిని అనుసరించవలసి వచ్చింది. సోషలిస్ట్ పార్టీ సభ్యులు విరామతీర్మాన పరంపరను తీసుకురావడం ప్రారంభించారు. ప్రభుత్వాన్ని ఉక్కిరిబిక్కిరిచేసే ఏ ప్రతిపాదన వచ్చినా, కమ్యూనిస్టులు దాన్ని పెద్ద పండుగగా భావించి, ఆ అదనును స్వార్థానికై ఉపయోగించుకోవాలని చూస్తారన్నది అందరికీ తెలిసిన విషయమే.

కేంద్ర శాసనసభ వ్యవహారాల నిర్వహణంలో సభాపతి అయ్యంగార్ విశేష అనుభవజ్ఞులు. సభ్యుల ధోరణి, చర్చలవైఖరి సభాపతికి చాలా చిరాకు కలిగించాయనడంలో సందేహంలేదు. ఏయే విషయాలపట్ల కేంద్ర శాసనసభ శ్రద్ధవహించాలి, ఏయే విషయాలను రాష్ట్ర శాసనసభలకు కేటాయించాలి అనే విషయం ముప్ఫయ్యేళ్ళ క్రితం 1921లోనే తేల్చివేశారు. సహజంగా రాష్ట్ర శాసనసభలు తర్కించవలసిన విషయాలపై కేంద్ర శాసనసభలో ప్రతిపక్ష సభ్యులు విపరీతమైన కసరత్తులు జరపడం సభాపతికి చిరాకుతోపాటు ఆశ్చర్యాన్ని కూడా కలిగించింది. మన రాజ్యాంగ స్వరూపస్వభావాలు ఎలాంటివనే విషయంపట్ల ఇటు మంత్రులుగాని, అటు లోక్‌సభ సభ్యులుగాని ఆలోచించినట్లే కనబడదు. ఇందుకు కేంద్ర విద్యామంత్రి డాక్టర్ కల్లూరామ్ శ్రీమాలీనే ఒక ఉదాహరణగా తీసుకోవచ్చు. ప్రాథమిక, సెకండరీ విద్యావ్యాప్తికి చేసే ధనసహాయం వివరాలను చెప్పవలసి వచ్చినప్పుడు శ్రీమాలీ అసలు మన రాజ్యాంగం ఏమి చెబుతున్నదని ఏకోశానా ఆలోచించరు. ప్రశ్నలవర్షం కురిపించే సభ్యుల సంగతి సరే సరి. కేంద్ర ఆర్థికశాఖకూడా ఈ విషయంలో విద్యాశాఖకు ఏవిధంగానూ తీసిపోదు. ఉత్తరప్రదేశ్ ఆహార క్లిష్టస్థితిపై గతవారం ప్రతిపక్ష సభ్యులు అంత తర్జనభర్జన చేసి వుండకపోయినట్లయితే, ఈ రభస యథాప్రకారం కొనసాగుతూనే వుండేదేమో ననిపిస్తుంది.

### రాష్ట్ర రాజధానిలో కూచిపూడి నాట్యసదస్సు

ఢిల్లీ నాట్య సదస్సులో కూచిపూడి నాట్యానికి తీవ్ర అపచారమే జరిగిందన్న విషయాన్ని ఇప్పుడు అందరూ అంగీకరిస్తున్నారు. సంప్రదాయ సిద్ధమైన ఈ ప్రాచీన నాట్యానికి జరిగిన అన్యాయాన్ని సరిదిద్దే మార్గమేమిటనే జిజ్ఞాస ఆంధ్ర సంగీత నాటక అకాడమీ వర్గాలలోకూడా ప్రారంభమైంది. రాష్ట్ర రాజధాని హైదరాబాదులో త్వరలోనే కూచిపూడి నాట్య సదస్సు ఒకటి ప్రత్యేకంగా ఏర్పాటుచేయాలనీ, దానిలో పాల్గొనడానికి ఈ నాట్యకళలో అనుభవజ్ఞులైన పెద్దలనూ, ఇతర ప్రముఖులనూ ఆహ్వానించాలనీ అకాడమీ నిర్ణయించబోతున్నట్లు తెలుస్తున్నది. ఢిల్లీ నిర్ణయం ఫలితంగా జరిగిన అన్యాయాన్ని సరిదిద్దడంలో ఈ ప్రత్యేక నాట్య సదస్సు తప్పక సహాయపడుతుందనీ, రాష్ట్ర అకాడమీ సత్సంకల్పం నెరవేరుతుం దనీ ఆశించవచ్చు.

—ఒక విలేఖరి]

ఆహారశాఖమంత్రి అజిత్ ప్రసాద్ జెయిన్ తన మామూలు ధోరణిలో పరిస్థితిని విడమర్చి చెప్పనుపోవడం ప్రారంభించారు. గతమాసం లోక్‌సభలో జరిగిన చర్చల అనంతరం ఉత్తరప్రదేశ్‌లో 1500 చౌకదుకాణాలను ప్రారంభించామనీ, కేంద్ర ప్రభుత్వం అదనంగా 25 వేల టన్నుల ఆహారధాన్యాన్ని సరఫరాచేసిందనీ, అక్కడ ధరలు బీహారు, బెంగాలులలో ధరలకంటే ఏవిధంగానూ ఎక్కువగా లేవనీ జెయిన్ స్పష్టపరిచారు.

ఈ వివరణను పూర్తిగా వినకుండానే ప్రతిపక్షంలోని ఉత్తరప్రదేశ్ సభ్యులు "ప్రధాని నెహ్రూ మా రాష్ట్రంవాడు; హోంమంత్రి మా రాష్ట్రంవాడు; వాణిజ్యమంత్రి, ఆహారమంత్రి, సూనెసప్లయి మంత్రి, బ్రాడ్‌కాస్టింగ్ మంత్రి అందరూ మా రాష్ట్రానికి చెందినవారే —" అని ఏవేవో కేకలు, పెడబొబ్బలు పెట్టడం ప్రారంభించారు. అంటే పాతకాలపు జర్మనీలో ప్రష్యాలాగా ఉత్తరప్రదేశ్ ఈనాడు భారతదేశం మీద అధికారం చెలాయిస్తున్నది కాబట్టి యు. పి. ప్రజలకు దండిగా తిండివుండాలనీ, నామమాత్రమైన ధరలకు ఆహారధాన్యాలు లభ్యంకావాలనీ ఈ ప్రతిపక్ష సభ్యుల ఉద్దేశమన్నమాట! ఉత్తరప్రదేశ్ ఆహారధాన్యాల ధరలస్థాయిని, బీహారు, బెంగాలు ధరలస్థాయితో సరిపోల్చడం మహాపరాధమన్నమాట!

సభాపతికి ప్రతిపక్ష సభ్యుల అసహనం దుస్సహమై తోచింది. వెంటనే కల్పించుకొని రాష్ట్రవ్యవహారాలేమిటో, కేంద్ర వ్యవహారాలేమిటో స్పష్టంగా కేటాయించడం అవసరమని తమ సహజగంభీర ధోరణిలో ఉద్ఘాటించారు. ఆహారం, ఆరోగ్యం, వ్యవసాయం, విద్య. నీటిపారుదలశాఖల ద్వంద్వావస్థను ఉదాహరణగా

తిప్పికొట్టారు. ఇది గత మంగళవారం నాటి గాథ.

తిరిగి బుధవారంనాడు కూడా ప్రతిపక్ష సభ్యులు ఇదే విషయంపై హంగామా చెయ్యడం మొదలుపెట్టారు. ఆ తరవాత నాలుగు గంటల వ్యవధిలో వారు భారత రాజ్యాంగంలో పేజీలను ఒకసారి తిప్పిచూసుకున్నట్లున్నారు. ఇటు కేంద్రం అజమాయిషీలోనూ, అటు రాష్ట్రాల అజమాయిషీలోనూ వున్న "కంకరెంటు" విషయాల జాబితా ప్రసక్తి తెచ్చారు. సభాపతి ఈ గొడవ భరించలేక, రాజ్యాంగ రీత్యాగాని, తదితర విధంగాగాని, ఉత్తరప్రదేశ్ ఆహార సమస్య పట్ల కేంద్రానికి ఏమి బాధ్యత వున్నదో నిరూపించవలసిందని గద్దించి అడిగారు. అంతటితో వారి నోళ్ళు కట్టుబడ్డాయి. సభాపతి జోక్యం ఫలితంగా ఆహారశాఖా మంత్రికి చక్కటి అవకాశం దొరికింది. ప్రధాని నెహ్రూ సభలో ఆసీనులై వుండగానే, ప్రజలకు ఆహారం సప్లయి చేయవలసిన బాధ్యత కేవలం రాష్ట్రాలదేననీ, రాజ్యాంగ రీత్యా కేంద్రానికి ఏ విధమైన బాధ్యతా లేదనీ అజిత్ ప్రసాద్ స్పష్టపరిచారు. ప్రజలకు ఆహారం లభ్యమయ్యేట్లు చేయడంలో తగినంత ధాన్యాన్ని దిగుమతి చేసి రాష్ట్రాలకు సహాయపడడం వరకే కేంద్రం బాధ్యత అని కూడా ఘంటాపథంగా చెప్పారు. అవసరమైతే రాష్ట్ర ప్రభుత్వాలు కూడా ధాన్యం దిగుమతి చేసుకోవచ్చునన్నారు. ప్రతిపక్ష సభ్యులకు ఈ సమాధానం బాగా నసాళానికి అంటినట్లయింది. అంతటితో నోరు మెదపలేక పోయారు.

దేశం స్వతంత్రం గాక పూర్వం ఆహార వ్యవసాయ, ఆరోగ్య విద్యాశాఖలు ఒకే ఒక మంత్రి అధీనంలో వుండేవి. ఈ పరిస్థితులలో తిరిగి ఆ పాతపద్ధతినే అమలుపరచడం శ్రేయస్కరమనిపిస్తుంది. రాష్ట్ర ప్రభుత్వాల అజమాయిషీ క్రింద కూడావున్న వ్యవసాయ, ఆహార, ఆరోగ్య, విద్య, నీటిపారుదల, కార్మిక, సమాజ వికాసశాఖలను ఏకం చేయడంవల్ల బోలెడంత డబ్బు మిగులుతుంది; విదేశాలను ముష్టి ఎత్తకుండా తృతీయ పంచవర్ష ప్రణాళికను అమలు జరుపుకోడానికి వీలుచిక్కుతుంది. అయితే ఇందుకు మన వారు ఆక్షేపణ చెప్పకపోరు. ఎందుచేతనంటే వారి వ్యక్తిగత అధికార ప్రాపకాలు అడుగంటుతాయి.

* * *

గత మంగళవారంనాడే ప్రశ్నోత్తరాల సమయంలో మరో గమ్మత్తు జరిగింది. మన రైల్వేలలో ఎంతమంది పాకిస్తానీలను నియమించారో చెబుతారా అని ఒక సభ్యుడు ప్రశ్నించాడు. దానికి రైల్వేమంత్రి కొంత

# న్యూఢిల్లీ లేఖ

ఉంది. భారతీయేతరులను నిపుణులుగా కాంట్రాక్టుపద్ధతిమీద నియమించడం జరిగిందని సమాధానం చెప్పి అసలు విషయాన్ని మభ్యపెట్టారు. ఆయా స్థానాలలో పని చేయడానికి యోగ్యులైన భారతీయులు దొరకలేదని సాకు చెప్పి తప్పించుకోవాలని కూడా మంత్రి చూశారు. మంత్రి సమాధానం ఎవరికీ నచ్చలేదంటే ఆశ్చర్యంలేదు. వెంటనే సభాపతి అందుకొని, రైల్వేమంత్రి సమాధానం సంతృప్తికరంగా లేదని అన్నారు. కొన్ని ఉద్యోగాలకు నిపుణులైన భారతీయులు దొరకలేదంటే అది పచ్చి అబద్ధం. భారతీయులలో లేని నిపుణులు పాకిస్తానీయులలో వున్నారా? పాకిస్తానీలు ఒకేఒక విషయంలో నిపుణులు—అయినదానికీ కానిదానికీ అబద్ధాలాడడంలోనే భారతీయులకంటే పాకిస్తానీయులు నిపుణులు. మంత్రి సమాధానం తనకు నచ్చలేదని చెప్పడంతో వూరుకోనక, సభాపతి ప్రతి ఆరు నెలలకి కనీసం ఒకసారైనా ఆహార సమస్యపై చర్చ జరిగినట్లే సభలో రైల్వే వ్యవహారాల మీదకూడా చర్చ జరగాలని సూచించారు. ఇష్టం లేకపోయినా, రైల్వే మంత్రి అందుకు సమ్మతించక తప్పలేదు.

* * *

లోక్ సభ విజిటర్ల గ్యాలరీలో ఒక సాధువు వచ్చి కూర్చుంటే, మనం ఏమనుకోవాలి? బహుశా ఇది దేశ భవిష్యత్ స్వరూపానికి సూచనప్రాయమైనదేమో! ఆ సాధువుది వల్లటి విరుసుగడ్డం! చేతికి రిస్టు వాచీ. రిస్టువాచీని ప్రదర్శించాలని సాధుపుంగవుడు ఎంత తాపత్రయ పడ్డాడో! ఒక్క కోవణతప్ప దేహంమీద మరే ఆచ్ఛాదనా లేదు. ఈ విధంగా రెండు రోజులపాటు వచ్చి గ్యాలరీ ముందు సీటులోనే ఆసీనుడైనాడు. అతడి వెనుకనే మరో సాధువు కూడా కూర్చున్నాడు. దుస్తుల విషయంలో ఈ రెండో సాధువు మొదటివానికంటే కొద్దిగా మెరుగు. ఈ ఇద్దరూ ఎవరై వుంటారా అని పలువురు పరిపరి విధాల ఊహించారు. బహుశా అఖిల భారత సాధు సమాజం సభ్యులై వుండవచ్చు.

ద్వితీయ ప్రణాళికపై సంతకాలు చేసే సందర్భంలో ప్లానింగ్ కమిషన్ సభ్యుడు ఒకరు ఒక సాధువువద్ద ప్రసాదం స్వీకరించి వచ్చి మరీ సంతకం చేసినట్లు ఇదివరకే వ్రాశాను. ఆ మహాప్రసాదాన్ని మిగతా సభ్యులందరికీ కూడా ఆయన స్వయంగా పంచిపెట్టారు. ఈ విధంగా సాధుజన ఆశీర్వచనంతో, ప్రసాదంతో ప్రారంభమైన ప్రణాళిక ఆచరణకు దేశదేశాల సహాయాన్ని "కావాలీ" అని అర్థించవలసి వస్తున్నది. ★

# సాటిలేని

చంద్రుడూ వెన్నెలా కనిపించి అనిపించినంత అన్యోన్యంగా బిరుదులూ వాటి తాలూకు 'ధరలూ' తటస్థపడడం అరుదు. అలా అరుదైన వాటిలో—పుష్ప సౌరభాల లాగా, హాస్యకరుణ రసాలవలె, ఆమ్రేడిత పదద్వయం రీతిన, "ఓహో గొప్పవాడూ" - తెలుగు దనమూ ఏర్పాటులో, కలిసిపోయి నప్పి ఒప్పే రెండు తెలుగు మాటలు, 'హాస్యబ్రహ్మ' 'భమిడిపాటి'ను.

బిరుదుల్ని సామాన్యులు ధరిస్తారు, మాన్యులు భరిస్తారు. ఈ రెండో కోవలో మొదట నిలబడగల కామేశ్వరరావు గారిని, వెన్నుగలదన్నూ. ఛందాలు బద్దలుకొట్టి మరీ చెప్పుకోడానికి చిరునామా, లేకుండా చాల కాలం రికామీగా ఉంటూవచ్చిన 'హాస్య బ్రహ్మ' బిరుదు వరించి, ధరించింది. అందుకనే, "ఈ దేశములో హాస్యము ఒక్కనిదే సొత్తు...నవ్యసాహిత్య శాఖలలో ఏ పని అయినా ఒకడు చేసింది ఇంకోడు చేశాడు గాని ఈ భమిడిపాటి కామేశ్వరరావు గారు చేసిన హాస్యరచన మరియొకడు చేయలేదు" అని 18 ఏళ్ళనాడు కవి సమ్రాట్ ఈయనను నవ్యసాహిత్య పరిషత్ సభలో జోహారులర్పించారు...

తన జాతి గురించి కూలంకషంగా తెలుసుకుని ఆ తెలుసుకున్న యావత్తు సుబ్బరంగా, నిబ్బరంగా చెప్పగలిగినవాడిని కలిగిన జాతులలో తెలుగుజాతి ఒకటి; తెలుగు జాతిలో అలా చేయగలిగిన వారు కామేశ్వరరావుగారు ఒక్కరే.

* * *

"ఎవరు మీరు" అని అడిగితే—'ఘనీభవించి, కూరువేషం వేసుకు బక్కా వచ్చిన వినమ్రభావమూ ఏమిటి చెప్మా వీడూ! అని అడిగినవాడు కంగారుపడి తేలేలాగా, "ఒహో గొప్పవాణ్ణి" అని టూకీగా తన ఆశయ పౌరుషేయాలు, జీవిత చరిత్రా ఒక్క ముక్కలో చెప్పుకున్న మితభాషి లగాయతూ, నేనేమైపోయినా సరేగాని వాడు తిరుక్షవరం అవాలని ఆకాంక్షించిన పరాహితాభిలాషి దగ్గర్నుంచీ, ఇంకోడి రచనని ఎలా దించి, కుదించి, జమాయించి సొంతానికి జమచేసుకుని దబాయించవచ్చునో చెప్పగల విశ్వామిత్రరావు మొదలుచ్చుకుని, సభని అభాసు చెయ్యడంలో తన ప్రజ్ఞని ఎలా పెల్చగలడో చెప్పడంలో ధూమాలమ్మ వాగ్ధాటిని దాటిపోయే దోఉదత్తరావు ఆదిగా, పోటీకొచ్చిన సాటి ఓటర్థిని వెనక పోటుపొడిచే మార్గాలూ మార్గాంతరాలూ వగైరాలమీద డాక్టరేటు పుచ్చుకోదగ్గ ఎలక్షన్ అభ్యర్థినుండీ, ఇంగీషులో ఎలాగైనా ఎక్కువ పసవుందని పసిగట్టి తెలుసుకున్న 'తెలుగు సున్న'లోని ఇంగ్లీషు తమ్ముళ్ళ దాకా రకరకముల 'కచటతపల'నురకరకముల కచటతపలను పరిచయంచేసి నవ్వించి నవ్వించిన మనిషి కామేశ్వరరావుగారు. ఈ రూపేణా వాళ్ళకోసం ప్రయోజన ప్రదాయకమైన బాధపడిన మనిషి కామేశ్వరరావుగారు. తోటివాళ్ళమీద సాటివాళ్ళ మీద వెటకారాలూ మిరియాలూ నూరడం, వాళ్ళ దుర్గుణగణాలు జాబితా వేసి చదివి నవ్వించి హాస్యం చేయడమే ఆయన లక్ష్యమనీ, ఆయన హాస్యరచయిత మాత్రమేననీ అనుకునేవాడు,—విశ్వనాథ సత్యనారాయణ గారి మాటలలో "పట్టి తెలివితక్కువవాడు" ప్రేమ, అపేక్ష, ఆవేదన, వాత్సల్యం ఉండడంవల్లనే హాస్యంలో మాటమాటకూ కండపుష్టి కలుగుతుంది...

కామేశ్వరరావుగారు ఆంధ్రుడి విశ్వరూపాన్ని దర్శించగలిగారు; అందరికీ- వారి వారి సంస్కారాన్ని బట్టి అది హృదయంగమం కాగల అవకాశాన్ని కలిగించారు. జాతి వికాసానికి కూడని లక్షణాలను గర్హించారు. అవి ఉన్నందుకు 'అన్నన్నా' అని బాధపడి లేచి, హన్నా అని కోప్పడి, నాన్నా అని లాలించారు. ఎబ్బెబ్బే అని హేళనచేశారు. ఈ శోభలక్ష్యం ఏమిటో ఆయన రచనలు చదివినవారందరికీ తెలుసు. తన జాతిపట్ల తనకు గల అపేక్షకీ, ప్రేమకీ, గౌరవానికీ, గర్వానికీ, లజ్జకీ, దానికోసం ఆయన పడ్డ బాధకఆయన రచనలన్నీ 'అక్షరా'నువాదాలు.

రచయితగా కామేశ్వరరావుగారికి వాగారాధనపట్ల గల అభిమానాన్ని ఆయన వాక్య సౌందర్యం చాటుతుంది. తెలుగు జాతి చైతన్యం అంతా పోసుకుని, జలపాతం లాగా, బడిపిల్లడినోట్లో పద్యం ఎక్కంలాగా పరుగులెత్తే ఆయన వాక్యాలలో ప్రతిమాటలోనూ పంచప్రాణాలూ ప్రతిష్ఠించి ఉంటాయి. మాట విలువ తెలుసుకుని దానిమీద అధికారం కోసం నిత్యం తపస్సుచేసిన వ్యక్తి ఆయన.

ఆ వాక్యాలలో ఓ మాట ఇంకో మాట మాటున నిలబడి అడుచాటు పిందెలా ఎంత అందగిస్తుందో, ఓమాట ఇంకోమాటు కస్తే ఎలా ఒళ్ళు ఝల్లుమనిపించ చేస్తుందో, ఓమాట ఇంకో మాటని ఢీకొంటే అందులోంచి ఎలాటి కాంతిభావం పుట్టుకొస్తుందో, ఓమాటని ఇంకోమాటకి మాటువేడితే ఎలా తయారవుతుందో, ఒక మాటమీద ఎక్కి ఎలా ఇంకో భావంమీదకి షికారువెళ్ళొచ్చునో (...చారుదత్తరావుగుణగణాలకు టాకీ తీయడానికి వెంటనే ఒహో కంపెనీ లేవాలి; లేనిగానే మొహం కడుక్కోడం మంచిది.) ఆయన వ్యాసవిన్యాసాలలో మనం దర్శించవచ్చు. తెలుగు నుడికారం మీద ఆయన మాట ఆఖరుమాట అంటే, అది ప్రస్తుత సందర్భంకొద్దీ దూకుడుగా ఆశిస్తున్న అభినందనం కాదు; తెలుగు

# భమిడిపాటి మాటకచ్చేరి



[కామేశ్వరరావుగారు వ్రాసిన 'మాటవరస' (1939) అనే వ్యాస సంపుటిలోంచి.]

ఆంధ్ర విద్యార్థుల సమావేశం యొక్క కార్యక్రమం యావత్తున్నూ ఇంగ్లీషు భాషలోనే జరిగి ఉండడం వల్ల వారు తమ భాష మానుకోడంలో ప్రకటించిన స్వార్థత్యాగానికి సాను భూతి కనబరుస్తూ అక్కడ హాజరుకాని ఆంధ్రేతరులు ఒక తీర్మానమున్నూ, అరిటిపండు ఒలిచినట్లు భావబోధ అయి ఉండడంవల్ల ఆమోదం వెలిబుచ్చుతూ హాజరైన ఆంధ్ర స్త్రీ బాలవృద్ధులు ఒక తీర్మానమున్నూ, ఏ దిక్కూ లేని తమ ఇంగ్లీషుని శ్రమపడి ఆంధ్ర విద్యార్థులు నిలబెట్టినందుకు తమ అమిత కృతజ్ఞత సుమ్మరిస్తూ లండన్ కవులు ఒక తీర్మాన రాజమున్నూ గావించి పంపినారని లోగడ ప్రచురించబడిన సంగతి కల్ల వార్త అని మా విలేఖరి పంపిన సవరణ నేడే మాకు చేరింది.

## విడాకులం:

లకుపిల్లి నగరంలో చాలామంది జేరి, భార్యాభర్తల విడాకుల చట్టం ఉంటేనే చాలా బాగుంటుందని ఏకగ్రీవంగా తీర్మానించారు. ఈ అభిప్రాయానికి ప్రతికూలంగా ఉన్నవాళ్లని వారు లోపలికి రానియ్యలేదు; దూసుకుపోయి వచ్చినవాళ్లని నోరెత్తనియ్యలేదు. ఈ తీర్మానం ప్యాసుచేసినవారిలో చాలా మంది భార్యలూ కారు, అఖరికి భర్తలేనా కారు.

ఈ మధ్య ఒకచోట ఒక ప్రసిద్ధ గాయకుడు ఉప్పొంగిపోయి గానం చేస్తూ 'బ్రోవసమయమిదే, రామయ్యా! అనే మాటలుగల కీర్తన సెలవియ్యడంలో రాగతాళ భావాలకి యథా శాస్త్రీయంగా జాగ్రత్తపడి మాటలు మాత్రం 'బ్రోవ సామయర్-మీద రామయర్' అని సెలవిచ్చారని అప్తుల ద్వారా తెలిసింది.

## కలియోగం:

గోదావరీతీర జనులు పుణ్యజనుల నిన్నీ ఋషులనిన్నీ ఎక్కడివాళ్లో అను కుంటారు. పుణ్యజనులు అవడంలో ఆశ్చర్యంలేదు ఈ యుగంలో. కాని ఇక్కడ ఋషులు ఉండడం మాత్రం నిజం. ఎంచేతంటే మెయిన్‌రోడ్డుమీద (రాజమండ్రి) ఎక్కడ చూసినా (జనం) ముక్కుమూసుకుంటారు, స్మరించు కుంటూ ఉంటారు.

## తెలుగువాడు:

"ఎవరు మీరు?"
"ఒహా గొప్పవాణ్ణి."

* * *

"నామీకే వస్తోయ్!"

* * *

ఒకొక్క మారు విధవపని చేస్తేగాని గొప్పతనం రాదు.

* * *

ఆంధ్రుడు అనంతవాది.

## మేస్టరు గిరీ:

మేస్టరీ ఉద్యోగం ఇన్నునుపేట బ్యాండులాంటిది. దారిద్ర్యానికి తెలుగు మే స్వరం పై ప్రీతి...మేస్టరీ చిన్న సైజులో సర్వజ్ఞత్వం...పిలవకుండా వెళ్ళినపుడు గెంటకుండా పొమ్మన డమే కట్నం (మేస్టరీకి)...సన్యాసి అయినవాడు మేస్టరీకి తంగున పనికొ తాడు...బడిపంతులికి సిరాస్తి భార్య, వరాస్తి తనే! బడిపంతులికి నమ్మకంగా వచ్చే సాలాదాయం ఒక అడశిసువు కొండొకచో కవలలు. బడిపంతులు అంటే ఘనీభవించిన అమాయకత్వం.

అసలే మేస్టరు. అందులో తెలుగు మేస్టరు. ఆపైని ఇంగ్లీషు బళ్లో తెలుగు మేస్టరు. దరిమిలాని తెలుగువాళ్ల ఇంగ్లీషు బళ్లో తెలుగు మేస్టరు.(ఇంగ్లీషు) పావకంలో పుడక!

## నిర్వచన వాచకం:

నవ్వే అంటుడు దినుసు...వాతగొట్టినా తల్లిభాష రానివాడికి చచ్చినా పరిభాష రాదు... తినా తినక తినానియ్యక కంగాళీ చెయ్యడం మానవతేతరలక్ష ణం... విరుదుయొక్క బలువు ఇచ్చే వాడి సామర్థ్యాన్ని బట్టి ఉంటుంది గాని, పుచ్చుకునేవాడి ప్రజ్ఞబట్టి సాధా రణంగా ఉండదు.

## త్రివర్ణ చిత్రం:

అసలే కోతి. అందులో కల్లుతాగింది. ఆపైని తేలుకుట్టింది. దరిమిలాను దెయ్యం పట్టింది. పైగా ఎన్నికలకు అభ్యర్థిగా నిల్చింది.

## సందేశం:

అసలు దేశంలో బలం ఉంటేగానీ, ఉపదేశంలో బలం ఉండదు. ★

---

మాట పలుకుబడి సొగసుమీద ఆయనకుగల పలుకుబడి అంతటిది. "తెలుగువాళ్ళ ఇంగ్లీషు నడికారం" తమాషాలుకూడా, కామేశ్వరరావుగారి 'బడి' లోనే తెలుసు కోవాలి.

కామేశ్వరరావుగారు మనందర్నీ ఎంత నవ్విస్తారో అంత నవ్వని మనిషి; అంత మంచి మనిషి. రాజమండ్రి ఆర్ట్సు కాలేజిలో ఆయన ప్రసంగాలు విన్నవాళ్లకి పైవిషయం, ఆయనను స్వయంగా ఎరిగున్నవాళ్ళకి రెండోదీ బాగా తెలుసు. ఆ వ్యక్తి ధైర్య స్థైర్యాలగురించి, యావదాంధ్రులకూ తెలుసు......ఇవన్నీ తెలిసినవాళ్లకి "1958 ఆగస్టు 28 అర్ధరాత్రివేళ సుప్రసిద్ధ హాస్య రచయిత, హాస్యబ్రహ్మ శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు అస్తమించారని తెలుపుటకు చింతిస్తున్నాము" అన్న పత్రికా వార్త చటుక్కున బోధపడదు. నమ్మడానికి మనసొప్పదు. మృత్యుదేవత తన చాయలకి వస్తే "ఇదివిటిలా తక్కువ వచ్చావు. ఎదురు తప్పగావాను" అని నవ్వుతూ తీవిగా దులపరించేవారనిపిస్తుంది...ఆయన, 'అర్ధాంగపాని ఖాళీచేసి వెళ్ళినా, అమనిషిలో ఈ అరవై ఏళ్ళూ వసచేసిన మనీషి—మనంద రికీ అర్థమైన, మనని అలరించిన, మన కోసం బాధపడిన వ్యక్తి—భమిడిపాటి కామేశ్వరరావునిగాని, 'కాలంపోయినా, నిలిచే ఆయన మాట'నిగాని తెలుగునాట ఏనాటికీ ఏదీ ఏమీ చెయ్యలేదు...... ★

# కలం స్నేహం

రావి కొండలరావు



నీట్లో మునిగిపోతున్నవాడు కట్టెపుల్ల కనిపిస్తే బ్రతుకుమీద ఎంత ఆశపడతాడో–పదిరోజులుగా తిండిలేక మాడిపోతున్న వాడికి అంతదూరంలో అణాకాసు కనిపిస్తే ఎంత ఆనందం పొందుతాడో—ఉద్యోగం కోసం, సంవత్సరాలతరబడి దరఖాస్తులు పంపుకుంటూ ఏదీ రాకపోగా నిరుత్సాహపడేవాడికి, చిన్న నౌఖరీ చూపిస్తే ఎంత సంబరపడతాడో—ఈ పుస్తకంలో 'అది' కనిపించగానే అంత ఆశా ఆనందమూ సంబరమూపడి, సంతోషంలో ఒళ్ళుమరిచి కెవ్వన కేక వేసి, అమాంతం కుర్చీలోంచి అడుగుదూరం పైకెగసి, మళ్లీ కూలబడి తెలివి తెచ్చుకుని, గుండెమీద చెయ్యి వేసుకుని "అమ్మయ్య" అని ఉల్లాసంగా నిట్టూర్చాడు సుబ్బారావు! 'అదే'మిటంటే చాలా రోజులుగా సుబ్బారావు ఎదురు చూస్తున్న 'కలంస్నేహం' ఇవాళ ఈ పుస్తకంలో కనిపించింది. "కుమారి టి. ఇందిరాదేవి, 19 సంవత్సరాల వయస్సు, అభిరుచులు: సాహిత్యపఠనం, రచన, లేలిక సంగీతం, సినిమాలపై విమర్శ—" ఆమె చిరునామా క్రిందవున్నది. తన అభిరుచులు గల వ్యక్తితో స్నేహం చెయ్యటానికి ఇందిరాదేవి గాఢంగా కాంక్షిస్తున్నది! ఆ అభిరుచులన్నీ చదివి—"ఇవన్నీ నావే, నావే" అనుకున్నాడు సుబ్బారావు తన్మయుడై. ఈ అభిరుచులు కలిసి—తనకంటె వయస్సులో మూడు, నాలుగు సంవత్సరాలు తక్కువైవుండే అమ్మాయికోసం సుబ్బారావు తపస్సుచేశాడు—ఇవాళ దాదాపు ప్రత్యక్షమైనట్టే! సుబ్బారావు ఆదర్శం ఏమిటంటే తన అభిరుచులు కలిగే అమ్మాయితో 'కలంస్నేహం' చేసి, ఆమెను ప్రేమించి పెళ్లి చేసుకోటం!

ఐతే ఈ ఇందిరాదేవి తనను ప్రేమించవద్దూ? ఆమెకు అటువంటి అభిప్రాయం వున్నదో లేదో—లేక ఇంకెవడన్నా ప్రియుడున్నాడేమో! ఏమయినాసరే, ఆ అమ్మాయికూడా తనను ప్రేమించేటట్టు చేసుకోవటం తన విధి! చేసుకోలేకపోతే తన తెలివంతా నిష్ప్రయోజనం! సుబ్బారావు నూటా ఒక్కసారి ఆమెపేరునూ, అభిరుచులనూ, చిరునామానూ, క్షుణ్ణంగా చదివి, కంఠతా పెట్టేశాడు! 'ఇందిరాదేవి' ఆహా! పేరుకూడా అందంగా తను కోరుకున్నపేరులాగే వుంది. సుబ్బారావు తనజీవితం ఇప్పటికి కదా సఫలము కాబోతున్నదని హాయిగా పాడుకుంటూ, పుస్తకాన్ని తీసుకొని వాయువేగ మనోవేగాలతో రామ్మూర్తి రూముచేరాడు. (రామ్మూర్తి గది 'లోకల్ రోమియోస్ అసోసియేషన్' కార్యాలయం వంటిది. రామ్మూర్తే దానికి ప్రెసిడెంటు. సభ్యులంతా సెలవురోజులలో సమావేశమవుతూ చర్చలూ, తీర్మానాలూ జరుపుతూ వుంటారు.)

"దొరికిందిరోయ్ దొరికింది" అన్నాడు అరున్నర శృతిలో సుబ్బారావు గదిలో అడుగుపెడుతూ.

"ఇక్కా! ఏమిటూ దొరకటం?" అన్నాడు రామ్మూర్తి పత్రికలో 'భగ్నప్రేమ' చదువుకుంటున్న వాడల్లా చిరాగ్గా కదిలి.

"పెన్నిధిరా నాయనా! దా—చూడు – నీ కళ్లతోనే చూడు. నేను చెబితే నమ్మవు. ఇన్నాళ్లకు నా సమస్య తీరింది. ఈ రోజు నుంచి సుబ్బారావులో శూన్యత సున్నగావవు. వాడి ప్రేమైన, వాడి జీవితం చిగిరించబోతున్నది. ఇహ వాడు..."

"అబ్బబ్బబ్బ బ్బ... ఏమిటూ జరిగింది?"

"నేను చెప్పను. నువ్వే చూసుకో" అని చూపించాడు సుబ్బారావు.

అంతా చదివి, రామ్మూర్తి "ఐతే?" అన్నాడు కనుబొమలు చిట్లించి.

"నాజమ్మ. 'ఐతేట ఐతే'—ఇదా నీ తెలివి? నీతో ఏమని చెబుతూ వచ్చాను? నా అభిరుచులుగల పిల్లకోసం చస్తున్నానురా అని చెప్పలేదూ? అదే—ఆ పిల్లే ఇవాళ చేతిలో కొచ్చింది!"

"ఇహ నువు ఉత్తరాలు రాసి ఆమెను వశం చేసుకుంటావన్నమాట!"

"కరక్టు. వశం చేసుకోవటం ఏమిటోయ్–నన్ను తప్ప ఇంకోడిని పెళ్ళి చేసుకోనని ఆమెచాతే అనిపిస్తాను."

"కొంపమునిగిపోయిందిరా సుబ్బారావ్!" అన్నాడు కపీమని రామ్మూర్తి తలపట్టుకుని.

"ఎవరిదిరా బాబూ ఎవరిది? నీదా–నీదా?" అన్నాడు సుబ్బారావు ఆత్రుతగా.

"నీదే—ఏం లేదు—ఈ ఇందిరాదేవి కొంపదీసి అనాకారి ఐతేనో?" అన్నాడు రామ్మూర్తి.

సుబ్బారావు ఐదు నిమిషాలపాటు భళ్ళు భళ్ళుమని నవ్వి—

"వెధవ సంస్కారం అక్కడే దెబ్బతిన్నది. అనాకారి ఐనా సరే—చేసుకోక తప్పదు. ఇక్కడ ఆకారం ప్రసక్తి లేదు–అభిరుచుల ప్రసక్తేగాని!" అన్నాడు చెయ్యి తిప్పుతూ.

"ఐతే సరే" అన్నాడు రామ్మూర్తి.

* * *

"రామ్మూర్తి రూమ్‌లో కూచునే సుబ్బారావు ఇందిరాదేవికి ఒకటో ఉత్తరాన్ని తయారు చేశాడు—కొంత కాఫీ త్రాగి, కొన్ని సిగరెట్లు కాల్చి.

"ఇందిరా రామ్మూర్తి ఐంది. ఇహ విను!

అన్నాడు సుబ్బారావు. రామ్మూర్తి వింటున్నాడో లేదో కూడా గమనించకుండా ఉత్తరాన్ని చదవసాగాడు:

"కుమారి ఇందిరాదేవి గారికి—

కేవలం భగవంతుడు పంపినట్టు-మీ చిరునామా గల పత్రిక చూసి, ఆనందపరవశుడనయినాను. మీ హాబీలే నా హాబీలు...నా హాబీలే మీ హాబీలు! ఎంతకాలంనుంచో ఇటువంటి స్నేహంకోసం ఎదురుతెన్నులు చూస్తేగా మీరు కనిపించటం నా అదృష్టం. నేను ఈ వూళ్ళో కాలేజీలో చదివి, బి. ఏ. లో ఒకభాగం విజయం పొంది, మిగిలిన భాగాలలో కూడా పొందటానికి కృషి చేస్తున్న ఇరవైమూడు సంవత్సరాల విద్యార్థిని. పాటలు, గేయాలు, కథలూ రాశాను. పాడగలను. హార్మొనీ వాయించటం కొద్దిగా తెలుసును. ఇరవైనాలుగు గంటలలోనూ ఎక్కువకాలం సాహిత్య పఠనం చేస్తాను. వచ్చే ప్రతీ సినిమా చూసి, స్నేహితులదగ్గర చర్చిస్తూవుంటాను. మీ స్నేహాన్ని కాంక్షించటమే నా జీవిత పరమావధి. ఇకమీదట నిరాటంకంగా సాగరంలో కెరటాలు పుట్టినట్టు అదేపనిగా మనం ఉత్తరాలు రాసుకోవాలని నా కోరిక. అన్ని విషయాలతోనూ వెంటనే పై చిరునామాకు జవాబు రాస్తారని ఎదురుచూస్తున్నాను.

భవదీయుడు,

వి. సుబ్బారావు.

కలం పేరు: ("సుబ్బశ్రీ")

"కాస్త చిన్నదయిందంటావా?" అన్నాడు సుబ్బారావు ఉత్తరం చదివి.

"పెద్దదేమిందేమో! ఫరవాలేదులే. పోస్టు చెయ్యి" అన్నాడు రామ్మూర్తి. సుబ్బారావు చిరునామా కేరాఫ్ రామ్మూర్తిగా ఇచ్చాడు.

ఇందిరాదేవికి ఉత్తరం పోస్టయిన మరుక్షణంనుంచీ సుబ్బారావుకు ఏదో దిగులూ, అంతలోనే ఆనందమూ మధుర భావాలూ అన్నీ కలగసాగినై. ఆ రాత్రి అతనికి నిద్ర పట్టలేదు. ఇందిరాదేవి రూపాన్ని వూహించసాగాడు—ఆమె నవ్వితే పలువరస ఎటా మెరుస్తుందో-ఆ పొడవైన నల్లనిజడ త్రాచల్లే ఎట్లా వ్రేలాడుతున్నదో-ఆ నల్లని కాటుక కళ్ళల్లోని నీలినీడల్లో తనెట్లా కరిగిపోవాలో—ఇవన్నీ ఆమెను చూసినట్టె రూపకల్పన చేసుకుని, భావించుకున్నాడు. తన ఉత్తరంలోని భావాలకు ఆమె ముగ్ధురాలవుతుంది—తన చేతివ్రాతకు ఆమె మురిసిపోతుంది—తనవంటి స్నేహితుడిని పొందినందుకు ఇందిరా

(60-వ పేజీ చూడండి)





# చిరుచెమటలూ చందనం

## కల్యాణసుందరీ జగన్నాథ్

ఆంతరిక్షం దీపాలు వెలిగించుకున్నది ఆ నక్షత్రాల వెలుగులో, లోగిలి వెనక మండువాలో నించునుంది అలివేలు పూసిన రెంగేడిలా.

కనుమరుగుగా, దేవుడి గుళ్ళోకి వెళ్ళాలి. ఒంటరిగా రాత్రి బయలుదేరడం ఇదివరకెన్నడూ అలవాటు లేదు. కాని ఆ విషయం తనకి గుర్తైనా రాలేదు.

చుట్టాలతో పక్కాలతో ఇల్లంతా కిసకిసలాడుతూంది. పచ్చి తాటాకు పందిళ్ళూ, మామిడాకు తోరణాలూ, పసుపుకుంకం, మల్లిపూలూ గంధం, విరిసిన కుండలసాంపు,పిల్లల పరుగులూ, పెద్దల చిరునవ్వులూ, వరసయినవాళ్ళ పరసాలూ – పెండ్లి నిండుతనం సందడి అంతా పందిరినిండా 'గుబాళిస్తూంది.'

అంతవరకూ కన్నీరు మున్నీరుగా ఏడ్చిందిఅలివేలు.

అందరూ ముందర పందిట్లో నేడున్నారు. ఘుమాయిస్తోంది. ఉక్క. అపగటివర్షానికి.ఆకొలపువాన. ఫెదజల్లు విసిరింది. పెండ్లికి వేసిన ప్రహారీ బచ్చళ్ళ అడుగులు తుడుచుకుపోయాయి...

తల్లి పాలుచాలకపోతే, పాలిచ్చి, తనని ఎత్తుకు దించిన నాగమ్మ ముఖం చీకటి క్రమ్మింది.

"ఆ! ఏం లేదు. మన్నుపుతోలకరి. ఇక్కడా కొంత ఇసురు ఇసిరింది." అంది పైకి. పెళ్ళి బచ్చళ్ళు కరగక్కూడదని పెద్దలంటూరుగా, తప్పని. నాగమ్మకుండె బరువైంది. "గంగిగోవులాంటిది. దెమ్మ ఎట్టారవి పెట్టాడో" తనలో తాను భయంగా గొణుక్కుంది.

*　　　*　　　*

సత్యమూ, తనూ కలిసి పెరిగారు. వాళ్ళ పొలాలు కొడిగట్టువి. సత్యం చెల్లెలు జానకి తప్ప అలివేలుకి అంత జతకత్తె... వేరే లేదు. ఆపూళ్ళో. వాళ్ళ పెద్దవాళ్ళూ వరస లెట్టుకుని పిల్చుకునే వాళ్ళు.

కంచాన పాలూ అంమన వెన్నా పెట్టి పెంచింది, సత్యాన్ని వాళ్ళమ్మ. కడసారపు కొడుకు. అతను ఆడిందాట, పాడిందిపాట.

చిన్నప్పుడు, బడిపంతులుగారొకసారి పలకమీద 12 అంకె లెయ్యమంటే, 11 అంకె వేసి 12 అన్నాడు—అది త్రికరణశుద్ధిగా పన్నెండేనని నమ్మి, కాదని పంతులుగారు కొట్టారు. సత్యానికి కోపం వచ్చింది. తనని ఇంకోకళు కొట్టడమే! ప్రక్క కుర్రాడు అతని పలకచాటుగా గుసగుసలుగా ఎంతో చెప్పాడు. తప్పని. సత్యం తన నమ్మకం వదలలేదు—ప్రాణంపోయినా సరే, తను నమ్మింది నిజమనుకున్నాడు. మరో నాలుగు దెబ్బలు తిని చదువు చాలించాడు.

ఇకను, బుద్ధి తెలిశాక తనంతట తానువృద్ధి చేసుకున్న చదువే.

*　　　*　　　*

పైన కొత్త మబ్బు పట్టగానే సరి, అలిమేలూ, జానకీ, సత్యం వాళ్ళంతా "వానొచ్చె పెద్దమా వడు తియ్య పెదమ్మా" అంటూ పరికిణీలూ, జడకుచ్చులూ గిర్రున తిరిగేటట్టూ గిరగిరా, చేతులుచాపుకుని గుండ్రంగా వాకిళ్ళన్నీ తిరుగుతూ ఆడుకునేవాళ్ళు.

విశరాలొస్తూన్నాయి, వాళ్ళకి. ఒకనాడు జానకి చేతిలో ముల్లు

విరిగింది పచ్చని చెట్టుకేసి చూస్తూండమని జానకి చేతిలోనించీ సుటి, ఆ ముల్లు తీసేసింది అలిమేలు అతి సుతారంగా. కాని జానికికి చురుక్కుమని గుచ్చుకుంది ఘటు "రాకాసి వదిన" అంది నవ్వుతూ. ప్రక్కనే నిలబడి ఉన్న సత్యం, అలిమేలు ముఖంలోకి చూస్తూ చిరునవ్వు నవ్వాడు. అలిమేలు మహా ఉడుక్కుపోయింది.

* * *

ఆటలతో పాటలతో బాల్యావస్థ, ముగ్గురికీ గడిచిపోతూంది.

రామిరేవు చీలమండలు తడవదు. కాని అగమి విసురుకి? పావడాలూ కుచ్చెళ్లూ చేత పట్టుకుని ఆడపిల్లలంతా దాటుతున్నారు. పాదాలక్రింద యిసక కొట్టుకుపోతూంది. పాదాలు తేలిపోతున్నాయి. సత్యం జానకిని తన చేతులమీద ఒడ్డు చేర్చాడు. తిరిగి వెళ్ళి అలివేలుని కూడా ఎత్తుకుని వచ్చాడు. అల్లాగే. గట్టుమీద ఛటుక్కున వదిలేసి, కడితిని జుట్టూ పట్టుకుని గబగబ వెళ్ళిపోయాడు. అలివేలుకి భిడియం కష్టంకూడా వేశాయి...

ఆ సాయంత్రం గూళ్లుచేరాక, "ఎక్కడికెళ్ళావే అమ్మాయ్?" అంది అలివేలు బాబమ్మగారు. "జానికీ, నేనూ రామిరేవు గట్టుమీదికి జాంపళ్లకోసం వెళ్ళాం" అంది. "ఓసి! నీయాగడం చల్లగుండ! ఇద్దరాడపిల్లలు ఒంటరిగా అంతదూరం వెళ్తారా? అదుపులేని గుర్రాలు అగడ్తలు దాటినాయని" అంది బాబమ్మ.

"ఇద్దరం కాము సత్యంకూడా వున్నాడని" అనబోయింది.

కాని నోరు రాలేదు.

నాలుగు సంక్రాంతులు గడిచాయి.

* * *

"వీడి కొండెంత? వీడి బ్రతుకెంత! మరి రెండరకలుంటే వీణ్ణి పట్ట పగ్గాలుండేవి గావుసుమా!" అంటూ ఇంటికొచ్చాడు అలిమేలు తండ్రి రమణయ్యగారు

"ఎవరు?" అంది భార్య. "సీతప్పగారి పత్తెం. తనచేలో బోదిలూడ్చుకోమన్నాడంట నుళ్ళావాళ్ల పాలేగుని, చిన్నావా! బోగులు! ఇల్లాచేస్తే మనచింతాలు రెండు మళ్ళు వదిలి పెటమంటాడు నన్ను రేపట్నుంచీ—ఆ! ఖాయంగా నేర్పుకోరా, అంట!"

* * *

ఊరిమువ్వ దిబ్బమీద జువ్విచెట్టు ప్రక్కన పందిక్కి కట్టిన పెద్ద తాటిబద్దల ఉయ్యాల, అందరూ ఊగుతూంటే, జానకీ, అలివేలూ కూడా తయారయ్యారు. ధయిస్తురాలని తెలిసి అలివేలుని గట్టిగా ఊపాగు-మరి కాస్త-కళ్ళు తిరిగాయి. ఏడ్చి మొత్తుకుని దిగేసి, జానకి భుజంమీద తలపెట్టి కళ్ళు గట్టిగా మూసుకుంది. చెంపులో ఎడ్లకి నీళ్ళు పెడుతూ సత్యం చూశాడు. గబగబ తోక త్రొక్కిన త్రాచులావచ్చి, దూరంగా వుండగానే "అమ్మాయ్, జానకీ, ఏం చిలిపి చేష్టలివ్వి! పదండి ఇంటికి ముందర." అని ఒక్క అదలికింపు అదలకించి, "పడి కాళ్ళు చేతులూ విరగ్గొట్టకోటానికా?" అన్నాడు. అలివేలుని బలవంతంగా లాగుతున్న పిలలంతా చేతులు వదిలేశారు. "పద పోదాం" అంది జానకి నిమ్మళంగా

జానకి భుజంమీద చెయ్యి వేసుకుని కాళ్ళీడుస్తూ, అలివేలు వెనక్కి తిరిగిచూచింది. సత్యం అక్కడే నిలబడి చూస్తున్నాడు. అలివేలు హృదయం నిండిపోయినట్టయింది. అతని అవ్యక్తప్రేమని గ్రహించుకోగలిగింది.

ఆ రోజంతా సత్యం కళ్లల్లో మెదుల్తనే ఉన్నాడు-అలివేలుకి.

ఆ యేడు కోతలయ్యాక, ఒకనాడు, రమణయ్యగారు ఇంటికిరాగానే "ఈ సత్యంగాడికి వెర్రితలలేసున్నాయి! ఈ వేళ నురిపిడిలో ఎడ్లు కంకులుతింటోంటే, ముట్టిమీదేమో కాస్త వేశాడంట, చిన్నపాలేరు. ఆమట్నే వాడి చేలోనించివచ్చి సరాసరి కడియంలోకి జొరబడిపోయి వీణ్ణి రెండు లెంపకాయలేశాడంట. పైగా, 'అడ్డగాడిదలాగ నోరులేని జీవాన్ని నోటిమీద వేస్తావురా? వాటి కష్టమంతా తింటానూ! అది తింటే ఏరా అడ్డెడ్డోడ్లు కష్టపడే టప్పుడూ. ఉన్న గంజలు చాలవురా మీకూ, అని ఇంకా ఏవేవో పిచ్చికూతలు కూడా కూశాడంట. అసలు వాడికెందుకూ అంట, ప్రక్కమడిలో గొడవ."

"అదేం?" అంది భార్య.

* * *

ఒనాడు చద్దన్నాలయాక "యేటిగట్టుకి నేరేడి పళ్లకి పోదాం, రా" అంది జానికి.

చేలోకి వెళుతూ సత్యంచెట్టు దగ్గిర ఆగి, పెద్ద పెద్ద పళ్లున్న కొమ్మలు దులిపాడు. జానికి యేరుతూంది.

"మీ అయ్య సమ్మంధం వెతుకుతున్నాడంటగా?" అన్నాడు సత్యం, అలివేలుకి కొంచెం దూరంగా చతికిలబడుతూ.

అలివేలు కాళ్లు చాపుకు కూచుంది. జానకి చిన్న ముతా వాళ్ళనందరినీ బెదిరించి పెద పండ్లు ఏరుకుంటోంది ఆబగా.

"ఏం మాట్లాడవేం?" అన్నాడు తిరిగి. "ఏం మాతో చెప్పకూడదా?"

అలివేలు, తలవంచుకుని, నేలమీద పాకుతూన్న గండు చీమని పరీక్షిస్తూంది.

"ఊళ్లో నెకలిగిన వాళ్ళని వెతుకుతున్నాడంటగా మీఅయ్య, నిజమేనా?" అన్నాడు సత్యం ప్రశ్నను రెట్టిస్తూ...

"ఉన్న ఆస్తి చాలదా మీకు"?

అలివేలు మాటాడలేదు.

"నీకేమన్నా మూగినోమూగట్టా వుందా ఏం? మాట్లాడవూ? ఇదిగో ఒకసారిటు చూడు" అన్నాడు సత్యం.

నీళ్లు కమ్మిన కళ్లు పైకిచూశాయి.

"నాకు తెలవదు" అంది నిమ్మళంగా.

వెంటనే "అమ్మోయ్!" అని అరిచి కాళ్లు గాబరాగా దగ్గిరకు లాక్కుని, కాలిబొటనవేలు చేతో తడుముకుంది.

"ఏం? ఏం?" అన్నాడు మరీ గాబరాగా సత్యం.

"చీమ" అంది. "గండుచీమ. కుడితే, తేలు కుటినంత తీపి" అంటూ, అక్కడే పడివున్న పచ్చిరొబ్బతో నలిపేశాడు చీమని. చీమ రెండుతణాలయ్యి కొట్టుకుంటోంది. "చంపెయ్. చంపెయ్యి". అంది భయంగా అలిమేలు.

"బయ్యమే?" అన్నాడు చిరునవ్వుతో, తిరిగీ ఒక దెబ్బతో చటుక్కున చంపేసి.

"ఊహు! అదికాదు. కొనూపిరితో ఉంచకూడదంటగా. పాపం. ఊపిరుంటే. ఏకొంచంవున్నా, దేముడితో చెప్పతాయంట."

"పిచ్చిపిల్లా! నుతిమెత్తని గుండె నీది" అన్నాడు తృప్తిగా, సత్యం.

"ఏమయిందేం? ఏమయిందీ?" అంటూ వళ్లో పళ్ళుపోసుకుని గబగబావచ్చింది జానకి.

ఆరోజంతా మతి, మతిలోలేదు, అలిమేలుకి. ఒకవేపు ఏడుపూ, ఒకవేపు సంతోషం ఉవికివచ్చేయి.

రోజులు గడుస్తూన్నాయి.

* * *

ఒకసారి, హడావుడిగా, సత్యంవస్తూ "ఇదిగో చూడు, మన జమిందారుగారు రంగారావుగారెంత మంచివాడనుకున్నావు? మొన్నటినించీ మాకు కాస్నేహం కలిసింది. దూడకి లేతపరకలకోసం చేలోకి వెళ్లాను. వాళ్లి కారు ఆగిపోయింది, రోడ్డువద్ద నన్నుజూసి సౌతంత్రంగా, 'కొంచంతోయ్యాలి తమ్ముడూ' అన్నాడు. వారా వీరా అని కేకేసి నలుగుర్ని పోగుచేశాను. ఇంటివరకూ తోశాం. లోపలికి రమ్మన్నాడు. ఇంట్లో అందరూ వెళ్ళాక చానాసేపు మాట్లాడాము. అసలు నేను కాంగ్రెసు వాదినైపోదామనుకుంటున్నాను. బస్తీకెళ్లి అయినాసరే. ఇక్కడైనా సరే" అన్నాడు ఏకధాటిగా.

"అంత ఉద్యోగం నీకెట్లావస్తాది? అంత చదువు చదవాలగదా?" అంది అలిమేలు, విచారంగా.

"ఓస్ వెర్రిపిల్లా, అది ఉద్యోగంగాదు, అది ఒకసేవ దేశంకోసం అబ్బో! ఇంకా ఎన్నో సంగతులు చెప్పారు మనగాంధిగారు చెప్పిందీ అదేనంట. ఇంకా చాలా,

# ★ చిఱుచెమటలూ చందనం ★

ఉందిలే. ఆయన అపుడపుడు వస్తావుండ మన్నాడు కూడా, వారి చెల్లెలు రాం భాయమ్మగారు పట్నంనించీ పెద్దచదువు చదివి వచ్చిందంట. ఏం స్వతంత్రం! ఏం కథ! ఎదురుంగావచ్చి పలకరించేసిందంటే! పేరు అదీ అడిగింది. అసలు నేను చేతిలోవున్న దూడగడ్డి వాళ్లపెరట్లో వదిలిపెట్టివచ్చా, మర్చిపోయి. రెండుమెట్లు దిగానో లేదో, గుమ్మంలోకి వచ్చి, పేరుపెట్టి పిలిచి ఆ గడ్డి చేత్తో వాకిచ్చిందంటే, చిరునవ్వుతోటి!!" అన్నాడు సత్యం. "ఏం చక్కని చీరగట్టిం దనుకున్నావూ" అన్నాడు గుక్కతిప్పు కున్నాక.

త్రిప్పుకునే వున్న అలివేలు మొఖం చిన్నబోయి ఓ ఛాయ చెన్నుదరిగింది... ఎందుకో, వివరంగా లేదు, తనకే.

"అట్లాంటి చీరగట్టి నివ్వు ముస్తాబయితే. చూడాలని ఉంది" అన్నాడు సత్యం.

అలివేలు, మనసు ఉప్పొంగిపోయింది.

*　　*

అలివేలుకి సంబంధం గట్టిగా చూస్తున్నారు.

ఒకనాడు, ఆనుమళ్ల రోజుల్లో, కోడి గట్టుమీద కాళ్లగోరింటాకు కడిగేసుకుంటున్నారు, ఇద్దరాడపిల్లలూనూ. పొలంలోనించీ చూసివచ్చాడు, సత్యం.

"మీ బాబుగుణం నాకు నచ్చలేదు. కుమ్మరావంలో ఇత్తడికుండ పుట్టినట్టూ, నువ్వు పుట్టుకొచ్చావుగాని ఆ పుణ్యశాలికి. అతనికి డబ్బే దేముడు. అతనితో నేనుగాని మావాళ్లుగాని ఎళ్లి సంబంధం మాట్లాడతారన్న మాట బ్రహ్మకల" అన్నాడు. కొంచ మాగి "తీరా మేమడిగితే పుసుక్కుని కాదూ కూడదని అతనంటే — నేనసలే ఉగ్గబెట్టలేని మనిషిని. ఇక కృతిమించుకొస్తాది." అన్నాడు సాచ్చుకునిఉన్న తుమ్మ మొద్దు మీద జారిగిలపడుతూ. అలివేలు కళ్లప్పగించి ఊరుకుంది. నోటమాట రాలేదు. "ఇక నేమిగతిరా దేముడా!" అనిపించింది లోపల. బావ పట్టు వదిలేనా!

సత్యం మరికాస్సేపాగి. తదేక దృష్టితో "నాకేం చెయ్యాలో పాలుపోవటం లేదు పిల్లా" అన్నాడు. "సన్యసించి ఎందైనా బడిపోదామా అనిపిస్తావుంది. ఒక్కొక్కసారి పిచ్చి పట్టేవట్టవుతాది" అన్నాడు నిదానంగా.

అలివేలు గుండె గబగబా కొట్టుకుంది. కళ్లు మూసుకుని సత్యం కాళ్లమీదపడి, దేవుడికి దణ్ణంపెట్టాలనిపించింది. కాని చేతులూ కాళ్లాడలేదు.

"అస్తుదేవతలుంటారంట బావా. తప్పు అట్టా అనబోక" అంది కాస్సేపాగి ధైర్యం చిక్కబెట్టుకుని.

*　　*　　*

కారి వెళ్లి కార్తి వస్తోంది.

"మీవాళ్లతో నివ్వుచెప్పు మా అయ్య నడగమని" అంది నిమ్మళంగా ఒకనాడు సేమతుమ్మపండ్లు కోస్తూ.

"ఛస్ నేనే! మీ బాబునే ఉహు! నీ పొడతనికి గిట్టదు. అతనంటే నాకు గిట్టదు." అన్నాడు అందని కొమ్మని అలివేలుకి వంచి, అందిస్తూ. అందుకోకుండా కొమ్మ వదిలేసింది...

కళ్లనిండా నీళ్లునిండాయి.

పిలవచ్చిన పాలేరుతో కలసి సత్యం వెళ్లియాడు.

"ఇంత లేసి పళ్లుండంగా ఈ లేతపిందెలు కోస్తావేం?" అని గసిరింది జానికివచ్చి. సత్యం ఆలోచిస్తున్నాడు దీర్ఘంగా. కాలం గడచినకొద్ది సత్యం మనసు కరిగించమని అలివేలు దేవుళ్లకి మ్రొక్కుకుంటోంది.

*　　*　　*

మండు ఎండల్లో లేగని వెతుక్కురాబోయి వడదెబ్బతిన్నాడు సత్యం. జ్వరం వచ్చింది.

అలివేలుకి దూరపు సంబంధం నిశ్చయం చేశారు అవతల వాళ్లడబ్బుని బట్టి. వెనకా ముందు ఆలోచించకుండా ముహూర్తం పెట్టేరు.

సత్యానికి "సన్నిపాత జ్వరం తిరగదు. గండం" అన్నాడు పేరంటాలయ్య. అతను భూత వైద్యుడు కూడాను ఆ గ్రామానికి. ఆమాట వినగానే జీవచ్ఛవంలా గయిపోయింది, అలివేలు. యజ్ఞపశువులా పెళ్ళి కొప్పుకుంది. కాని మనస్సులో ఏమీ సోకటం లేదు. సత్యం ఒక్కడితోనే మనస్సంతా నిండిపోయింది. అంత గండం అతని కొచ్చి నప్పుడు, తానేమయితేనేం? బ్రతికితేనేం ఛస్తేనేం?

సంబంధం నిశ్చయమైన తరువాత బ్రతుకే బరువై పోయింది అలివేలుకి. ఒకనాడు నాగమ్మవడిలో పడి వెక్కి వెక్కి ఏడ్చింది. "ఆడబతుకింతేమా యమ్మా! పుట్టింటిని అయినోళ్లనీ వదిలి అందరమూ ఎళ్లాలిసిందే. బయ్యంలేదులే" అని సముదాయించింది. నాగమ్మ దగ్గరకు తీసుకుని. కాని ఎండకి ఎండి, వానకి తడిసిన నాగమ్మకి, ఏదో బిడ్డ మూగబాధ పడుతున్నట్టే తోచింది.

జ్వరం మొదటి రోజుల్లోనే, జువ్విచెట్టు క్రింద నిలబడ్డాడు సత్యం అలివేలు ఇంటి కేసి చూస్తూ. ధైర్యం చేసుకుని అలివేలు సందె చీకటిలోనే ఎదురుగా వెళ్లి ముఖం చేతులతో కప్పుకుని నిశ్శబ్దంగా ఏడుస్తూ నిలబడ్డది.

"నేనాలోచించాను. భయపడొద్దు. నేను జమిందారుగారితో మీ బాబుకి చెప్పిస్తాను. నా కంఠంలో వూపిరి వున్నంతవరకూ ఆ పెళ్లి జరగనివ్వనులే. రేపే రంగారావుగారితో మాట్లాడతాను" అన్నాడు నీరసంగా. ఎక్కడో అడుగుల అలికిడయింది. "నీవుపద, మొదట ఇంట్లోకి... ఇక నేనూ నుంచోలేను. కాళ్ళు పటివ్వడం లేదు." అన్నాడు.

నిర్జీవ ప్రతిమలా అలివేలు తన గదిలోకి, వెయ్యి తలపులతో వచ్చిపడ్డది.

*　　*　　*

"సీతమ్మగారికనిష్టుడిమాట నమ్మకంలేదమ్మా గుణంకూడా పుట్టుకొచ్చిందంట. పాపం" అంది నాగమ్మ రెండురోజుల తరువాత —

"పెళ్లి పందిట్లో అదేమ్మాటే? పిచ్చి దానా. అయినా పాపం ఎంత చేసుకున్నమ్మ కంత? సీతమ్మ గ్రహచారం కాకపోతే ఏమిటి" అంది అవ్వగారు ఉట్టిమీద నెయ్యి దించుతూ.

వారంరోజులు వరస్నగా కనబడకపోతే రంగారావుగారు స్వయంగా ఆచూకీ తీసి, వచ్చి సత్యాన్ని చూచిపోయారు.

*　　*　　*

కాని, ఆసాయంత్రం ముస్తాబయిన పెళ్లి కూతురికి ఇవ్వేవీ మతిలో సోకలేదు. బ్రతుకే ప్రార్థనయింది. సత్తెం బావ బ్రతకాలి. తానేమైనా సరే. కావలిస్తే తాను బలి ఉంటుందిగా.

దేముడి గుడికి కదిలింది. అలివేలు ప్రదక్షిణం చేసింది. పరమాణువులోనూ, బ్రహ్మాండంలోనూ ఉన్న కదలిక, ప్రదక్షిణం. పరమాణువులలో రేణువులూ, అనంత విశ్వంలోని సూర్య మండలాల్లో గ్రహాలు, చేసే ప్రదక్షిణం సూత్రప్రాయంగా చెయ్యమన్నారు పెద్దలు. అలవాటుగా గుడిచుట్టూ తిరిగింది అలివేలు. దణ్ణం పెట్టింది. ఏడ్చింది. సత్తెం బ్రతకాలి.

*　　*　　*

ఆ రాత్రి, "చూచావా నాగా, ఈయనగారి పని. మరి కాసిని వడ్లు దంపించి వుంచితే ఏం? ఆయనగారి పనులన్నీ ఇంతే. రేపటి సువ్వారాలకి బియ్యం చాలవుగదా ఎటా?" అంది అలివేలు తల్లి, చేతులు నలుపుకుంటూ.

"ఏం బయ్యం లేదులే. తూర్పారకముందు నీకందిస్తాను" అంది నాగమ్మ.

తూముడు వడ్లు గరిసెలోనించి దింపించి వెనక వాకిట్లో గుంటలో పోసింది — బాగుచేసి. చింతాలూ, అతని మరదళ్ళిద్దరూపాటు వేస్తున్నారు, వెన్నెలలో.

(57 వ పేజీ చూడండి)

# 'ఉత్తిష్ఠంతు భూతపిశాచాః'

ఏడుగంటల కొప్పినం కక్కమ్మగారు ముంచరపట్టింది——.

ఇంటెదురుగావున్న కొళాయిదగ్గర గోల సగం తగ్గింది.

వెంకటప్పయ్య తిరుపతియాత్రకి పోయాడు——.

ఊరంతా కొంత ప్రశాంతంగా వుంది.

హుజూరువారు పేరంటానికిదయచేశారు.

ఇంట్లో కాకిమీంచీ పిచికమీంచీ ఇరుగు పొరుగు వారిమీదికి ప్రసరించే కాంతా సమ్మిత కావ్యధ్వనుల హడావుడి కాస్త తగింది.

సమయం కొంత సజావుగా వుంది.

పత్రికా సంపాదకుడు ప్రత్యేక సంచికకు పెట్టిన గడువు దాటిపోవచ్చింది.

ఇవాళ కథ యెలాగైనా వ్రాసెయ్యాలి_
వ్రాసెయ్యాలి యెలాగైనా కథ ఇవాళ_
కూచున్నాను....
కటకటాల వీథివరండాలో
వాలు కుర్చీలో
సృష్టినిష్ఠలో పరమేష్ఠిలా....
సిగరెట్టు పొగల్లో సిసృక్షు గంధర్వ నగరాలు నిర్మిస్తోంది.

కథను సరికొత్త టెక్నిక్‌తో అతివాస్తవికమైన సన్నివేశంతో.
రాయాలని సంకల్పం.

పూర్వం పత్రికలూ, రేడియోలూ, ప్రయాణసౌకర్యాలూ లేకపోయినా కళింగదేశంలో బయల్దేరిన తెలుగు కథ కంచిదాకా వెళ్ళేదిట!

కంచి ఒకప్పుడు తెలుగుదేశాని కొక పొలిమేరట!

కథ కంచికి వెళ్ళడమంటే అర్థం అదే కాబోలు!

అది కథంటే!

జిహ్వలపై సజీవంగా ప్రయాణించేది.

ఆయా వివిధ కాల దేశాల కథకుల అభిరుచులు అప్పుటప్పటిపాథేయంగా.

కథకథగా బతికేది.

తరతరాల అవ్వా తాతల పుక్కిటి పురాణంగా.

చిలవలుపలవలుగా చిరంజీవిగా.

ఆ వెనకటి కథలన్నీ కంచికి పోయాయి.

కాలధర్మం చేశాయి.

కైలాసమో, వైకుంఠమో చేరుకుని వుంటాయి.

అవి మనకిప్పుడక్కరకు రావు.

ఇప్పుడూ సరికొత్త పద్ధతిలో ఒక కథ రాస్తే.

టెక్నిక్ సరిహద్దుల్లో కథ పొలిమేరలే దాటిపోతుంది. అప్పటికీనా ఇప్పటి కథలు చాలామటుకు వెంటవెంటనే చచ్చిపోతున్నాయి. చెమ్మతగిలిన అప్పడాల్లా.

అయితేనేం అందులో చాలామట్టుకు అవి చలామణీలో వున్నంతకాలం నిజాయితీతో బతికినవి.

## యస్వీ జోగారావు

చలామణీ వున్నంత మేర వాస్తవికతను వాయనాలుగా పంచిపెట్టినవి.

* * *

'ధాతా యథాపూర్వ మకల్పయత్' అన్నారు పెద్దలు. కాని 'అహంబ్రహ్మాస్మి' అని అనుకోనేటంత అహంభావం లేదు నాకు.

యథాప్రకృతంగా కథరాయాలని సంకల్పించాను. చుట్టూవున్న లోకం వైపొక చూపుసారించాను. అబ్బో ఎన్ని పాత్రలు! ఎన్ని సన్నివేశాలు! ఎన్ని వింతలూ విచిత్రాలు!

అయితే ఆ పాత్రధారు లందరూ పరిచితులు! మర్యాదస్థులు! పరిస్థితులకు బానిసలు! అందరినీ ఎగాదిగాచూస్తున్నాను.

ఒకరొకరే మొహాలు తప్పించుకుంటున్నారు. మాటలు ముడుచుకుంటున్నారు. చాటుచాటుగా మెటికలు విరుస్తున్నారు. శాపనార్థాలు పెడుతున్నారు.

'కథకుణ్ణి నీమా పోజుగా కలం పట్టేవుడే గాని తెల్లారిలేస్తే నిత్యం మొగం మొగం చూసుకోవలసినవాళ్ళం, ఏదో మనం మనం బరంపురం అని సరిపెట్టుకోవాలిగాని మరీ అంత ముక్కున మొగమాటం లేకుండా, అక్కడికి నువ్వే మహానిజాయితీపరుడివి అయినట్టు మా గురించి కథ లెలాగు చెప్పకొడతావయ్యా' అని నిలదీసి అడుగుతున్నారు.

అవును వాళ్ళన్నదీ నిజమే!

ఆ మొగమాటంవల్లె నా ఊహ లన్నిటినీ ఊటకలం చేతపట్టి నా మాటల్లోకి సరిగా తర్జుమా చెయ్యలేకపోతున్నాను. నా కలం చెక్కిన కథలో నా నిజాయితీ సజమాయిషీ చేసుకోలే దింతవరకూ ... చేసుకోవాలనుకొంటున్నా......

అదిగో మా రామప్పంతులు
హడావుడిగా వస్తున్నాడు ఆఫీసునుంచి
ఎండా వానా లేకపోయినా ఏకచ్ఛత్రాధిపత్యం వహించి!
ఆఫీసరు వెనకాతలే అడుగులు వేస్తూ
అంతలో రెండుచినుకులు పడేసరికి
ఒక్క అంగలో ఆయనను సమీపించి
గొడుగుపట్టి
ఆయన చెవిలో ఏదోగొణిగి ఇంటిదాకా సాగనంపి
తిరుగుముఖం పట్టేడు.
అధికారికి పొక్కులు చిక్కుతూ వెంకటప్పయ్య బాగుపడి
పోతున్నాడని గోలెత్తేడు వెనక
అపొక్కులు చిక్క అవకాశం తనకు లభించ లేదనుకుంటూ.
ఎట్టకేలకెటాగో ఇప్పుడా అవకాశం లభించిందతనికి.
ఆఫీసరు బదలాయింపుతో "పాలసీ" పేరాయించాడు రామప్పంతులు.
కాని అపొక్కులు చిక్కడంతో ఊరు

(64-వ పేజీ చూడండి)

# మరలి వచ్చిన మనస్సు

### యం. జానకీరాణి

శరణాలయంలోని సన్న గదిలో, కొయ్య కుర్చీలో కూర్చుని అనుకున్నాడు మాధవరావు—తను యీ ఉత్తర ప్రత్యుత్తరాలు ఎందుకు జరిపాడా అని. మద్రాసులో వుండగనే వితంతు శరణాలయానికి ఉత్తరాలు వ్రాసి, తనకోరిక వెలిబుచ్చాడు. వాళ్ళు రాధఫొటో పంపడం, తనస్వయంగా వచ్చి ఆమెను చూడవలసిందిగా వ్రాయడం, అన్నీ త్వరితంగా జరిగిపోయాయి. ఫోటోలోని ఆ ముఖాన్నే తలచుకుంటూవచ్చాడు అతను శరణాలయానికి.

సన్న గదిలో, బల్లకి రెండు వేపులావున్న రెండుకుర్చీల్లో మాధవరావు, శరణాలయం సూపరింటెండెంటు కూర్చున్నారు. 'రాధకి చిన్నతనంలో వివాహం జరిగింది. 13 సంవత్సరాలకు భర్తపోయాడు. గృహచ్ఛిద్రము, దుర్భరంగా పరిణమించిన వైధవ్యము, యింకా ఎన్నో తెలియని బాధలు ఆమెను ఊపివేశాయి. రెండుసంవత్సరాలక్రితం వచ్చింది ఆమెశరణాలయాని—కిఆత్మహత్యా ప్రయత్నంలో ఉండగా, గోదావరిలోంచి రక్షించబడి. ఆమెదికూడా మాధవరావు కులము, శాఖే ఆమె యీ సంవత్సరం మెట్రిక్ పరీక్షకు వెళ్ళింది. వీణవచ్చు. చేతి పనులు నేర్చుకుంటోంది.' సూపరింటెండెంటు చెప్పినదంతా విన్నాడు మాధవరావు. ప్రశ్నలు వేయలేదు. ఇదివరలో తనకి వాళ్లు ఉత్తరాల్లో వ్రాసినదే మళ్ళీ చెప్పింది ఆవిడ.

...రాధఫోటో చూసినరోజే ఆ ఫాల భాగం, నొక్కులజుట్టుచూసి ముగ్ధుడైనా డతను. కళ్ళల్లో బెరుకు, అమాయకత్వం—కానీ నోరుమాత్రం చిరునవ్వుకోసం మెదుపుతున్నట్టుంది. ఈ అమ్మాయి చాలామంచిది అనుకున్నాడు మాధవరావు మరుక్షణానే. ఫోటోలోనిరాధ ఫాలభాగంమీద వేలుంచి, తప్పుచేసినవాడల్లే చటుక్కున తీసేశాడు అతను......

రాధవచ్చింది. తెల్లచీర, చేతులకు నల్లని గాజులు. సూపరింటెండు ప్రక్కన నిలబడింది. సూపరింటెండెంటు చెప్పిందిఆమెకి "వీరే మాధవరావుగారు" అని, ఆమె లేచి, రాధనికూర్చోమని ఆదేశించింది. మాధవరావు వేపుచూసి, "మీరు ఏమైనా చెప్పాలనుకుంటే చెప్పవచ్చు"అని బయటకు వెళ్ళింది ఆమె.

రాధ తలవంచుకుని కూర్చుంది. కొద్ది నిముషాలు నిశ్శబ్దంగా నడిచాయి. మాధవరావు లేచి నిలబడ్డాడు. "మీరు ... మీరు నాతో మాట్లాడవల్సినది ఏమీ లేదూ?" అన్నాడతను.

రాధ తలెత్తి అతనివంక చూసింది. ఆమె కళ్ళు విశాలంగా వున్నాయి. "నన్నుగురించి ఆవిడ అంతా చెప్పారనుకుంటాను..." ఆమె కంఠం సున్నితంగా వుంది. ఉచ్చారణ బాగుంది అనుకున్నాడుమాధవరావు. "మీకు అభ్యంతరం లేదూ?... మీకు బంధువులు లేరూ?" అన్నాడతను.

"ఉన్నారు. కానీ నేను బ్రతికున్నట్టు తెలియదు వాళ్ళకి ... తెలియజేయలేదు ... మీవాళ్లు, మీవాళ్ళకేమీఅభ్యంతరం లేదూ?" అన్నదామె సంకోచంతో.

"ఉంటుంది. కానీ నాకుపట్టదు. వివాహం ఏర్పాటుచేస్తాను — మీకు నన్నుగురించి అంతా తెలుసుకదూ?" ఆమె తలూపింది.

"నేను వెళ్ళి వస్తాను. రేపు ఘారంతీసుకు వస్తాను. సంతకాలు చేద్దాం. రెండు నెలల్లో నే పెళ్ళి ... నాకు ఉత్తరాలు వ్రాస్తూండండి యీ రెండు నెలల్లో — వస్తాను." అన్నాడతను తలుపుదగ్గర కెడుతూ:

రాధ కూర్చునే వుంది. ఆమె ముఖం ఎర్రబడుతూండడం చూశా డతను. తలుపు దగ్గర ఒక్క నిముషంఆగి, "ఏమంటారు?" అన్నాడు.

ఆమె చటుక్కున తలెత్తిచూసింది. ఆమె పెదవులు అస్పష్టంగా కదిలాయి.

"వస్తాను నేను — రేపు." అన్నాడతను.

* * *

మాధవరావు పెళ్లైన తర్వాత తనమిత్రులను చాలా మందిని కలుసుకున్నాడు. కాని విందులు వేడుక లేమీ ఏర్పాటు చేయ లేదు తన వివాహ సందర్భంలో.

ఒకరోజు మిత్రుడు రాజుతో కలిసి, పార్కునుంచి యింటికి వస్తుండగా అన్నాడు రాజు "చూడు మాధవా, నవ్వు నిజంగా చాలా గొప్పవాడివని ఒప్పుకోవాలి ఎవరికుంటుంది యీ ధైర్యం, అంతా వేదిక లెక్కి కబుర్లు చెప్పిన వాళ్ళే మే......"

మాధవరావుకి అర్థంకాలేదు "ఏ సంగతి నువ్వు మాట్లాడేది?" అన్నాడతను.

రాజు నవ్వాడు. "అక్కడే వున్నది మరి నీ గొప్పతనం. మనవాళ్లంతా ఎంతగా మెచ్చుకుంటున్నారో నీకు తెలియదు. నువ్వు వితంతువును పెళ్లాడ్డను నేటి చాలాముందడుగు వేయడమన్న మాట...నాకల్లా అనిపిస్తుంది. నేననుకున్నవన్నీ ఎల్లాగాలిలో కలిసిపోయాయో తల్చుకుంటే. నాకూవుండేవి ఆశయాలు...ఏదో ప్రవాహంలో దుఃఖ భాజనమై పోయేజీవితాన్ని ఒక తెప్పమీదకు చేర్చి ఒడ్డుకి తీసుకొచ్చావు. పూవనంలో విహారింప చేస్తున్నావు."

మాధవరావు మాట్లాడలేదు. అతను షాక్ అయ్యాడు—నిజానికి అందరికి తెలియదు రాధలాంటి భార్య వేయిజన్మలు తపస్సు చేసినా దొరకదని.

రాత్రి అతను డాబామీద పడుకుని నక్షత్రాలను చూస్తుంటేవచ్చింది రాధ. ప్రక్కనే వున్న పడుకుర్చీలో కూర్చుంది.

"ఏమి టాలోచిస్తున్నారు?" అన్నది. మాధవరావు ప్రక్కకు తిరిగి పడుకుని నవ్వాడు.

"నువ్వేమిటి ఆలోచిస్తున్నావు?" అన్నాడు. రాధ కిలకిలనవ్వింది "మీరేమిటి ఆలోచిస్తున్నారో అదే" అన్నది.

"నేనా—నువ్వు నాకు దొరక్కపోతే నేను ఏమైపోయేవాడినా అని ఆలోచిస్తున్నాను."

"నిజంగా నేనూ అదే అనుకున్నాను సుమండీ, మీరు నమ్మరు-పైగా నేను నా మనస్సులో వున్నవన్నీ చెబితే నవ్వుతారు ... నన్ను మీ దాపుగా తీసుకోకపోగే ఏమయ్యేదానినో!"

మాధవరావు లేచికూర్చున్నాడు "అల్లా అనకు. నేను నీకు ఎంత విలువ, నువ్వూ నాకు అంతే విలువ" అన్నాడతను.

"మీకు అర్థంకాదు, నా మనస్సు-నా హృదయంలో ప్రేమ మీరు సృష్టించినదే. ఈ జీవిత ప్రవాహంలో ... నా ప్రమోదు జీవితం..." రాధకి ఏమంత పెద్దమాటలు రావు. ఆమె కంఠంలో తడి.

మాధవరావు అసంతృప్తిగా పడుకున్నాడు. కొంచెం ఆగి, లేచి, డాబా కొసకి వెళ్ళి నిల్చున్నాడు. తిరిగి వచ్చి పడకుర్చీలో కూర్చున్న రాధవంక చూశాడు. ఆమె ఏడుస్తోందని తెలుసు.

"ఊరుకోమరి...పిచ్చిదానా, నీ జీవితా

నికి నేను చాలా చేశాను. సరేనా? పూరుకో" అన్నాడు.

ఆ రాత్రి ఎప్పటికోగానీ నిద్రపట్టలేదు మాధవరావుకి. రాధ పెళ్ళయిన క్రొత్తలో ఇంకా యిలాంటి మాటలు ఎన్నో అనేది. అప్పట్లో తనకి చాలా బాధ కలిగించాయి యీ మాటలు. ఇప్పటికీ మనస్సుకి ఇష్టంగా వుండవు యీ మాటలు. మొదట్లో తనమీది భక్తి, ప్రేమ మాత్రమే అర్థమయ్యేవి—కానీ యిప్పుడు ఈ కృతజ్ఞతాభావంకూడా అర్థమాతోంది. న్యాయమేనా యీ ప్రవర్తన?...ఏమో!

కుర్చీలోనే పడుకుని నిద్రపోతున్న రాధ వంక చూశాడు—ఆమెని లేపి మంచంమీద పడుకోమని చెప్పాడు మాధవరావు... తను ఆమెని వివాహం చేసుకోకపోతే, యీపాటికి ఆమె జీవితం ఏ పథాన పోయెదో! ఎన్నడూ తల్లిదండ్రులను చూడదు ఆమె ఎవరైనా దయార్ద్ర హృదయులు ఆశ్రయమివ్వాలి. ఈ ఆలోచనల్ని తొలగించుకుంటూ నిద్రపోయాడు అతను-.... అతనికి కలలో తన ముసలి తల్లిదండ్రులు కనుపించారు. అక్క, చిన్న తమ్ముళ్లు, చెల్లెలు—తండ్రి చచ్చిపోయాడట, కర్మకి, అస్థికి వెళ్లాడు అతను. ఏమి యేడుపులు...రాధ లేదు అక్కడ; అందరినీ కాదని వెళిపోయావే అంటున్నారు తమ్ముళ్లు! ధ్వనులు!...

ఉలిక్కిపడి లేచి, చుట్టూచూసి, పడుకున్నాడు మాధవరావు.

* * *

చాలారోజులవరకూ పోలేదు యీ కల మాధవరావు స్మృతిలోంచి. నాన్నని చూడాలనిపించింది. అతని మనస్సులోని ఆవేదన ఉవ్వెత్తున లేచింది. తల్లిని తలంచుకుంటే మనస్సుని ఎవరో గుప్పిటపట్టి నులిమివేస్తున్నట్లు బాధ కలిగింది.

"రాధా, మావూరెళ్లి వస్తాను రెండు రోజులు. నువ్వుండ గలవా?" అన్నాడతను ఒక ఉదయాన.

"వెళ్ళిరండి." అన్నది రాధ. వెంటనే అతనికి తోచింది. తన భార్యరావడానికి వీలేనిచోటికి తను వెళ్ళడమా అని. కానీ— ఏమంటారు వాళ్లు రాధనిచూసి? పెద్ద తమ్ముడు, మద్రాసులో 'లా' చదివే వాడు ఒక్కడే తన పెళ్లికి ఒక ఉత్తరం వ్రాశాడు. తల్లి, తండ్రి ఆశీర్వదించలేదని అప్పట్లో మాధవరావుకి అనిపించింది, కానీ అల్లా దూరానికి త్రోసేశాడు ఆ అంశాన్ని. ఇప్పుడు?....

"నువ్వు పోనీ ఎక్కడికైనా—" మాధవరావుకి మళ్ళ ఆలోచనసాగింది. ఆమె ఎక్కడికి వెడుతుంది. తను ఒక స్తంభం లాంటి వాడు. తన నల్లుకున్న లత ఆమె.

"వద్దు...వి నా సెలవు దొరకవద్దూ నాకు?" అన్నాడతను. రాధకోసం—నిజమే, రాధకోసం తను మనస్సుచేసే కొన్ని స్పందనలను త్రోసి పుచ్చాలి అప్పట్లో తండ్రి ఒక సంబంధాన్ని చూసి వుంచాడు. తను వేసవిలో యింటికి వచ్చేసరికి. తను అంతకుముందే శరణాలయంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. మేలో రాధని చూశాడు—ఉద్యోగం ఇంటర్వ్యూ కూడా అప్పుడే జరిగింది. తనకోరిక చెప్పగానే తండ్రి కేకలేశాడు, తల్లి దిగులు పడింది. ఈ గొడవలన్నీ వారంరోజులు కూడా వినవక్కరేకుండానే ఉద్యోగం ఆర్డరు వచ్చింది. మొదటిరెండు నెలల జీతంలో డబ్బు వెనకేసి, పెళ్ళిఖర్చులు పెట్టుకున్నాడు. ఇదంతా జరిగి ఏడాది కావస్తోంది.

ఆనాటి కీనాడు తన అనుభూతుల వెలువలోంచి బైటపడి, అయ్యో మానాన్న, మాఅమ్మ అనుకున్నాడు. తనవాళ్ళని, వాళ్ల యిష్టాలని త్రోసిపుచ్చాడు. కష్టం, కొంచెం పెద్దఉద్యోగం, తల్లిదండ్రుల మనశ్శాంతి—రాధకోసం యివన్నీ త్యాగం చేశాడు...రాధ ఏమిత్యాగం చేసింది తన కోసం?—ఆమె అదృష్టవంతురాలు.

తునకలు తునకలుగా యీ ఆలోచనలు మాధవరావు మనస్సులో రోజంతా మెసులుతూనే వున్నాయి—క్లాసులో పాఠాలు చెపుతున్నంతసేపు.

సాయంత్రం యింటికి వచ్చేసరికి రాధ తలదువ్వుకుంటోంది. అద్దంలో అతనిని చూసి నవ్వింది. తరువాత చేతులు కడుక్కొనివచ్చి, అతనికి కాఫీయిచ్చి, ప్రక్కన కూర్చుంది. మాధవరావు కాఫీ త్రాగుతూ, కిటికీలోంచి బయటకు చూడసాగాడు.

"ఏమిటి విశేషాలు కాలేజీలో?" అన్నది రాధ.

కాఫీ యింత బాగాచేయడం ఎక్కడ నేర్చుకున్నావు? శరణాలయంలోనా."

రాధముఖాన చిరునవ్వు ఏమైంది-అనుకున్నాడు అతను ఆమె తలవంచుకుంది. "అక్కడ మాకు కాఫీయిచ్చేవారు కాదు. ఇక్కడికి వచ్చిన తర్వాతే—అంతకు ముందు మాయింట్లో..."

మాయిలు! నవ్వొచ్చింది మాధవరావుకి. "నాకు పుట్టిల్లు వున్నట్లే, నీకూవుంది కాదూ? యిద్దరికీ ఒకేదూరం..." అన్నాడు. అతని కంఠం అతనికి ఏమంత కర్కశంగా లేదు.

రాధ రాత్రి పరధ్యానంగా వున్నది. భోజనం చేస్తూ అన్నాడు మాధవరావు, "మీ పూర్వపు అత్తగారిలు ఏవూరు?" అని. మజ్జిగపోస్తున్న ఆమె చేయి వడకడం స్పష్టంగా కనిపించింది అతనికి. ఆమె మజ్జిగగిన్నె మీద మూతపెట్టి, అతనిగ్లాసులో మంచినీళ్లు పోసింది. అతను భోజనంచేసిన తర్వాత కంచం తీసేసింది. "నెల్లూరుదగ్గర పల్లెటూరు" అన్నది, అతను చేతులు కడుక్కొంటుంటే.

మాధవరావు పెకి వెళ్లిపోయాడు. ఆ రాత్రి శనివారం కాబట్టి ఉపవాసంరాధ. ఆ సంగతి తెలిసి, మామిడిపళ్లు తీసుకు వచ్చాడు అతను.

"తిన్నావా?" అనడిగాడు పదింటికి. "ఆ" అన్నదామె. అతను పడకకుర్చీలో కూర్చున్నాడు. ఆమె పిట్టగోడవానుకుని నిలబడి రోడ్డుమీది మనుష్యుల్ని చూస్తోంది.

"రాధా, కోపమొచ్చిందా, నేను ఏవేవో ప్రశ్నలు వేస్తున్నందుకు?" అన్నాడతను-అప్రయత్నంగా. వినా ఎందుకు రావాలి ఆమెకి కోపం? మీమీద కోపం రావడమా? మీరు దేవతలు" అనేది కాదూ రాధ మొదట్లో. "దేవతలమీదకూడా ప్రణయకోపాలు చూపొచ్చు. అని నవ్వేవాడు మాధవరావు అప్పట్లో."

రాధవచ్చి కుర్చీ పీటమీద కూర్చుంది. ఆమెచేతులు, మెడ, చెవులు తెల్లగా, స్నిగ్ధంగా వున్నాయి. అందమైన చిన్ని, తెల్లని పూవులాగా వుంది ఆమె.

"రాధా!" అన్నాడతను. ఆమె తలెత్తి చూసింది. ఆ రోజు శరణాలయంలో—బెరుకు, భయం, అమాయకత్వంతోనిండిన చూపు చూసింది.

నా రాధ—నా ఈ చక్కని రాధ గోదావరి వడిలోకి పోతుంటే ఎవరో—రక్షించారు. ఎవరో అనుకున్నాడతను.

"రాధా, నాకు ఎన్నో విషయాలు చెప్పాలి నువ్వు- చెప్పవేం ఎప్పుడూ" రాధ మాట్లాడలేదు.

"ఆవిడ చెప్పింది నాకు నిన్నుగురించి-నేనుఅంటూండేవాణి యింటరులోవుండగా. నేను ఎంతో అందమైన అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకుంటానని. అప్పట్లో చాలా పుస్తకాలు చదివేవాడిని. సినిమాలు చూసేవాడిని...మొదట్లో నువ్వు నాకువంగి నమస్కారం చేసినప్పుడు సినిమాలో లాగా అనిపించింది...రాధా, వీరేశలింగం గారి పుస్తకాలు చదివావా నువ్వు?..."

రాధ నిద్రపోతోందా అని తలవంచి చూశాడు ఆమెవంక. లేదు. విశాలంగా కళ్లు తెరుచుకుని చూస్తోంది దూరాన్ని. అస్పష్టంగా కదిలాయి ఆమె పెదవులు "అవును. వితంతూద్ధరణ చేశారయ్యో" అన్నది మెల్లిగా.

"అవును రాధా-ఆయన చాలా గొప్పవాడు ... నీకు నిద్ర వస్తోంది. పడుకో." అన్నాడు మాధవరావు.

ఉత్సాహంగా కబురు చెప్పడం చేతకదా ఈరాధకి అనుకున్నాడు. ముడుచుకుపోయిన కలవపూవులా కనుపించింది అతని కళ్లకి ఆమె.

# ★ మరలివచ్చిన మనస్సు ★

ఉదయం పదిదాటినా మాధవరావు పడక కుర్చీలో కూర్చునేవున్నాడు. రాధ ఒకటి రెండుమార్లు అతనివంక చూసింది. అతను కదల్లేదు. చీకాకుగా వున్నాయి అతని ఆలోచనలు. తన జీవితంలో, తన దయా దాక్షిణ్యాల ఫలితంగా ప్రవేశించింది రాధ. ఎందుకని దూరంగా, తన జీవన పథంలోంచి తొలగి నడుస్తోంది – తన అనుజ్ఞలేకుండా? అర్థంలేని చీకాకు అతని మనస్సులో.

"రండి భోజనానికి." అన్నది పదిన్నరకి రాధ.

"ఇప్పుడు-వద్దు – కాలేజీకి సెలవుచీటీ వ్రాస్తాను" అన్నాడు.

ఆమె కాగితం, కలంయిచ్చి, ఉత్తరం వ్రాయించుకుని, ప్రక్కింటి స్టూడెంటుని కేకేసి, యిచ్చింది.

ఒక పావుగంట తర్వాత కేకవేశాడు మాధవరావు రాధని. "ఇవాళ పద్దెనిమిది రాధా —ఎల్లుండికి మనపెళ్లి జరిగి ఏడాది...నీ జీవితగమనం మారి యిన్ని వందల రోజులైందన్నమాట." బరువుగా అనలేదు మాధవరావు యీ మాటలు.

రాధ తలూపి, లోపలికి వెళ్ళింది మళ్ళీ. ప్రొద్దున్న పదకొండింటికి ఎంత సందడిగా వుంటుంది మాయింట్లో, మావూళ్లో. కిటికీ మీదుగా ప్రాకిన కాశీరత్నంతీగమీద ఎండ పడుతోంది. వెచ్చగావుంది యీ యిల్లు. వేడిగా, ఉక్కగావుంది యీ వాతావరణం అనుకున్నాడు మాధవరావు.

భోజనంచేస్తూ చెప్పాడు మాధవరావు. "నేను రేపు మావూరు వెడుతున్నాను. నాన్నకి అసలే బాగుండటంలేదని తమ్ముడు వ్రాశాడు. నాల్గురోజులు సెలవు పెడుతున్నాను." అని, రాధ ముఖంలోకి చూశాడు —మార్పులకోసం.

"ఒక్క ఏడాదంతా మా అమ్మను చూడకుండా ఎప్పుడూ లేను...మీ అమ్మనువ్వంటే ప్రేమగావుండేదా? నువ్వు అత్తవారింట్లో ఎన్నాళ్ళుండిపోయావు, మీ అమ్మను చూడకుండా?" అన్నాడు. సమాధానం ఆశించలేదు అతను. రాలేదు సమాధానం.

అతని భోజనమైనతర్వాత వంటింటి తలుపువేసి, అతనికి తమలపాకులు అందించింది రాధ. కిటికీదగ్గర నిలబడి, లెక్కలేనన్ని సార్లు, ఆ కిటికీ చువ్వలని లెక్కపెట్టింది వ్రేళ్ళతో.

మాధవరావులో ఏదో ఆవేశం—నిర్మలమైనదీ, స్వచ్ఛమైనదీ కాదు...పరవళ్ళు త్రొక్కుతోంది. గొంతులో పెనగులాడుతున్నాయి కసియైనమాటలు. రాధ అసహజంగా ప్రవర్తిస్తోంది. అయోగ్యవెళ్ళ వద్దు మీరు, అనదు ఆమె తను చూపించిన ప్రేమాభిమానాలు అర్థంకాలేదు ఆమెకి.

"నాసామాను సర్దు రాధ. 25కి వస్తాను తిరిగి...ఇల్లావచ్చి కూర్చో. నేను ఆనందంగా ఉండడం నీకిష్టం లేదూ?" అన్నాడతను.

రాధ ఉలిక్కిపడి. అతనివంక చూసింది.

"ఎందుకు కళ్ళు విచ్చుకుని ముఖంలో అంత దైన్యం తెచ్చిపెట్టుకుని చూస్తావు? నా మనస్సు ఎటు మొగ్గుతుందో, ఏ ఆలోచనలు నాకు సంతోషం కలిగిస్తాయో అక్కర్లేదూ నీకు? నీకు ఎవరూ లేరు – కానీ నాకున్నారు. నీకు ఆత్మహత్య చేసుకునే స్వాతంత్ర్యమైనా ఉన్నది ఒకప్పుడూ, ఇప్పుడూను. నాకదిలేదు. సన్యాధాం చేసుకున్న నువ్వూ, నామీదే ప్రాణాలుంచిన నా వాళ్ళున్నారు..." అతనికంఠం వణకటంలేదు.

"నాపట్ల చూపవలసిన భావమేమిటో నీకు తెలియదు? ఇటాంటి అలక్ష్యం నేనుభరించలేను...రాధ, నేను జీవితంలో పొరబాటు చేశానన్న బాధ నాకు యింకా కలిగించకు. నీకు పుణ్యముంటుంది ... ఋణాను బంధం వల్ల తారసపడ్డావు నీవు..."

తెల్లగా పాలిపోయి, వణుకుతున్న చేతుల్లో ముఖందాచుకుంది రాధ. భావురుమని, బిగ్గరగా, హృదయ విదారకంగా ఏడ్చింది ఒక్కసారిగా.

"ఎందుకేడుస్తావు? నీకు నేను ఏమిచేయలేదని? నా జీవితమంతా నీకోసం మార్చివేసుకున్నాను! నేను ఏం కొరత చేశాను నీకు?...నీకు తెలియదు శరణాలయాల్లోని వితంతువుల జీవితంలో ఎల్లాంటి అగచాట్లకు గురి ఔతారో. చాలీచాలని జీతాలు, పనికిరాని చదువులు, దొరికితే అవలక్షణమైన ఒక రెండోభర్త...ఎందుకేడుస్తావుయింకా? అర్థంలేని ఏడుపునిచూస్తే నాకు అసహ్యం వేస్తుంది."

ఆమె ఎక్కిళ్ళు మెల్లిగా తగ్గాయి. వాన వెలిసింది, కాని కారుమబ్బులతో దిగులుగా వుండే ప్రకృతిలావుంది ఆమె వదనం.

మాధవరావు ఏవగింతగా ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు. "లోకంలోని ఆనందాన్ని పారిపోకుండా నిలబెట్టేందుక్కూడా శక్తి కావాలి—నీకు లేదది" అన్నాడు.

ఆ సాయంకాలమే బయలుదేరాడు– మాధవరావు తన వూరికి. ఇట్లా వీధి మలుపు తిరగగానే అతని మనస్సులో తన యింటివి

(57-వ పేజీ చూడండి)



# తండ్రిపోలిక

ఇల్లిందల సరస్వతీదేవి

రాత్రి పదిగంటలవేళ. అనంతరావుచేతులు రెండూ వెనక్కు పెట్టుకొని వాకిలి వరండాలో పచారు చేస్తున్నాడు.

ఉదయము ఏడుగంటలకు కాఫీ తాగి, ఇంటినుంచి బయటికి వెళ్ళిన కొడుకు అంత వరకూ ఇంటికి రాకపోవటము అనంతరావు మనసును కలచివేస్తున్నది. కొడుకుమీద కోపము పుట్టుకొద్దీ పెరిగిపోతున్నది. తలచుకొన్న కొద్దీ ముఖము జేవురించిపోతున్నది. ఒళ్ళంతా ఆవేశముతో ఒణికిపోతున్నది. ఎంత రాత్రి అయినాసరే–ఇంటికి రాగానే అడగదలచిన నాలుగు మాటలూ ముఖముమీదనే అడిగివేయాలన్న నిశ్చయానికి వచ్చి–మరింత వేగముతో పచారుచేయటము మొదలుపెట్టాడు.

పదకొండు గంటలు కొట్టిన చప్పుడు వినబడ్డది. ఇక ఆనాటికి కొడుకు రాడేమో ననుకొని, విసుగుదలతో వీధి తలుపులన్నీ భద్రముగా వేసి, అనంతరావు తన గదిలోకి వెళ్ళుతుండగా–పెరటి త్రోవన ఎప్పుడు వచ్చాడో కొడుకు. తల్లి చేత అన్నము పెట్టించుకొని తింటున్నాడు!

కొడుకు ప్రవర్తనవల్ల అనంతరావు మనసంతా చెదరిపోయింది. దానికితోడు తండ్రి కంటబడకుండా ఉండాలని చడీచప్పుడూ లేకుండా పెరటిత్రోవన వచ్చి తల్లిచేత అన్నం పెట్టించుకొని తింటున్నాడు కొడుకు. దీనితో తన రక్తమే తనపట్ల అంత కృతఘ్నత్వము చూపుతున్నదన్న అనుమానము రూఢిఅయింది. అతడి మనసంతా మంచువలె నీళ్ళు కారడము మొదలుపెట్టింది. జీవితములో ఓటమి ప్రారంభమయినదేమోనన్న శంక కలిగిన వెంటనే ఆవేశ మెక్కువయింది.

“శేఖరమ్ నీవుపగలంతా ముఖం తప్పించి తిరిగావు. అయినా నా ప్రశ్నకు జవాబు ఇవ్వవలసిన బాధ్యత నీమీద అట్లాగే ఉన్నదిసుమా! విద్యావంతుడవయినందుకు ఇంతో అంతో విజ్ఞానాన్ని కూడా ఆర్జించావనుకున్నాను. అయితే నా ఊహ పొరబాటేనా?” అంటూ తన మనసులో రేగిన కలతనూ, కొడుకుమీద కలిగిన ఏహ్యభావాన్నీ వ్యంగ్యార్థములో బైటికి అనేసి, అనంతరావు తన మనసును తేలికపరుచుకోవటానికి ప్రయత్నించాడు.

ఇంతలో తల్లి కూర మారువడ్డించ

పోయింది. శేఖరమే చెయ్యి అడ్డంపెడుతూ, మంచినీళ్ల గ్లాసు అందుకున్నాడు. "కూర చాలారుచిగా ఉంది నాన్నా!" అంటూ తల్లి అట్లాగే నిలబడి వెయ్యబోయింది. "వీటికి నాకు తెలిసే సమయమా ఇది?" అంటూ శేఖరమ్ తల్లి కళ్ళల్లోకి చూశాడు.

"ఏమాటా మాట్లాడవేం?" అంటూ పొడిచినట్టు ప్రశ్నించాడు అంతలోనే అనంతరావు.

"నాన్నా! మీరు చెప్పినమాట, నేను ఎప్పుడు వినలేదు? ఇప్పుడయినా వినటానికి సిద్ధంగా ఉన్నాను — కాని ... ఈ ఒక్క విషయములో మన్నించండి. నేను బాగా ఆలోచించుకొనే జవాబుఇస్తున్నాను," అన్నాడు శేఖరమ్ తలవంచుకొని.

"కాదురా బాబూ! మేము కట్నంకోసము ఆశపడుతున్నా మనుకుంటావేమో! ఇతరుల ధనము నాకు తృణప్రాయము. మేము చూపించిన సంబంధము విషయములో అభిప్రాయపడినదేమిటంటే— గౌరవము గల కుటుంబమనీ — వంశమర్యాదలు మంచి వనీను... తెలిసిందా? పెద్దవాళ్ళు ఇంత దూరము ఎందుకు చెపుతున్నారో కొంత గ్రహించుకో—" అన్నాడు కొద్దిగా హెచ్చించిన కంఠధ్వనితో.

"నేను బాగానే ఆలోచించాను నాన్నా! మనసులు కలియనిదే పెళ్లి అనిపించుకోదని ఎంతమంది విషయములో మీరు అనలేదు? ఆ పిల్ల నాకిష్టము లేదో అని నేను వెయ్యిసార్లు చెప్పాను. అయినా మీరు మళ్ళీ బలవంతం చేస్తున్నారంటే, నన్ను జీవితపర్యంతమూ బాధపడమనేగా మీ ఉద్దేశ్యం?

ఈ కాలంలోకూడా బలవంతపువివాహాలు జరుగుతాయంటే మనకేకాదు, మనదేశానికి కూడా అప్రతిష్ఠ. ఈ విషయంలో ఇంత కంటె వస్తున్న వాగిందరనుకుంటాను-" తలవంగుకొని భోజనప్పళ్ళెములో చూపుడు వేలితో గీతలుగీస్తూ ఉదాసీనంగా పక్కకు జరిగాడు.

"అయితే నీవు స్వతంత్రుడవని ప్రకటించావన్నమాట. నిన్ను పెంచి పెద్దవాడిని చేసినందుకు మంచిబుద్ధి చెప్పావు. ఇంకా నీకు పెద్దచదువు చెప్పించి, ఏమి టేమిటో చేదామని కలలుగంటున్నాను"-భుజముమీద వేసుకొన్న తువాలను రెండుసార్లు దులిపి మళ్ళీ వేసుకున్నాడు అనంతరావు. గది చివరివరకు వెళ్ళి మళ్ళీ వచ్చాడు. కొడుకు ఇంకా పీటమీదనే కూర్చున్నాడు. తల్లి మాత్రం గోడకానుకొని నిలబడ్డది.

"అయితే నీవు స్వతంత్రుడవుగానే ఉండు" అంటూ గబగబా అడుగులు వేసుకొంటూ వెళ్ళి అనంతరావు తన గదిలో మంచముమీద పరుపు దులుపుకొని పడుకున్నాడు. శేఖరమ్ మీద కోపాన్ని ఎన్ని మాటలలో వెళ్ళగక్కినా అతడి మనసు తేలిక పడలేదు. కాగా మరింత భారంగాతోచింది; అనేక రకాలుగా బాధించటము మొదలు పెట్టింది.

పెదకొడుకు - చేతికి ఎదిగినవాడు! అందులో చదువంతా ముగించుకుని సంపాదనకు సిద్ధంగా ఉన్నవాడు. వీడిని ఆదర్శంగా పెట్టుకొని మిగతా పిలలంతా ఈ బాటన నడవాలని అనంతరావు ఆశించాడు. పెదకొడుకు వంశానికి తల్లివేరువంటివాడని



**అది న్యాయం**

మేష్టరు:— నీపక్కన నిద్ర పోతున్న సుబ్బారావుని లేపుతావా రామ్మూర్తీ!

రామ్మూర్తి:— మీరే నిద్రబుచ్చారు గనుక మీరే లేపండిసార్.

* * *

రష్యా చూట్టానికి వెళ్లిన యాత్రికుల జట్టుకి రష్యన్ అధికారులు శరవేగంతో రష్యా చూపించేస్తున్నారు. జట్టులో ఒకడు ఇంకొకణ్ణి ఇలా అడిగాడు:

"ఇది లెనిన్‌గ్రాడా, స్టాలిన్‌గ్రాడా?"

"ఇవ్వాళ శుక్రవారమా శనివారమా?"

"శనివారం."

"స్టాలిన్‌గ్రాడ్."

భావించి ఏ చిన్న లోపమూ లేకుండా పెంచాడు. శేఖరమ్‌లో ఉన్న ఉత్తమ గుణాలను చూసి పొంగిపోయేవాడు. ఒక్కొక్కసారి అతడి సంతోషము మేరలు దాటేది.

అనంతరావు మంచముమీదినుంచి లేచి, పడక కుర్చీలో కూర్చున్నాడు. మిగతా పిల్లల గతేమిటని నొసలు కొట్టుకున్నాడు. తన కష్టము - ఇరవై రెండేళ్లుపడ్డ కష్టమూ వృథా అవుతుందా? అయితే గతేమిటి? జుట్టు పీక్కున్నాడు; కళ్లు నులుపుకున్నాడు. కుర్చీమీదినుంచి లేచి బల్లమీది పుస్తకాలన్నీ సర్దిపెట్టుకొన్నాడు. కాలెండరులో తేది మార్చి కొత్తది పెట్టాడు.

అంతలో ఇంట్లో దీపాలన్నీ ఆర్పి కాంతమ్మ వచ్చింది. ఆమె మొదటినుంచీ బలహీనురాలు. అయినా వేళకు పని చేసుకొని మంచముమీద పడుకొంటుంది. యథావిధిగా వంటచేసి పిల్లలకూ పెనిమిటికీ వడ్డిస్తుంది. కొడుకు అటు వెళ్ళగానే, తన మంచము దగ్గరికివచ్చి పడుకోబోయింది. ఆమెను చూడగానే అనంతరావుకు ఆవేశ మెక్కువయింది.

"అటువంటి పనికిమాలిన వెధవకు నేనుచూడకుండా అన్నం పెడుతున్నావా? అయితే నీకూ వాడుచేసేపని ఇష్టమన్నమాట. మిగతా పిల్లలగతి ఆలోచించవన్నమాటేగా నీవు

"అదేమిటి, కుంటుతున్నావేం?" అని రామారావు సుబ్బారావును అడిగాడు.

"రోడ్డు ప్రక్కన గోతిలో సిగరెట్టు పారేసి ఆర్పేద్దామని కాలువేశాను" అన్నాడు. సుబ్బారావు!

కూడా! మన గతేమిటని ఎన్నడయినా ప్రశ్నించుకొన్నావా? వాడి నొక్కడిని చూసుకుంటే నీకు రేపటిసంగతి అక్కర్లేదూ?" ఈ మాటలన్నీ విసురుగా అనేసి మళ్ళీ గదిలో దీపము పెట్టాడు అనంతరావు.

కాంతమ్మ నిర్ఘాంతపోయింది. అయినా తొందరపడదలచుకోలేదు. తనుజవాబియ్యక పోతే ఆయన తగుతాడనుకొని అప్పటినుంచీ నోరు కట్టేసుకొనే ఉంది.

"మాట్లాడవేం" అన్నాడు అనంతరావు ఆమె ముఖములోకి చూస్తూ.

"మాటపట్టింపులకూ, భోజనానికీ సంబంధం లేదనుకొని అన్నం పెట్టాను," అని దుప్పటి కప్పుకుంటూ పక్కకు తిరిగింది "తాడు తెగేవరకూ లాగకూడదనుకొని, రారా నాయనా! అన్నాను," అంటూ కళ్ళు మూసుకొన్నది.

విసురుగా వెళ్ళి అనంతరావుకూడా తన మంచందగరికి వెళ్ళాడు. దిండ్లన్నీ సర్దుకున్నాడు. ఒక మఫ్లరు తెచ్చి తలకు చుట్టుకొని పడుకున్నాడు. అంతమెత్తగాఉన్న పరుపుమీద అతడి దేహముఆనలేదు, ఏదో పొడుస్తున్నది. ఎక్కడినుండో పొగలూ, సెగలూ తాకుతున్నాయి. ఆబాధకొద్దీ కళ్ళుమూసుకునే తనలోతాను మాట్లాడుకోవటం మొదలుపెట్టాడు. 'నా జీవితంలో నేనెన్నికష్టాలు పడ్డాను! నా సిరికిమించి పిలలను పెంచాను. ఒకడు పైకివస్తే మిగతావాళ్ళను వాడే సంరక్షిస్తాడనుకున్నానే! ఈ శేఖరాన్ని కిందికి దించకుండా కంటిలో పాపమాదిరిగా కాపాడేనే. అటువంటివాడు కాస్తా భ్రష్టుడయిపోతున్నాడు ప్రణయమూ; ప్రేమా అని వల్లిస్తున్నాడు! ఏ పిల్లను పెళ్ళిచేసుకున్నా రంభలా కనబడుతుంది. ప్రేమకూడా దానంతటఅదే పుట్టుకొస్తుంది. ఎంతయినా శేఖరమ్ అనుభవము లేనివాడు. అయినా ఇతరులు చెప్పినప్పుడు వింటే ఎంత బాగుంటుంది? తండ్రి అనుభవాన్ని ఆదర్శంగా పెట్టుకొనే సదవకాశము లోకంలో ఎందరు కొడుకులకు లభిస్తుంది? తెలివిగలవాడుగాని వినిమోగించుకోలేడు. ఈ పెళ్లివల్ల శేఖరానికే కాదు. కుటుంబానికంతా నష్టము. ఈ నష్టానికి పరిహారము ఉండదు" అనుకుంటూ దొర్లటము మొదలుపెట్టాడు ఆ దొర్లటంలో అతడికి ప్రస్తుతావస్థ అడుగునబడి నలభైఅయిదు సంవత్సరాలనాటి చరిత్ర పైకి తేలి కళ్ళకు కట్టినట్లయింది.

* * *

అనంతరావు కప్పుడు సరిగ్గా శేఖరమ్ వయసే ఉంటుంది. బి. ఏ. చదువుతున్నాడు. ఎక్కడయినా ఉద్యోగములో ప్రవేశించి తనకు కొంత ఆధారమవుతాడని తండ్రి సీతయ్యగారు గంపెడాశతో ఉన్నాడు. ఆడపిల్లల పెళ్ళిళ్ళవరకు ఎదిగిన కుమారుడివల్ల సహాకార్యము లభిస్తుందని ఆయన పొంగిపోయాడు.

అనంతరావు రెండవ సంవత్సరము బి. ఏ. లో ఉండగా వితంతుశరణాలయం మేనేజరు అప్పుడప్పుడు ఇతడిని పలకరిస్తూ ఉండేవాడు. మేనేజింగు కమిటీలో ఉన్నవారి నందరినీ పరిచయముచేశాడు. అనంతరావు తన తీరిక సమయాల్లో వాళ్ళతో చేరి కబుర్లు చెప్పుతూ ఉండేవాడు.

ఆ శరణాలయపు సహాయ కార్యదర్శి వయోవృద్ధుడు. అనంతరావు కనబడినప్పుడల్లా బాలవితంతువుల బాధలను గురించి కళ్ళకు కట్టినట్టుగా—హృదయం కరిగిపోయేటట్లు వర్ణించి యువకులే వాళ్ళను రక్షించాలని ఉద్బోధించేవాడు. అవన్నీ వినగా వినగా అనంతరావుకు ఆ ఆశ్రమములో ఉన్న ఒక వితంతువును వివాహమాడాల హృదయం ఉరకలువేస్తూ ఉండేది. అతడిని ఎదలో దేశభక్తి, సంఘ సంస్కారమూ పొంగి పొర్లిపోయేది తానొక్కడే కాదు.

# మీ సౌందర్యమే మీకు భూషణము...

## మీ ముఖమును మృదువుగా మరియు మనోహరముగా ఉంచు కొనుటకు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును వాడండి!

తేలికైన మరియు మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ చర్మమునకు రక్షణనిచ్చి దానిని చక్కగా మరియు మనోహరముగా ఉంచుతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీము జిగురుగా ఉండదు. అది రాసుకొన్న మరు క్షణములోనే కనపడకుండా పోతుంది మరియు దానిని పౌడరు అద్దుకొనే ముందు వాడుతే పౌడరును గంటల తరబడి అంటు కొని ఉండేలా ఉంచుతుంది.

### చర్మమును శుభ్రపరచే క్రీమ్

ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమ్‌ను రుద్ది రాసుకోండి. అది చర్మమును పూర్తిగా శుభ్రపరుస్తుంది మరియు చర్మములోని సూక్ష్మ రంధ్రములు పొడిగా అగుటను అద్దుటయే కాక చర్మముయొక్క మృదుత్వము పోకుండా కూడ కాపాడుతుంది.






### ఉచిత పుస్తకము

***"Lovelier with Pond's"*** అనే సౌందర్యమును గురించిన ఇంగ్లీషు పుస్తకము కావాలని వ్రాయండి. దానిలో ముఖవర్చస్సు మరియు సౌందర్య రక్షణను గురించి ఎన్నో ఉపయోగకరమైన సలహాలు ఉన్నాయి. పుస్తకము పంపుటకయే 25 నయా పైసల తపాలా బిళ్లలు పంపుతూ ఈ ఎడ్రసుకు వ్రాయండి: పి.ఓ. బాక్సు 1612, డిపార్టుమెంట్ 26వి, బొంబాయి 1.

చీస్‌బ్రొ - పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో సంస్థాపింపబడినది)

# ★ తండ్రిపోలిక ★

తన కాలేజీలో ఉన్న విద్యార్థులందరూ ఆ వితంతువులను వివాహమాడి సంఘాన్నీ, దేశాన్నీ ఉద్ధరించకూడదా అన్న ఆవేశము కలిగేది.

అనంతరావు హృదయము సంస్కరణ కోసమని గంతులు వేసేది కాని ఆ శరణాలయములో ఉన్న వితంతువులలో కంటికి వచ్చిన పిల్ల సైనా వివాహమాడా లనిపించేది కాదు. మేనేజరు 'నీ కంటికి వచ్చిన పిల్లను చూసుకోవయ్యా!' అని అంటున్న కొద్దీ 'ఎవరయితే నేమి?' అనేవాడు. ఆరోజుల్లో అతడు ఎవరితో మాట్లాడినా వితంతువుల దుర్దశను గురించే - వితంతూద్వాహాలను గురించే.

తరువాత శీఘ్రకాలములోనే అనేక మంది సంస్కర్తల సమక్షములో, గౌరవ నీయులైన అధికారుల సాన్నిధ్యములో, కొన్నివందలమంది ప్రేక్షకులు 'ఆదర్శ వివాహమ'ని కరతాళధ్వనులు చేస్తూండగా, అనంతరావు, కాంతిమ్మ అన్న వితంతువును వివాహము చేసుకొన్నాడు. వివాహము ఆ శరణాలయంలోనే అతివైభవంగా జరిగింది. అనంతరావు ధైర్యసాహసాలను గురించి శబ్ద వైచిత్రితో పెద్ద లనేకులు గంభీరోపన్యా సాలు చేశారు. ఎన్ని కబుర్లయినా చెప్ప వచ్చుగాని - కార్యాచరణకు పూనుకోవ టము సామాన్యమా మరి! మొదట అన్నిటికీ సమ్మతించిన యువకు లెందరో ముహూ ర్తము రేపనగా మనస్థైర్యము సడలి-పలా యనము చేసేవారు. అనంతరావు నిశ్చల మయిన దీక్షగలవాడు కనుక కార్యము సఫల మయిందని సంభ్రమాశ్చర్యాలను ప్రకటిం చారు. అనంతరావు దంపతులను చాలా మంది అభినందించారు; సన్మానించారు; గౌరవించారు; ప్రశంసించారు.

కాంతమ్మ అనంతరావుల వివాహాన్ని గురించి పొగడని పత్రిక లేదు. ఈ వార్త వాయుప్రసారమువలె పట్టణాలకూ, పల్లె లకూ పాకిపోయింది.

పట్టభద్రుడయి, అనంతరావు సెలవులలో వస్తున్నాడని ఇంటిదగ్గర తండ్రి ఎదురు తెన్నులు చూస్తున్నాడు. చాలా రోజుల నుంచీ అనుకుంటున్న సంబంధాలను కూతు ళ్ళిద్దరికీ నిశ్చయించ వచ్చునుకున్నాడు. వాళ్ళ పెళ్ళిళ్లు కాగానే కొడుక్కు కూడా ఒక అయినింటి పిల్లను చూసి ముడి పెడదామనుకు న్నాడు.

అతడు దయము రైతులతో మాట్లాడి వాళ్ళను సాగనంపి లోపలికి వస్తుండగా, పెద్దక్షురా లతో అనంతరావు వివాహాన్ని గురించి ప్రక టించిన పత్రికను ఎవరో ఆయన చేతికి అందించారు. "ఫొటోలు కూడా ఉన్నాయి పూలహారాలతో" అంటూ వివరాలు చదువు దామని కళ్ళజోడు పెట్టుకొని చూస్తూనే గోడకు చేరగిలబడిపోయాడు. నిలువునా నీర యిపోయాడు!

ఈ వివాహ ఫలితముగా సీతయ్యగారి సంసారములో అనేక మార్పులు జరిగాయి. మాట ఇచ్చిన సంబంధాలు రెండూ తప్పిపో యాయి. బంధువులందరూ బహిష్కరిం చారు. వృద్ధాప్యములో కలిగిన మనస్తాపము వల్ల సీతయ్యగారి ఆరోగ్యం చెడిపోయింది.

ఆ కాలంలో ప్రౌఢ వివాహాలు ఆచార ములో లేవు కుమార్తెలవివాహసమస్య వృద్ధు డిని పీడించటం మొదలు పెట్టింది. అనంత రావు చేసుకున్న వివాహమువల్ల కలిగిన లోపాన్ని కప్పిపుచ్చ గలిగిన పెద్ద మొత్తాన్ని కట్నంగా ఇవ్వగలిగిఉంటే సీతయ్యగారికి మంచి సంబంధాలు దొరికే వేమో! ఒకచేత్తో కంటినీరు తుడుచుకుంటూ వివాహయోగ్యత లేని ముగుసళ్ళకు తన ముద్దు కూతుళ్లను కట్టబెటవలసి వచ్చింది. తండ్రి దుఃఖాన్ని తమ దురవస్థనూ తలచుకొని తల్లి లేని ఆ ఆడపిల్లలిద్దరూ ఎంత వ్యసనపడ్డారో దురూహ్యము.

వృద్ధాప్యములో తనకు మానసికాందో ళన కలిగించిన కుమారుడిమీద వృద్ధుడికి మమకారము నశించలేదు. సంక్షోభ జనిత మయిన కోపములో—ఏ దురుసుమాటలతో నయినా జాబువ్రాస్తే క్షమించమనీ, ఒక్క సారి వచ్చి కంటికి కనబడమనీ అదే తనకు ప్రాణవాయువనీ ప్రతిమిలాడుతూ సీతయ్య గారు అనంతరావుకు జాబులు వ్రాశాడు. నిత్యమూ తపాలావాడు వచ్చేవరకూ వాకిట్లో కర్రవానుకొని నిలువబడి, వాడు తమ ఇంటిని దాటిపోగానే, లోపలికివచ్చి కళ్లు తుడుచుకొనేవాడు.

అంతలో వృద్ధులకిచ్చిన కుమార్తెలలో రెండవఆమె వితంతువై తిరిగి తండ్రి దగ్గరికి చేరుకున్నది. కుమారుడికొరకు ఏడ్చి ఏడ్చి దృష్టిమాంద్య మేర్పడిన సీతయ్యగారికి కుమార్తె వైధవ్యము కరవులో అధికమాస మయింది. స్థితిగతులు వివరించి ఎన్ని జాబులు వ్రాసినా అనంతరావు హృదయము కరుగలేదు.

తన సంతానపు వైఖరి తలచుకొని వృద్ధుడు కుమిలిపోయేవాడు. చివరికి సీత య్యగారు తన జీవితములో అనంతరావును తిరిగి చూడలేకపోయాడు.

తన తండ్రి ఎంత గుణవంతుడు!

తనమీద ఆయన కెంత మమకారము!

వృద్ధాప్యములో తాను ఆయన నెంత దుఃఖపెట్టాడు!

అనంతరావుకు తండ్రి మాట తలపుకు రాగానే కళ్ళవెంబడి నీళ్లు రాలేయి. తానెంత కఠినుడు కాకపోతే తనయెడల అమిత వాత్స ల్యము చూపిన తండ్రి హృదయాన్ని బ్రద్దలు చేస్తాడు?

ఈ ఆలోచనతో అనంతరావుకు మరిగిన నూనె చుక్క ఒంటిమీద పడినట్టుగా చురు క్కుమన్నది. ఈ బాధలో మరొక భయం కరమైన విషయము స్మృతిపథాన మెరిసింది. 'కొంపతీసి...తండ్రిని దుఃఖ పెట్టటములో శేఖరానికి తనపోలిక రాలేదుకదా!'

పుండుమీద కారము చల్లితే మండినట్లు అనంతరావు హృదయము భగభగ మండి పోయింది. ★

---

**అభినవ న్యూటన్**

"వేడివలనవస్తువులు వ్యాకోచము, చలివలన సంకోచము పొందును." అనే విషయమై సైన్సు మేష్టరు అరగంటసేపు పాఠంచెప్పి సుబ్బారావును పిలిచి ఒక ఉదాహరణ చెప్పమన్నారు.

సుబ్బారావు:— వేసవిలో పగటికాలము ఎక్కువగును, రాత్రి కాలము తక్కువగును.

---

# మిద్దెమీద మిటకారం

## తెన్నేటి అహల్యాదేవి

మొత్తానికి ఆ భవనమంతా ఓ అలజడి ప్రారంభమైంది. ఊరికి వరగావున్న ఆ మేడిగల్లో ఏదో వసువు పోనిరోజు లేదు. ఒకరోజు తెల్లవారి లేచేసరికి తలుపు తెరిచి వుంటుంది. ఒక బ్లాకులో గడియారం పోయింది, ఇంకో భాగంలో పెట్టెలు 'పరారు'...మరోరోజున మరొకటి. గస్తీ తిరిగేవారు తిరుగుతు నేవున్నారు; పోయేవి పోతూ నేవున్నై.

పైనా క్రిందా సుమారు ఓ ఇరవై భాగాలున్న ఆ భవంతిలో ఏదో జరిగినప్పుడల్లా పోలీస్ ఇన్స్పెక్టర్ హాజరీతప్పదు. వస్తుంటాడు, పోతూంటాడు.

ఆనాడు 'భూపే' కూడా వచ్చాడు. ఆయనకు డిటెక్టివ్ సరదాలు చాలావున్నై. పనీపాటా లేదు. పిత్రార్జితం కైంకర్యం చేసుకుంటూ, హాయిగా తిని తిరుగుతాడు. అటల్లోనూ, డిటెక్టివ్ గాను కాలం గడుపుతాడు. చువ్వలు వంచివున్న కిటికీదగ్గర భూతద్దంతో పరీక్షచేస్తూ, భూపే హఠాత్తుగా ఆగాడు. అందరూ ఆటుకేసి ఆత్రంగా చూశారు. ఏమీలేదు ఒక చిన్న వెంట్రుకముక్క! భూపే చేపుతీసి కొలిచాడు; ఠీవిగా ఇలా ప్రకటించాడు, 'దొంగ ఎత్తు సరిగా ఐదడుగుల నాలుగంగుళాలు. ఇక్కడ పొంచినపుడు, కిటికీకి వున్న ఆరీ అరని రంగులో వాడితలవెంట్రుక చిక్కింది.

అందరికీ ఆశా, ఆశ్చర్యం కలిగేయి. ఇంకేం కాపీ తీసాడో అని ఎదురుచూస్తున్నారు. ఆయనకీ మేడిగలోనే వుండేవారెవరిమీదనో అనుమానం వున్నట్లు తెల్లమయింది.

మర్నాడు అందులో నివసించే ప్రతివాడి వేలిముద్రలూ తీసుకున్నాడు భూపే. దినమంతా ఓపిగా వాటితోనే కూర్చున్నాడు. తన నోట్ బుక్ లోని ముద్రలతో ప్రతీదీ పోల్చిచూచి చివరకు పెదవి విరిచాడు. ఇక లేచి పోలీస్ స్టేషన్ దారిపట్టాడు.

"కిటికీమీద దొరకిన వ్రేలి ముద్రలు దేనికీ సరిపోవటం లేదు. మేడిగల్లో వాళ్ళు కాదనుకుంటాను" అన్నాడు భూపే తన నోట్ పుస్తకం ఇన్స్పెక్టర్ గోఖే(పూర్తి పేరు గోకేటి భేతాళరావు)కి అందిస్తూ. మళ్ళీ అన్నాడు, "మీ స్టేషన్‌లో నేరస్థుల తాలూకు వ్రేలిముద్రల చిఠా ఉంటుంది కాదూ! దయచేసి రేపు మధ్యాహ్నంవరకు పోల్చి ఫలితం చెప్పాలి మిస్టర్ గోఖే."

"అసలు నీదాకా రానిస్తానుటోయ్! ఈ ముద్రలతో అయ్యే దేమిటి?" అనుకుంటూ, "సరే" అన్నాడు గోఖే వెక్కిరిస్తున్నట్టు పైకెత్తిన కనుబొమలతో.

ఆ రాత్రి చివ్వరి గదిలో రహస్యంగా మకాం వేశాడు గో. ఖే పదకొండు గంటలదాకా బలవంతంగా మేల్కొన్నాడు. ఐనా ఒంటరిగా ఎంతసేపని? ఎప్పుడు నిద్ర పట్టిందో, పాపం మెలకువ వచ్చేసరికి తెల్లవార వస్తోంది. లేచి త్వరగా తలుపు తియ్యబోయాడు. ఆశ్చర్యం! బైట గొళ్ళెం వేసి వుంది అరచి గోలచేస్తే, తుద కెవరో లేచి వచ్చి తీశారు. యథోచితంగా, ప్రక్క గదిలోనే, వంకెను వ్రేలాడే చొక్కా జేబులో ఉండాల్సిన పర్సు లేదు. ఇంకో దొంగతనమా? తన నీడలోనే? "ఎంత మంచి ఛాన్సుపోయింది! చేజిక్కిన దొంగ జారిపోవడం ఎంత దురదృష్టం" అనుకున్నాడు ఇన్స్పెక్టర్ గోఖే, నెత్తి గోక్కుంటూ.

* * *

ఆ మధ్యాహ్నం భూపే వేలిముద్రల పరీక్షా ఫలితాలకోసం స్టేషన్‌కు పోయాడు.

"హాలో మిస్టర్ గోఖే! ఏమైంది? ఎవరి ముద్రలో ఏమైనా ఆచూకీ తెలిసిన దైనా?"

ఇన్స్పెక్టర్ తెల్లమొగం వేశాడు. పెల్లగించుకొని చెప్పాడు, "బలేవాడవయ్యా! తీరా చూస్తే నా వ్రేలిముద్రలే అవి. దొంగ తనమైన మర్నాడు నువ్వు రాకముందు నేనా కిటికీ అంతా పరీక్షిస్తుంటే పడివుంటై..." గత రాత్రి తను వేసిన కాపు సంగతి భూపేకింకా తెలియనందుకు ఇన్స్పెక్టర్ తన్ను తానభినందించుకున్నాడు.

వ్రేలిముద్రలకోసం పడ్డ వ్యథఅంతా, ఈ వింతకథ గామారి, వృథా ఐపోయింది. ఎన్నో పరిశోధక నవలలు చదివిన భూపే డిటెక్టివ్ హృదయానికి ఓ అనుమానం తట్టింది. 'అసలితడు నిజమైన ఇన్స్పెక్టరేనా? లేక దొంగవాడే ఇలా



నాట్యగణతి

—ఫొటో: కమృద్దీన్ ఖాన్, కటక్.]

"గోఖే ఏం చూస్తున్నాడో? వాడెవడో?" మళ్ళీ అనుకున్నాడు. "అబ్బే! ఇక్కడ అలాంటిదానికేమీ ఆస్కారం లేదు." కుదరకోదని నిర్ధారించుకున్నాడు. ఈ ఆలోచనలతో భూపేష్ మతిపోయినట్లైంది.

అలానే గోఖే ఎదురుగా దీర్ఘంగా ఆలోచిస్తూ కూచున్నాడు. హఠాత్తుగా ఒక చిటికేసి "అది సంగతి...సరే, ఈ దెబ్బతో దొంగ దొరికిపోవాల్సిందే. కాని ఇప్పుడేమీ చెప్పను...గుడ్ బై మిస్టర్ గోఖే" అంటూ లేచిపోయాడు.

అంత హఠాత్తుగా అతనికి ఏం జ్ఞానోదయమైందో! తనకలాంటిదేమీ తోచనందుకెంతో నొచ్చుకున్నాడు గోఖే. అతనికన్న ముందే తాను దొంగను పట్టుకోగలిగితే ఎంత బావుండును! కాని తను దొంగను పట్టాలనిపోతే, తనకు నిద్రపట్టకుండా వుండాలిగదా!

ఆరోజునించే పట్టుదలతో మసిగల్లో పై అంతస్తుమీద పాపం నిద్రలేకుండానే కాపు వేశాడు, గోఖే. ఒకటి, రెండు, మూడు రాత్రులు ఏ సంఘటనా లేకుండానే గడిచాయి. చాలా నిరుత్సాహం కలిగింది. దొంగతనాలు కాకుండా వుంటానికే తను ఉద్యోగంలో ఉంది. ఐనా అప్పుడు మాత్రం దొంగతనం కాదేమో అనేదే ఆయన ఆదుర్దా. నాల్గో రాత్రికూడా వట్టిగానే గడిచిపోయింది, అతనికిక నిరాశ కలిగింది. ఐదో రాత్రి పన్నెండు దాటింది. మెట్లపక్కనే, పిట్టగోడ కానుకుని, బొంగులబస్తాల వెనుకగా ఎఱ్ఱని కళ్ళతో పొంచివున్న గోఖే లేచి నలుదిక్కులా చూచాడు. అసంతృప్తిగా ఇలా అనుకున్నాడు, "లాభం లేదు దొంగ పసి కట్టేశాడు. వాడిక వస్తాడని ఏమీ ఆశ లేదు. ఈ నిద్ర చెడటం కూడా......" హఠాత్తుగా అల్లంత దూరాన ఏదో కదలిక చూచినట్లనిపించిం దాతనికి. ఆ గాఢాంధకారంలో, ముందుకు వంగి కళ్ళుపొడుచుకుని పరికించాడు. అవును, నిస్సందేహంగా అది మనుష్యాకారమే! పిల్లిలా అడుగులు వేస్తూ ఇటే వస్తున్నాడు. ఈ సారైనా, మెలకువతో ఉన్నందుకు తన అదృష్టాన్ని అభినందించుకుంటూ గోఖే కుదించుకు కూచున్నాడు. తాను చెయ్యబోయే సాహస కార్యాన్ని గూర్చి పరిపరివిధాల తలపోస్తున్నాడు. ఇంతలో జ్ఞాపకం వచ్చింది. తన రైఫిల్ గదిలో పెట్టివచ్చాడే! ఇప్పుడు లేచి తీసుకురావాలంటే అలికిడి కాదూ? ఔను. అలికిడైతే వాడిక దొరకడం దుర్లభం. ఏమీ అక్కర్లేదు...... ఆ ఆకారం మేడమెట్లు సమీపించింది. అటూ ఇటూ చూసి మేడమెట్లెక్కడం కూడ స్పష్టంగా చూచాడు. గోఖే. క్షణాలు లెక్క పెడుతున్నాడు. అతని గుండె వేగం హెచ్చింది.

మెట్లమీది అడుగుల చప్పుడు సమీపించింది, మెల్లగా—అతి మెల్లగా, దొంగ పై మెట్టుమీద కాలుపెట్టాడు. ఎంతో జాగ్రత్తతో అటూ ఇటూ చూచి ఒక్క ఉరుకు ముందుకు వేశాడో లేదో - తటాలున గోఖే అతడి మీదకు దూకి గొంతు పట్టుకున్నాడు. ఎలాగైనా వశపర్చుకొని సగర్వంగా నలుగురి ఎదుటా ప్రదర్శించాలని. తగని పట్టుదలతో విజృంభించాడు 'గోఖే'. కాని వాడుమాత్రం ఏమీ తక్కువ తినలేదు. అనుకున్న దానికన్నా చాతుర్యంగా బలాగ్గా పెనగుతున్నాడు. కన్నంలో తేలుకుట్టిన దొంగలాగానే వాడూ కిక్కురుమనటం లేదు. ఇద్దరూ నిశ్శబ్దంగా అంధకారంలో మల్లయుద్ధం చేస్తున్నారు. పిట్టగోడమీద పడ్డవాడు క్రిందకు జారాడంటే కపాలమోక్షం తప్పదు. ఒకరినొకరు క్రిందకు తోసెయ్యాలని గ్రుద్దులాడుకుంటున్నారు."

అప్పుడే, ఈ గ్రుద్దుళ్ళకు, త్రోపిళ్ళకు ప్రక్కగదులవాళ్ళిద్దరు ముగ్గురు మేలుకొన్నట్లున్నారు. గోఖే అలసిపోయాడు. దొంగతనను నెట్టివేసే పరిస్థితి వచ్చింది. ఒక చేత్తో వాడి నడుం పట్టుకొని, రెండో చేత్తో కిటికీ చువ్వ పట్టుకొని గట్టిగా అరిచాడు. అతని బలాత్కారం పట్టు విడిపించుకోలేక ఏమో దొంగ ఇక కదల్లేదు. ఒక తలుపు తెరుచుకుంది. గవాక్షద్వారం గుండా విద్యుద్దీపం వెలుగు ప్రసరించింది. ఇద్దరు ముగ్గురు బైటికి వస్తున్నారు కూడా.

వెలుతురులో గోఖే సగర్వంగా దొంగ ముఖం కేసి చూశాడు. దొంగ కాదు! తెల్లబోయినుంచున్న భూపేష్! ఇంతసేపూ ఈ యిద్దరేనా యుద్ధం చేసింది? చూస్తే. ఇద్దరూ ఇంజన్లలాగా రొప్పుతూ చెమటలు కక్కుతున్నారు అందర్నీ చూసి తలవంచుకున్నారు "మరి దొంగ ఎవరు?" అన్నట్టుగా ప్రేక్షకులంతా చూస్తూ ఉండిపోయారు.

* * * *

తెలవారేసరికి ఊరంతా గప్పున వార్త వ్యాపించింది. ఆరాత్రి సుమారు ఒంటి గంటకు, ప్రయివేట్ డిటెక్టివ్ భూపేష్ ఇంట్లో దొంగలు పడ్డారు!! ★

సీరియల్ నవల......

# జీవనలీల

..మూలం..

మానిక్ బంద్యోపాధ్యాయ

..అనువాదం..

మద్దిపట్ల సూరి



[గతవారం తరువాయి]

సేన్‌దీది అస్వస్థతతో శవంలా పడుకుని ఉంది. ఆమె శరీరపు రంగు ఎర్రని ఎరుపుగా మారిపోయింది. ఒంటినిండా అస్పష్టంగా కాన వస్తున్న చిహ్నాలను శశి గుర్తించాడు. శశిముఖం వాడి పోయింది. శరత్కాలం ప్రారంభంలో సేన్‌దిదికి ఈ వ్యాధి ఎక్కడినుంచి వచ్చింది? గావాదియాలోనే కాదు కలకత్తా మహానగరంలో కూడా ఆమె అంత రూపసిని చూసి యెరుగడు శశి. అంత రూపసి కనుక నే అపవాదుల్ని భరించవలసి వచ్చిందేమో. అలాంటి ఆమెకీ వ్యాధి ఏమిటి?

శశి పిలుపువిని యామినీకవిరాజుభార్య, కళ్ళు తెరిచిచూసి ఏడుస్తు "నువ్వ ఇన్నాళ్ళకి వచ్చావా శశి? నేను చావుకి సిద్ధమైఉంటే? ఇదేం రోగమో అంతుపట్టకుండా ఉంది శశి జ్వరంతో మధ్య మధ్య స్పృహ తప్పిపడి ఉంటున్నాను. ఒళ్ళునొప్పులూ అవీ చెప్పలేనంత బాధగాఉంది" అన్నది.

"నాకు తెలియనే తెలియదు సేన్‌దీది!"

"ఎవరిచేత కబురంపించను? ఎవరైనా దగ్గరకు వచ్చే వాళ్లుంటేనా అసలు?"

సేన్‌దీదీకళ్ళు ఇటు త్రిప్పుకోలేక పోయింది. కనుకొలకుల్లొంచి కన్నీరు కారుతోందామెకి. శశి పక్కమీద కూర్చుని, ఆమెకిజ్వరం ఎంత ఉన్నదీ థర్మామీటర్ తో చూశాడు. అతడికేం చెయ్యటానికి తోచలేదిహ. యామిని ఆమెకి అస్వస్థతగా ఉన్న సంగతి దాచాలని ప్రయత్నించాడు. ఇంతవరకు చికిత్సకూడా ఏమీ చేసినట్టులే దసలు. ఇటీవల అతడు ఆమెసంగతి పట్టించుకోవటం లేదు ఎంచేత? మాసి కంపుకొడుతున్న ఈ పక్కమీద సేన్‌దిదీ చికిత్సలేకుండా ఎన్నాళ్ళ నుంచి పడిఉందో. ఆమెకి రవంత ఉపచారం చేసేందుకైనా ఎవరూ లేరు—శశికేమీ బోధపడలేదు. తపస్సుచేస్తే కాని లభ్యపడని, ప్రపంచాన్నంతనీ ఉన్మత్తం చేసే అంత సౌందర్యం యామినికి లబ్ధమైంది. ముసలితనంలో అతడు భార్యకి దాసుడై ఉండవలసింది. అతడికింత తిరస్కారభావం ఎంచేత? సీత, హెలెన్, క్లియోపాత్ర లాంటి అసాధారణ రూపసౌందర్యాదులున్న వారందరి విషయం లోనూ ఇలా ఏదో అసంబద్ధమైనదే జరుగుతూ ఉంటుందిలా ఉంది లోకంలో!

కొంచెం సేపయాక యామిని గదిలోకి వచ్చాడు. "ఇంకా నువ్వ ఇక్కడే ఉన్నావా శశి? నువ్వ వెళ్ళిపోయి ఉంటావను కున్నాను నేను!" అన్నాడు బుంగమొహం పెట్టుకుని......

"ఓసారిమీరిలా బయటికి రండి తాతగారూ!" అన్నాడు శశి. బయటికి వచ్చాక "సేన్‌దీది జబ్బేమిటో కనుక్కోలేక పోయా రన్నమాట మీరు" అని అడిగాడు.

"మొత్తానికి భలేనవ్వొచ్చేమాటే అన్నావురా శశి! నలభైయేళ్ళ నుంచి వైద్యం చేస్తున్నాను. చుట్టుపక్కల మూడుజిల్లాల్లో మన పేరు యెరుగని వాళ్ళెంటూ లేదు. నేను జబ్బు కనుక్కోలేక పోయానని ఇవాళ నువ్వ నన్నుదిద్దబోతున్నావా? అలా ఒక సారిమూడగానే జబ్బేమిటో చెప్పెయ్యగలను. ఆవిడకి మలేరియా."

"మలేరియా కాదు తాతగారూ! మశూచికం."

"ఆఁ! మశూచికమా? శరత్కాలంలో మశూచికమా?"

"ఊఁ" అన్నాడుశశి, యామినీ ముఖం నల్లపడిపోయిం దేంగుకో. యామిని తెలియనట్టు నటిస్తున్నాడా? శశి కొంచెం కఠినంగా "సేన్‌దిదీ చికిత్సాభారం నేను పైనవేసుకుంటాను తాత గారూ! ఛా, ఛా, ఇంతవరకు ఏమీ చెయ్యనేలేదు" అన్నాడు.

"నామందు పుచ్చుకుంటేనా!"

శశిగదిలోకివెళ్ళి కూర్చున్నాడు. ఏమనుకున్నాడో యామినీ కూడా గదిలోకివెళ్లి నుంచున్నాడు. ఎంతో పెద్ద చిక్కువచ్చి పడి నట్లుంది అతడికి. కొద్దిరోజులక్రితం అతడిలాంటి రోగినే ఒకర్ని చూడటానికి సాంత్రగామానికి వెళ్ళాడు. ఆరోగిని బ్రతికించలేక పోయాడు శశి. బ్రతికించే ప్రయత్నంకూడా చెయ్యలేకపోయాడు. అసలతడిన్ని పిలవటమే ఆఖరిక్షణాల్లో పిలిచారు. అప్పటివరకు ఆ ఊళ్ళోనేఉన్న యామిని శిష్యుడు భూపతిచరణ్ చికిత్సచేశాడా రోగికి. అది ఇప్పుడు శశికి హఠాత్తుగా జ్ఞాపకంవచ్చింది. ఆరోగి చనిపోయాక యామిని—'నాశిష్యుడు విముక్తిపత్రం ఇచ్చినవాణ్ణి బ్రతికించగలడా శశి? మా శశి!'—అన్నాడు.

శశి తనశక్తినంతా ధారపోసి సేన్‌దీదీకి చికిత్స, శుశ్రూష చెయ్యడం మొదలెట్టాడు. ఇతరరోగులు ఎవరు కబురంపినా అతడు దొరకటంలేదు. ఇంట్లోఎవరికైనా జ్వరంవసే రెప్పపాటిలో పరీ క్షించటంముగించి మందుయిస్తాడు. కాదుఅంటే ఇహ మళ్ళి వాళ్ల సంగతే కనుక్కోడు. బంధువుల్ని—మిత్రుల్ని, ఆత్మీయులనీ—ఆప్తుల్ని అందర్నీ నిర్లక్ష్యం చేశాడతడు. అనవసరంగా మతికి యింజక్షన్లు ఇవ్వటానికి హారూఘోష్ వాళ్ళయింటికివెళ్లటంకూడా మానేశాడు. శశికి కోపంవచ్చి ఉంటుంది అనుకున్నది కుసుమ. తాటితోపులోఉన్న తామరకొలనులో పూలు తెచ్చుకోటానికై వెళ్ళి—'చినబాబు ఇవాళ తప్పకుండా వస్తారు. చినబాబు కివాళ ఇన్ని పద్మాలివ్వాలి' అని ఆశపడసాగింది మతి. కుసుమకి మనస్సులో మాత్రం శశిమీద కోపంతగలేదు. మతితెచ్చిన తామరపూవు ల్లోని గింజ లిహాకూర వండాల్సి వచ్చింది.



సేన్‌దీదీకి చికిత్స చెయ్యటం ఒక్కటే అయితే శశికి నాలుగు పనులూ చూసుకునే వెసులుబాటు ఉండేదే. చికిత్స చెయ్యటం మొదలు పెట్టేందగ్గిర్నుంచి—ఈ యింట్లో గోపాల్, ఆ యింట్లో యామినివాళ్ళ సలహాలు, అభ్యంతరాలు వీటిమూలంగా అతడు చాలా ఇరుకున పడవలసి వచ్చింది; పెద్ద బెడద తెచ్చుకున్నట్టూ అయింది. అతడికిదంతా బోధపడకుండా ఉన్నదసలు. అప్పుడప్పుడు—తన చికిత్సమీద వాళ్ళకి గురిలేదు, ఆ మాటనే ఇలా అన్యాపదేశంగా తనకి చెప్తున్నారేమో!' అనిపించేది. మరో చికిత్స చేస్తున్నదీ ఏమీలేదు! మంచో చెడో—తన చికిత్సని చటుక్కున మధ్యలో ఆపించటానికి తగిన కారణం ఏముంది? 'నా మందు పుచ్చుకోదు' అని యామిని మందు యివ్వటానికి అంగీకరించటంలేదు. సేన్‌దీదీని చంపాలని చూస్తున్నారాయేం? అలా మాత్రం యెందుకు కోరుకుంటారు? అదీకాక లజ్జాకరమైన యామిని చాదస్తానికి గోపాల్ ఎందుకు సాయపడుతున్నట్లు? అతడి స్వార్థం ఏమిటి?

ఇందులో ఏం రహస్యమైనా ఉండనీ—శశి ఒక్కడూ సేన్‌దీదీకి

# జీవనలీల

దాపురించిన ముగురి యముళ్ళతో పోరాడటం మొదలెట్టాడు,

"ఆ పెద్ద సీసాలో మందు ఏమయింది తాతగారూ?" అని అడిగాడు.

"మూడు మోతాదులుంది కదూ! తాగించేశాను. మీవి ఏం మందులు శశీ! ఏదీ చూసినా బ్రాందీ కంపు, లేదా సిరప్ వాసన!" అన్నాడు యామిని.

"తాగించేశారా? ఆ గుండ్రటి సీసాలో మందంతా త్రాగించేశారా?" అని భయపడుతూ అడిగాడు శశి.

"ఏం త్రాగితే? ఊరికే తెగ ఆరాటపడటం చూసి, నీ రోగే కదా—అదినీమందేనాయె. త్రాగించేద్దామని అనుకున్నాను, ఇచ్చాను."

శశి కోపం తెచ్చుకుని "నా రోగే ఏమీ కాదు తాతగారూ! నేను వెడుతున్నాను. మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి" అన్నాడు.

అతడొక విధంగా బయలుదేరినట్లే, గదిలోంచి బయటికి వచ్చాక నడక వేగం తగ్గించినుంచున్నాడు. సేన్‌దీది భయపడుతూ తన కేసి చూసిన చూపు. ఆమె తనమీదనే గురిపెట్టుకుని ఉండటం గుర్తుకు వచ్చాయి అతడికి. శశి మళ్లీ వెనక్కి తిరిగి వెళ్ళాడు. "అది పొక్కుల్ని పైకి రప్పించే మందు. అది వారంరోజుల క్రితం ఇచ్చిన మందు. ఆ సంగతి మీకు తెలియదూ?"

యామిని ముఖం- అసలు కొన్నాళ్లనుంచి దిగుళ్లతో కాబోలు వాడిపోయి, తెల్లపడి నట్లుంటోంది. అతడు గుడ్లు మిటకరిస్తూ "నేను దేశీయ వైద్యుణ్ణి, మీ మందులేమిటో నాకేం తెలుస్తాయి బాబూ నాకేమీ తెలియదు" అన్నాడు.

"తెలియకపోతే పోనీ నన్ను అడిగయినా ఇవ్వద్దూ? సేన్ దీదీని మీరు చంపేస్తున్నారు. పొక్కులు పైకి తేలాక - పొక్కుల్ని పైకి తేలించే మందిచ్చారా విడకి!"

యామిని ఏమీ మాట్లాడలేదు.

శశి కొంచెం మెత్తపడి, "మీరు చాలా అన్యాయం చేశారు తాతగారూ. ఇంకెప్పుడూ మాత్రం ఇలా చెయ్యకండి" అన్నాడు.

"నా కదైనా ఓ మందు యిస్తావా శశీ? వెంటనే పొక్కుల్ని పైకి రప్పించే మందు!" అని అడిగాడు యామిని.

శశి వెంటనే సంశయంలో పడి, "అలాంటి దేదయినా మీ మందు తీసుకున్నారా యేం?" అని అడిగాడు.

"ఉహూఁ నా మందు పుచ్చుకో లేదు నేను."

"పోనీ పుచ్చుకు నేందు కేమైనా ప్రయత్నించారా?"

అసలే తిక్కగా ఉన్న యామినీ ఈ మాటతో రేగిపోయాడు.

"చేస్తేమాత్రం ఏం? ఆఁ ఆఁ. పోనీ. చేశాననే అనుకో! మీ బ్రాందీలూ సిరప్‌లూ అంటే నాకేం నమ్మకం లేదోయ్. చికిత్సట చికిత్స. మశూచానికదే- మా చికిత్స అయితే- ఎందుకు వచ్చిన శ్రమ కాని, నీ పుస్తకాలూ అవీ కట్టకట్టి కాలవలో పారేసి, పోయి ఎక్కడున్న వాడిని అక్కడ కూర్చో."

అంటూంటే యామినికి ఉన్న ఓర్మి కాస్తా ఉఫ్‌న ఎగిరి పోయింది-

"నువ్వింక రావొద్దు ఇక్కడికి" అనేశాడు.

శశికి కూడా మనస్సు కుదురుగా లేదు- "మీరు మొదట్నుంచీ చేసినదానికి పోలీసుల్ని కనుక పిలిచిపట్టిస్తే పదేళ్లు జైలుపడుతుంది మీకు" అన్నాడు.

యామినిముఖం వివర్ణమై పోయింది. "ఏంచేశాను నేను? చికిత్స చేస్తున్నది నువ్వు. నేనొక్కమాత్ర అయినా ఇవ్వలేదు" అన్నాడు...

శశి యింక ఊరికే సాగతీయ లేదు. ఈ పిచ్చివాతో టి కలహం పెట్టుకుని ఏం లాభం?

"ఇది తగాదాకి సమయమా తాతగారూ?"

"తగాదా పెట్టుకుంటున్న దెవరు బాబూ?"

స్పృహ రాగానే యామిని భార్య—"ఎవరక్కడ? శశీ? ఎవరితో మాట్లాడుతున్నావ్?" అన్నది. ఎదుట ఎవరున్నదీ ఆమెకి కన్పించదు. కళ్లు మూతలు పడిపోయాయి. యామిని గదిలోకి వచ్చాడని తెలిస్తే ఆమె చాలా ఉద్విగ్నురాలవుతుంది. "వారిని ఇక్కడినుంచి వెళ్ళమని చెప్పు శశీ. వెళ్ళమని చెప్పు. ఇక్కడ ఉంటే నాచేత విషం తాగించి చంపేస్తారు నన్ను—వెళ్ళండి మీ రిక్కడనుంచి లేచివెళ్ళండి" అన్నది...

యామిని వెళ్లిపోయాక "నేను బ్రతుకుతానా శశీ?" అని అడిగింది.

"బ్రతక్క పోవటమేమిటి?"

సేన్‌దీదికి సంతోషం వేసింది. కాసేపు మెదలకుండా పడుకుంది. ఆమె ఎంత యాతన పడుతున్నదీ శశికి తెలియందేముంది? ఆమె సహనశక్తిని చూస్తూంటే శశికి ఆశ్చర్యం కలగసాగింది. సాధించటం ఏడవటం అదేం లేదు. మధ్యమధ్య నేను బ్రతుకుతానా బ్రతకనా అని మాత్రం అడుగుతూంటుంది.

"ఇంత దగ్గరగా వచ్చి కూచుంటావ్—నీకేం భయం లేదా బాబూ?" అని అడిగింది సేన్‌దీది.

"భయమెందుకు? ఆర్నెల్ల క్రితం టీకాలు వేయించుకున్నాను."

"ఏమయినా నువ్వు నా బిడ్డవే నాయనా! కడుపున బిడ్డ కంటె నువ్వంటేనే నాకపేక్ష" అన్నది సేన్‌దీది.

ఆ మాట శశిని విచలితుణ్ణి చేసింది. సేన్‌దీదికి తన మీద చాలా అపేక్ష అని అతడికి పన్నెండేళ్లవచ్చి నప్పట్నుంచీ తెలుసు. ఆమె ఆ మాట అన్నతీరు అతణ్ణి విహ్వలుణ్ణి చేసేసింది. అస్వస్థతగా

పసిఉన్న ఈ పల్లెటూరి పడతి ఉద్వేగంతో అన్నమాటలో ఏదో పవిత్రంలాంటిది ద్యోతకమయింది. కడుపున పుట్టిన బిడ్డమీద కంటె కూడా ఎక్కువ అపేక్ష! ఈ మాటకి అర్థం ఏమిటి? సేన్‌దీదీకి పిల్లా—జెల్లా ఎన్నడూ పుట్టనే లేదే అసలు!

శశి ఓనాడు రాత్రంతా సేన్‌దీదీకి శుశ్రూష చేస్తూ కూర్చుని, తెల్లవారకట్ల ఇంటికి తిరిగివచ్చాడు. అతడు వచ్చేసరికి వాళ్లయింటి కెదురుగా ఉన్న నల్లవావిలి చెట్టుక్రింద పువ్వులు ఏరుకుంటోంది మతి. శశి రాకపోవటానికి కారణమేమిటో తెలుసుకున్నదల్లే ఉంది.

శశి చెట్టు ఊపి పూలురాల్చి, "నువ్వు టికాలు ఎప్పుడు వేయించుకున్నావ మతీ?" అని అడిగాడు.

"టికాలు వేయించుకోలేదే" అన్నది మతి.

"వేయించుకోలేదూ? ఏం వేయించుకుంటే ఏం పోయింది? ఉండు, ఇవాళ మీ యింటికొచ్చి అందరికీ టికాలు వేసి వస్తాను. ఊళ్ళో మశూచికాలున్నాయన్న మాట మరచిపోకు"

మతి అపనమ్మకమైన నవ్వొకటినవ్వి "టికాలు వేయించుకుంటే ఏమవుతుందేమిటి? శీతలాదేవి చల్లని చూపుచూస్తే సరికాని లేకపోతే ఏం చేసినా రాకమానదు చినబాబూ!" అన్నది.

"ఆఁ నీ తలకాయేం కాదూ?"

మంచు మూలంగా చిన్నజల్లొకటి పడ్డట్టు చుట్టూ అంతా తడిసి ఉంది. మతి కట్టుకున్న చీరె సగంతడిసి, చూడటానికెంతో తాజాగా ఉంది. చీరె మెత్తగా ఉండటంవల్ల మతికెంతో హాయిగా ఉన్నట్టుంది అనుకున్నాడు శశి. వేకువవేళ—జాగరణ చేసిన కళ్లూ ఆమే—సహజంగా ఉన్న వయసుకంటె కొంచెం పెద్దదిగా కన్పిస్తోంది. ఆమెని అలా చూస్తూంటే ప్రొద్దున్నే బీడీ కాల్చటంలోని హాయి మరింత మధురంగా తోచసాగింది శశికి.

"మీరు గొరలని, భగవంతుడంటే మీకు నమ్మకంలేదని అంటుంది మావదిన నిజమేనా చినబాబూ?" అని అడిగింది మతి.

"ఊహూఁ అంతా ఒట్టిది. భగవంతుడంటే భక్తి విశ్వాసం ఉన్నాయికు" ఆమాట వినేసరికి మతికి మనస్సు కాస తేరుకుంది.

"మిమ్మల్ని గురించి ఆవిడ ఇష్టం వచ్చినట్లు మాట్లాడుతూంటుంది"

"ఆహాఁ! ఏమంటుందేమిటి?

మతి ముసిముసినవ్వు నవ్వి—"ఎన్నని చెప్పను?" అన్నది.

శశి నవ్వుతూ—"నువ్వూ అంటూనే ఉంటావుగా. కుసుమ నీ దగ్గిర్నుంచే నేర్చుకుని ఉంటుంది" అన్నాడు.

మతి ముఖం వాడిపోయింది.

"నేను మిమ్మల్ని అంటానా ఏమైనా? నేను మిమ్మల్ని ఏమయినా అలాఅని ఉంటేనా నోరు పడిపోవాలి, పడిపోవాలి, పడిపోవాలి. భగవంతుడిమీద ఒట్టు వేసుకు చెపుతున్నా."

శశి తెలబోయి, "నువ్వు భలేదానివి మతీ! ప్రొద్దున్నే లేచి ఏమిటిమాటలు?" అన్నాడు.

మతి ఈసారి కోపంతో-"నాకలా అయితీరుతుంది" అన్నది.

ప్రొద్దుపొడవగానే మతి ఇంటికివెళ్లింది "ఇంత పల్లెటూరి స్వభావమైనా, చూపులకి పల్లెటూరిపిల్లలా ఉండదు" అనుకున్నాడు శశి.

'చివరికి చినబాబు ఎలా చూస్తున్నాడు నన్ను? నన్ను గురించి ఏమనుకుంటున్నాడు?" అనుకున్నది మతి.

*　　　*　　　*

హేరూఘోష్ వాళ్ళ యింటిముందు వంగమొక్కలిప్పుడు బాగా యేపుగా ఉన్నాయి. కొన్ని మొక్కలు పిందెలుకూడా వేశాయి. చావడిప్రక్కనుంచి వెనకనున్న మైదానంకేసి చూస్తే చాలాదూరం పొగమంచు కమ్మిఉండటం కన్పిస్తుంది. అంతదూరం వరకు శుభ్రంగా కడిగినట్లుంటుంది. మతి మనస్సుకి తృప్తిగా ఉంటుంది. ప్రొద్దున్నే బంగారు లేయెండలో కనుచూపు మేరలో ఉన్న ఊళ్లన్నీ అపూర్వంగా కన్పించటంవల్ల కాదది. ప్రకృతి-తమ గ్రామీణప్రకృతి-మతికి ఎంతో హాయికలిస్తూంటుంది. ఆకాశంలో విరిసే ఒక్క ఇంద్రధనుస్సు తప్ప ఆమె కళ్ళకు కాని, హృదయానికి కాని ఇంకేది చిత్రవిచిత్రంగా కన్పించదు. ఎదురుగా చిరుగాలికి ఊగిసలాడే లేజివుళ్ళు ఏ లేతహృదయాల్ని ఊగిస్తాయో ఎవరు చెప్పగలరు? మతి హృదయాన్నిమాత్రం కదిలించవు. తాటిచెట్ల నీడలుపడి నల్లగా ఉండే నీళ్ళలో తెల్లటిబాతులు ఈదుతూ ఉంటాయి. వాటి ఒంటికితగిలి ఎర్రకలువలు-తెల్లకలువలు మునిగి తేలుతూఉంటాయి నీళ్ళవంచనేఉన్న తీగబచ్చలిపూలు గాలికి కదులుతూ ఎంతో బావుంటాయి; ఆకాశంలో తెలటిమబ్బులు తేలిపోతూంటాయి అడవిపావురాలు ఎగురుతూంటాయి గోరువంక ఎగరబోయేముందు కూస్తూంటుంది. అలంతదూరంలో గువ్వలుగోష్ఠి

(59-వ పేజీ చూడండి)

# శ్రావణ మాసమూ, చంద్రకాంతలూ

శ్రావణమాస మొస్తోందనగానే, వాకిలినిండా విరబూసిన రంగురంగుల చంద్రకాంత పూలూ, ఉన్నట్లుండి వచ్చే వానా, పేరంటాలూ; మనోచక్షువుముందు మెదలి మధురానుభూతిని కలిగిస్తాయి.

"శ్రావణమాసానికీ, చంద్రకాంతలకీ ఏమిటో ఈ అనుబంధం?" అనిపిస్తుంది.— సంపెంగలకు, మల్లెలకూ, సన్నజాజులకూ వున్నంత పరిమళం లేకపోయినా, చంద్రకాంత పూలలో విచిత్రమైన ఆకర్షణవుంది. లేకపోతే, ఆ పూలనుచూడగానే రంగు, రంగుల చీరెలతో, ముస్తుగా ముస్తాబయి, పేరంటంవెళ్ళే పడుచులు జ్ఞాపకంరారేమో!

చిన్నతనంలో ఈ చంద్రకాంత పూలంటే ఎంత ఆపేక్షగా వుండేదనీ!

ఆ రోజుల్లో అమ్మమ్మగారి దొడ్డినిండా వనంలా వుండేవి చంద్రకాంత చెట్లు!

తలనెరిసి, పళ్ళువూడి, శక్తిసామర్థ్యాలు తగ్గిపోయినా శ్రద్ధగా పూలన్నికోసి దండ అల్లి ఇచ్చేది అమ్మమ్మ!

ఆవిడఇచ్చిన ఎర్రరాళ్ళ దుద్దులకన్నా, జిగినీ గొలుసుకన్నా విలువైనవేమో ఆ దండలు!! చంద్రకాంత పూవులంటే చటుక్కున మామయ్యకూతురు సావిత్రి జ్ఞాపకం వస్తుంది. నాకంటే చిన్నదైనా, పోటిపడి పువ్వులు పూర్తిగా విచ్చుకోనక పూర్వమే కోసుకునేది...

ఆ ఉక్రోషం పట్టలేక, ఆమెను అరటి పాదు పెంతవున్న మురికిగుంటలోకి త్రోసి ఆ తర్వాత అమ్మ కొప్పడితే సముదాయించినమాట నిజమే!

శ్రావణమాసమన్నా చంద్రకాంత పూవులన్నా హృదయం సంతోషము నింపుకుంటుంది. ప్రశాంతంగా ఎండకాసి ఉన్నట్లుండి కారుమబ్బులు కమ్మి, వానకురిసే శ్రావణమాస వాతావరణం ఎంత మనోహరమైనది! కుంభవృష్టి తగ్గిపోగానే నీళ్ళ మడుగుల్లో ఇంకా పడవలు వేసి ఆడుకోవాలనే వుంటుంది. చిన్ననాటి స్మృతులు మళ్ళీ "చిన్న పిల్లయిపోతే!" అనిపింపజేస్తాయి!

ఆ చిన్నతనమంటే ఎంత ఇష్టంలేనిదే వర్డ్స్‌వర్త్‌లాంటి మహాకవులు చిన్నతనాన్ని గురించి కవిత్వం రాస్తారు!

"శిశువు మనిషికి తండ్రి" అని వర్డ్స్‌వర్త్ అనలేదూ?

ఇలాంటివన్నీ తలచుకుని, ఎప్పుడైనా మనసులో రేగుతున్న కోరిక నణుచుకోలేక పడవలు వేస్తే మా ఎదురింటి కాలేజీ కుర్రాళ్ళు చప్పట్లుకొడుతూ, ఓ "రాక్ ఏన్‌రోల్" పాట ఎత్తుకుంటారు...

అదంతా చూసిన వదినె —

"ఏవమ్మా! నీకు నిజంగా అలా ఆడుకోవాలని వుంటుందా? లేక గొప్పకోసమా?" అంటుంది సూటిగా.—

వచ్చే, వచ్చే కోపాన్ని పెదవులక్రింద నొక్కిపెట్టి, నిరాశగా, గాలికి వూగుతున్న పూలమొక్కల్ని చూస్తూ నిలబడిపోతాను...

చిన్ననాటి సరదాలూ, అభిరుచులూ, పెద్దయ్యాక "సిగ్గు, మర్యాద," అనే తెరల చాటుకుపోయి వాడిపోతాయేమో!

## "మల్లి"

అబ్బాయిలే కాదు. కొంత మంది అమ్మాయిలు కూడా ఒక్కొక్క సారి ఇలాగే ప్రవర్తిస్తారు. రంగు రంగుల చంద్రకాంతల మాల తలలో తురుముకుని,ఒక సారి "టీ పార్టీ" కివెళ్ళాను.

నేను హాల్లో అడుగుపెట్టే సరికి మాస్నేహితురాలొకమ్మాయి వెంటనే వాకిలంతా వెతికి వచ్చింది...

"ఏమిటి వెదుకుతున్నావ్?" అన్నాను.

"మేక లెక్కడున్నాయ్యా అని చూస్తున్నాను" అంది.

అంతా ఫక్కున నవ్వే సరికి నా కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

గొంతు సవరించుకుని:

"ఒకరి అభిరుచిని హేళన చెయ్యటం సమంజసం కాదు" అన్నాను...ఇంతలో క్రిష్టియన్ ఫ్రెండ్ ఫ్లారెన్స్ పరిగెత్తుకుంటూ వచ్చి!

"నీ జడలో, ఆ పూలు చాలా బాగున్నాయి...ఆమాల ఎంత "ఆర్టిస్టిక్" గా వుందని!" అంది.

చిరునవ్వు నవ్వి వూరుకున్నాను.

ఇందాకటి విమర్శలు రేపిన కోపాన్ని ఈ ప్రశంస చల్లార్చిందనే చెప్పవచ్చు.

"అదేమిటి? నీ పాదాలు అంత పచ్చగా వున్నాయి? పసుపు రాసుకున్నావా?" ఫ్లారెన్స్ మళ్లీ అడిగింది.

అప్రయత్నంగా పాదాలను చూసుకున్నాను...

క్రితం రోజు పేరంటం వెడితే పసుపు రాశారు...సబ్బుతో కడుక్కున్నా యింకా పసుపు ఛాయలు వున్నాయి...ఆ విషయం గమనించికూడా పచ్చగావుంటే బావుంటుందనే వూరుకున్నాను.

"ఆకుపచ్చ చెప్పులుకదూ! అంచేత పాదాలు మరింత అందంగా వున్నాయి!! అందంగా కనపడాలని, కనపడని శ్రద్ధ నువ్వు చాలా తీసుకుంటావు" అంది ఫ్లారెన్స్...

తలవంచి చిన్నగా నవ్వాను...

"అసలు పసుపూ, బొట్టూ అనేవి ఆచారాలుగా కాక, అలంకారాలుగా పరిగణిస్తే బాగుంటుంది."

ఫ్లారెన్స్‌కి ఆంధ్రుల అలంకరణ అంటే చాలా ఇష్టం...ఆంధ్రులు "ఆర్టిస్టిక్"గా వుంటారని ఆమె అభిప్రాయం...

కాదని ఎవరనగలరు?

"మీ పూజలూ, వ్రతాలూ అంటే నాకు చాలా సరదా!" అంటుంది...

అవ్వన్నీ మూఢనమ్మకాలని చాలామంది అంటున్నా, ఇతరులు వాటిని గురించి అడిగినప్పుడు గొప్పగా చెప్పడం నాకలవాటు.

నమ్మకాలసంగతెలా వున్నా పూజలన్నా ఉత్సవాలన్నా నాకు చాలా సరదా!

చిన్నప్పటినుండీ, నాలో వేళ్ళు పాతుకుపోయిన ఈ అభిరుచిని ఇప్పుడెలా పోగొట్టుకోగలను?

అందుకేనేమో ఎవరైనా పేరంటం పిలిస్తే సందేహించకుండా వెడతాను...

"చక్కని బట్టలు కట్టుకుని పేరంటం వెళ్ళి, తడిసివస్తే ఎంత బాగుంటుంది!!" అని వదినెతో అంటే,—

"ఆ తరవాత జ్వరంవచ్చి పడకపడితే, ఇంకా బావుంటుంది!" అంటుంది!

పేరంటంవెళ్ళి వస్తూంటే, త్రోవలో వానవస్తే చిత్రంగా వుండదూ?

దగ్గరో ఇవేమీ లేకపోతే ఏదైనా చెట్టు క్రింద నిలుచోవలసి వస్తుంది... చెట్టు కొమ్మలు గాలికి పరవశంగా కదులుతూ వుంటాయి...ఆకుల సందులనుంచి, ముత్యాల్లా వాన చినుకులు పడుతూ వుంటాయి...

ఆ చెట్టుక్రింద చేరిన పేరంటాళ్ల సంభాషణ కూడా చాలా గమ్మత్తుగా వుంటుంది...

"మొన్న శుక్రవారంనాడు కొదుటండీ!! వందరూపాయలు పోసికొన్నాను—ఈ చీర!! ఎలా తడిసిపోయిందో! పాడువాన ఇప్పుడే రావాలా?" అంటుంది ఒకావిడ!

"ఈ వెల్వెట్ జాకెట్టు మాత్రం! తడిస్తే ఎందుకైనా పనికొస్తుంది టండీ!" మరొకావిడ అందుకుంటుంది—

"అసలు వానొస్తుందని తెలిసీ అంత మంచి బట్టలు ఎందుకు వేసుకు రావాలీ అంట?"

"వానొస్తుందని కల గన్నానా ఏమిటి! నువ్వు మరీ విచిత్రంగా మాట్లాడతావు!! ఇంతకన్నా తక్కువ రకం బట్టలు నాకు లేవు!"

"ఎందుకు తడికావని మా వారు కొప్పడతారు కోమలా! ఎలా?" అంటుంది కొత్తగా పెళ్ళయిన ఒక యువతి!!!

"ఆ వానకి చెటు చూశావా ఎలా వూగిపోతున్నయ్యో!!"

"చాల్లే! నువ్వొక కవయిత్రిలాగా మాట్లాడకు!"

"ఇంతసేపు ఇక్కడే నిలుచుంటే...ఇక ఇంటికివెళ్ళి వంటెప్పుడంట చేసేది?" నేను మాత్రం చేతి రుమాలులో మూటగట్టిన శనగలు ఒకొక్కటి తింటూ మౌనంగా వింటాను...

వాన కురుస్తుంటే- వానలో గిరగిరా తిరగాలని వుండేది చిన్నప్పుడు...

బుద్ధిమంతురాలివలె చదువుకుంటున్న సీతాదేవిని వుసిగొల్పేదాన్ని...

ఆ అమ్మాయి వాళ్లమ్మ వుందో లేదో చూసివచ్చిగాని నాతో వానలోకి వచ్చేది కాదు.

ఒక్కగానొక్క కూతురుకదూ! వాళ్లమ్మకి ఎంత గారాబమో!

అఆలు దిద్దుకునే మొదలు మూడోఫారం వరకూ ఒకే బెంచిమీద కూర్చుని చదువుకున్నాం...

'టైఫాయిడ్'కి జుత్తు వూడిపోతే, 'బాబ్' చేసినటు వుండే నొక్కులజుత్తుతో సన్నగా, నాజూగ్గా వుండేది సీతాదేవి! జ్ఞాపకాల వీధుల్లో నిత్యసంచారి సీతాదేవి!! చిలిపితనం మూర్తీభవించినట్లుండే, ఆ సీతాదేవి, ఇప్పుడు నలుగురు పిల్లలకు మాతృదేవి. ఇప్పుడామెకు వాన చూసే తీరిక కూడా లేదేమో!

బాధ్యతలు ఎక్కువైపోతే, లోకం సంకు

# ★ శ్రావణమాసమూ, చంద్రకాంతలూ ★

చితమై పోతుందేమో ననిపిస్తుంది... అందుకే ఒక్కొక్కసారి భవిష్యత్తులోకి తొంగిచూస్తే భయంవేస్తుంది... కాని మరోసారి భవిష్యత్తును తియ్యగానూ, కన్నెల్లో మల్లెపందిరిలాగానూ ఊహించుకుంటే ఆ భయం క్రమంగా నిష్క్రమిస్తుంది. ఆకాశంలో హరివిల్లులాగ జీవితంలో రకరకాల అనుభూతులు!! అందుకే "జీవితం కూడా అందమైనదే సుమా!" అనిపిస్తుంది...

"వానవరిసి వెలిసే. ఎప్పుడో ఒక సారి వస్తుంది, హరివిల్లు! అలాగే జీవితంలో అందం" అంటాడన్నయ్య !!

జీవితంలో సౌందర్యం ఎప్పుడో ఒకసారి అతిథిలా వచ్చి వెళ్లిపోతుందని అన్నయ్య అభిప్రాయం!

అంత లోతుగా ఆలోచించటమంటే నా కెందుకో భయం!

ఇలా ఆలోచించి—ఒక అంతిమ నిర్ణయానికి రావటం—మిలమిల మెరిసే, (వినువీథిలో) తారని అందుకోవాలనుకోవటమే ననిపిస్తుంది....

ఏదిఏమైనా, ఎప్పుడూ చంద్రకాంతల మాలలల్లుతూ—వానలో తడుస్తూ, పేరంటాలకు వెడుతూవుంటే చాలా బాగుంటుందనే నా అభిప్రాయం....

"కరువులో ఎదురుచూసినట్లు, అలా ఎదురుచూస్తావేమిటే, వానకోసం?" అంటుంది అమ్మ-చిన్నగా నవ్వుతూ....

అలా అంటుందే కాని, "మా అమ్మాయికి వానొస్తే ఎంత ఇష్టమనుకున్నారూ!"



ఓ బొజ్జ గణపయ్యా నీ బంటు నేనయ్యా...!
—ఫోటో: ఎన్. రామకృష్ణ.]

అంటూ పొరుగింటి సరస్వతమ్మగారితో చెప్పటం నేను చాలాసార్లు విని విసుక్కోక పోలేదు.

వానంటే ఇష్టపడని వాళ్ళు అరుదేమో! తొలకరిజల్లులకోసం ఆకాశంవంక ఆశగా చూసే రైతుబిడ్డనైనప్పుడు నాకుమాత్రం 'వాన' అంటే ఇష్టం ఎందుకుండదూ?

"నీకు తెలీదుకానీ, పేరంటంనుంచి తెచ్చిన శనగలు వేయించితింటే ఎంత బావుంటాయో! తెలీనివాళ్లకి చెప్పినా దండుగ!!" అంటాడు మామయ్య....

మా అత్తయ్య బస్తీలో పుట్టి, బస్తీలో పెరిగి, బస్తీలోకి కాపరం వచ్చింది—.

ఆవిడ అదోరకంగా నవ్వి "స్టౌ" వెలిగిస్తుంది. వాటికోసం తహతహపడేనాలాంటి వాళ్ల సంగతి ఆవిడకేం తెలుసు!

ఆ మాటకొస్తే మామయ్య, 'ఫారిన్' వెళ్ళి రాలేదూ? అయితే మాత్రం శనగలు మర్చిపోయాడా?

ఈ శ్రావణమాసాలూ, ఈ చంద్రకాంత పూవులూ, ఈ వానజల్లులూ, తియ్యని అనుభవాలనిస్తాయి. హృదయఫలకంమీద రంగురంగుల చిత్రాలుగీస్తాయి!! నాగరికత నలుదిసలా శరవేగాన వ్యాపిస్తున్నా, వైజ్ఞానిక రంగంలో ఉజ్వలమైన మార్పులువస్తున్నా శ్రావణమాసం రాగానే గుంపు గుంపులుగా వీధులో మెరిసే పేరంటాళ్ళను చూస్తే మన కళారాధనా. అభిరుచీ, చెదరకుండావున్నాయనే అనిపిస్తుంది.

మనమంతా కోరుకునేది "పాత కొత్తల మేలికలయిక" గనుక ఈ పూజలు ఎప్పుడూ ఇలాగే వుంటే బావుండు ననిపిస్తుంది!

అందుకే శ్రావణమాసం కోసం, ప్రియ నిరీక్షణలాగ, నిరీక్షిస్తాను...

"వస్తున్నా! వస్తున్నా!!" అంటూ మురిపించి, మురిపించి, ఒక్కసారివచ్చే ప్రియస్నేహితురాలిలావస్తుంది శ్రావణం!

నెచ్చెలి ఇచ్చే ఆనందంలాగ శ్రావణమాసం, వెలలేని చంద్రకాంతలనూ, అంతకన్నా విలువైన ఆనందాన్నీ ఇస్తుంది.

నలుగురు వకచోట కూడటం, పల్లెటూళ్లలో సాధారణంగా పేరంటాలలోనే. ఇతర దేశస్థులవలె మనకు "పార్టీ"లు తక్కువ. పుట్టిన పండక్కి టీపార్టీ, "మారేజిడే"న డిన్నరూ — ఇలా మనకి విందులు చాలా తక్కువ!

అందుచేత నలుగురు ఆడవాళ్ళూ కలుసుకోవాలంటే, మనకి ఉపయోగపడేవి పేరంటాలే. దోసెడు శనగలు, నాలుగు తమలపాకులూ, యిచ్చే ఆనందం, ఏ విందులు, ఏ టీపార్టీలు ఇస్తాయి? నామటుకు నాకు దేముడిగుళ్ళో నూనె దీపాలె ఎలక్ట్రిక్ లైట్లకంటే ఎంతో బావుంటాయి. అంచేత మన దేశంలో మన సంప్రదాయ ప్రకారం జరిగే పేరంటాలే బావుంటాయి. ★

# బసవదేవుడు

సృష్టికార్యమెల్ల పూర్తి
చేసిన పిమ్మట బ్రహ్మ
బసవేశ్వరుఁ చేరబిలిచి
పలికె నిటుల సలలితముగ;

"అనుదినమభ్యంజనమ్ము
వారము వారము భోజన
మనుచు చెప్పిరమ్ము నరుల
దరికి వేగ నీవు పోయి."

బ్రహ్మదేవు ముదఁదాల్చి
బసవదేవు డరుదెంచెను
భువికి; కాని విధి చెప్పిన
చొప్పు మఱచి యిటుల పలికె:

"దినదినమాహారమ్మును
తీసికొనుచు, ప్రతివారము
తలస్నానము చేయవలయు
నరులారా! యింక మీరు."

ఇటుల చెప్పి బసవేశుడు
ఏగ నలువలోకమునకు;
వాణిపతికి తా జెప్పిన
కరణి నివేదించినాడు.

"ఎంతటి పొరపాటుచేసి
నావయ్యా బసవేశ్వర!
రోజూ భోజనము ఎటుల
లభ్యమగును మానవులకు?

భోజ్యపదార్థాలను పం
డించుటలో సాయపడుము
నరులకు నీ సంతతితో
ధరణి కిపుడె వెడలి నీవు.

మనుజుల కన్నుల ఎదుటే
మసలుచుండి యుండినచో
నీమీదను చూపుభక్తి
నీరసించబోదు వారికి."

అని విధాత బసవునితో
అనియెను శాసించినటుల.
'విధివిధాన' మనుకొనుచును
కదలె బసవు డచటినుండి.

అది మొదలుగ బసవడు, తా
భువివసించి, భూమి దున్ను
సంతతిగని మనుజాళికి
సాయము చేయుచునుండెను. ★

రాచాబత్తుల వీరరాఘవయ్య



# మహాదొడ్డ మనసిద్ధి



★ యం. యస్.

లోక కళ్యాణార్థం హిమవంతుని అనుంగు పుత్రియైన పార్వతిని కైలాసాధిపతి శివుడు పరిణయమాడాడు. హిమవంతుడు తన గారాబు పట్టియైన ఉమాదేవిని సకల భోగ భాగ్యాల నిచ్చి అత్తవారింటికి పంపుతూ జయ, విజయ అనే ఇరువురు చెలికత్తెలను కూడా అరణంగా యిచ్చి పంపించాడు. కంటికి రెప్పవలె తనబిడ్డను కాపాడాలని ఆ యిద్దరు చెలికత్తెల్ని హెచ్చరించాడు హిమవంతుడు. పార్వతి జగన్మాత అని తెలియక కాదు, కన్న మమకారం అట్లా అనిపించింది.

అత్తవారింటిలో అడుగుపెట్టిన పార్వతిని కంటికి రెప్పవలెనే చూసుకుంటున్నారు, జయ, విజయులు; ఒకనాటి యిష్టాగోష్ఠిలో జయవిజయు లిరువురు పార్వతితో "అక్కా' ద్వారమున నున్న కింకరు లందరు నీ భర్తయైన శంకరుని కనుసన్నల మెలగువారే కద. నీ ఆజ్ఞాను వర్తియై మెలంగు భటు డొక్కడును లేడు, అందుచే నీ సర్వశక్తిని వినియోగించి ఒక్క భటుని సృజించి ద్వారముకడ కాపుంచిన నిన్ను సర్వకాల సర్వావస్థలయందు సేవించుచు నీ కనుసన్నల మెలగుచుండును. మామాట కాదనకు' అని బోధించిరి.

ఆమాటలకు మందహాసాన్ని చిందిస్తూ మహేశ్వరునిఅర్ధాంగియైనఉమాదేవి తన ఆజ్ఞ నొకటియు! శంకరునియాజ్ఞ యొకటియునా అనిమనమున తలంచి చెలికత్తెల కోరికను గూర్చి 'అట్లే' అని పలికినది.

మరి కొన్నిరోజు లకొకనాడుపార్వతి తన మందిరమున స్నానము చేయుచుండగా పరమశివుడు మందిర ప్రాంగణమున నున్న నందీశ్వరుని గదిమి, సరాసరి లోని కేతెంచెను. పార్వతియు సిగ్గుపడెను. అప్పుడు పార్వతికి చెలికత్తెల మాట జ్ఞప్తికి వచ్చెను. తాను గీచినగీటు దాటక తన కనుసన్నల మెలగుచు, సర్వకాల సర్వావస్థలయందు తనకుమ్మముకడనుండుటకు భటుడొక డవసరమని తలంచెను.

ఒకనాడు అభ్యంగన స్నాన మాచరింప నుంకించి పార్వతికి వెనుకటి సంఘటన జ్ఞప్తికి వచ్చి సిగుపడి తనద్వారముకడ భటుడొక డుండవలెనని తలంచి తనమేని నలుగుపిండితో ఒకబాలుని సర్వలక్షణ సంపన్నునిగాను, సుందరాకారునిగాను తయారు చేసి, ప్రాణప్రతిష్ఠ చేసి, పట్టుపీతాంబరములను, సువర్ణమణిమయభూషణములను ఒసంగి అజేయుడవై చిరాయువు గమ్మని దీవించి "నేను నీ తల్లిని, నీవు నా బిడ్డవు. సర్వకాలసర్వావస్థలయందు నా యాజ్ఞ మీరక ప్రవర్తించి నా కోరికను గూర్పుము" న నా బాలుండును తల్లి పాదములకు నమస్కరించి 'నా కాజ్ఞ యేమని' వినయవిధేయుడై ప్రశ్నించెను.

బిడ్డని అక్కున కౌగిలించుకుని, తనివిదీర ముద్దాడి ఎల్లవేళల నాదు గృహద్వారంబున నుండి నా సెలవులేనిదే యెవ్వరిని లోనికి రానీయరాదని చెప్పి ఒక బంగారు బెత్తము నీయ నద్దానిని గ్రహించినల్లెయని నా బిడ్డడు తల్లివద్ద సెలవు గైకొని తల్లి ఆనతి ప్రకారము గుమ్మముకడ కావలి కాయుచుండెను. ఆ పిదప పార్వతి అభ్యంగనస్నాన మాచరింపబోయెను.

అదే సమయమున పరమశివుడు విలాసముగా పార్వతి మందిరమున కేతెంచెను. గుమ్మముకడనున్న బాలుడు శివు నడ్డగించి లోనికి వెళ్ళుటకు వీలులేదని అదలించెను.

బాలుని మాటల లెక్కగొనక లోని కేగు చున్న శివుని కడ్డముగా బాలుడువచ్చి చేత నున్న బంగారు బెత్తమును జాపుచు 'జాగ్రత్త' అడుగు ముందున కిడితివా...అని



టైప్ మెషిన్ సహాయంతో...

—చిత్రం:బి. వరలక్ష్మి, విజయనగరం.]

# వినాయకుడు వినాయకుడు!

ధైర్యముగా బలికెను.

ఆ మాటలకు ముక్కంటి 'అజ్ఞానుడవై న్నదలించుచు వెత్తమును జూపుచుంటివా' అని బాలుని మాటల సరకు గొనక ముందున కడుగిడబోవ నా బాలుడు రోషారుణ నేత్రుడై బంగారు బెత్తముతో నా పరమ శివుని మోదెను. శంకరుడా ఘాతములకు కడునొచ్చి వెనుకకు తిరిగినవాడై 'అహంకారమున కన్నుగానని నీ విప్పుడే తగిన ఫలమనుభవింపగలవని' కనుసన్న మాత్రమున ప్రమథగణముల నా బాలునిపైకి పంపెను.

ప్రమథులును బాలుని సమీపించి శివుని మహిమను వేనోళ్ళ పొగడుచు నాథుని నిజమందిరమున కరుగుచుండ వద్దగించుటకు

పురందరప్ప ☆

కాలమాసన్నమై నూతనముగా నిద్వారము కడ వెలసిన బాలుడవి వెవ్వడవని ప్రశ్నించిరి.

బాలుడును నగురు బెదురు లేక వీసమైనను చలింపక, 'నే నెవ్వడనైన మీకేమి? నాథుడు గానీ, సర్వసుర నాథుడు గానీ, జగన్నాథుడు గానీ, చివరకి ఉమానాథుడు గానీ, ఇప్పుడు నా తల్లి అనుజ్ఞ లేనిదే అడుగు లోనికి పెట్టుటకు వీలులేదని బింకముగా సమాధానము చెప్పెను.

అంత సామదానభేదోపాయముల ప్రయోగించి విఫలులై చివరకు ప్రమథులు దండనోపాయమున నుపక్రమించి ఒక్కుమ్మడి బాలునిపై బడిరి.

సర్వజగజ్జననియగు శాంకరి ముద్దుల బిడ్డడగు నా బాలుడు తల్లి దీవన ప్రభావమున సర్వబల సంపన్నుడై ప్రమథగణమున కందరికన్నిరూపులై అంతకీ మూర్తివోలె విజృంభించి, కొందరి మోకాళ్ళను మరికొందరి పిక్కలను, కొందరి తొడలను, మరికొందరి మూపులను విరుగగొట్టెను. అంతట తమ

నాథునకు శంభునికడ కుబోయి మొరపెట్టుకొనువట్లు వారిని తరిమికొట్టెను.

ప్రాణావశిష్టులై పారిపోయి వచ్చిన ప్రమథగణముల అసమర్థత కచ్చెరువొంది, చివరకు వాడెవ్వడో ఇటకేల వచ్చెనో కూడ తెలిసికొనలేని చేతగానితనమునకు చీవాట్లు పెటి శివుడు నంది కేశ్వరుని పిలిపించి చండీశ్వరాదుల నండగా నిచ్చి ఆ బాలుని బరిమార్ప బంపించెను.

తనపై దండెత్తి వచ్చుచున్న పరివారమును గాంచిన బాలుడు తన తల్లి తన కొసంగిన ఆజ్ఞను దలంచుకొనుచు వీరలీరీతి దండెత్తి వచ్చుటకు కారణమంతగా గానరాక

సందిగ్ధావస్థలోనుండ, గుమ్మముకడ కోలాహలము విని పరుగెత్తుకవచ్చిన గిరిజా ప్రియసఖి విజయ ఈ సంగతినంతను తెలిసికొని మనమున భీతిజెంది పరుగిడి పార్వతి కెరిగించెను.

పార్వతియు గోటితో పోవుదానికి గొడ్డలి వరకు తెచ్చిన శివుని పంతమునకు మనస్సున బాధజెంది తన ఆజ్ఞను శిరసావహించి మెలంగుచున్న బాలునిపై పగ సాధించుచున్న పరమేశ్వరునిపై కినుకబూని, తన పంతమేల నెగ్గదను పట్టుదలతో బాలునకు భయము లేదనియు, నీశక్తి ప్రయోగింప సమయ మరుదెంచెననియు విజయతో కబురంపెను. విజయ బాలుని సమీపించి 'పిపీలికాది బ్రహ్మపర్యంతము గల సృష్టికి జనని యగు భద్రకాళి అనుంగు బిడ్డడవైన నీకు భయమేల' నిన్నెదుర్కొన ఈ ప్రమథులెంతటివారు! లెమ్ము నీ శక్తిసామర్థ్యములు చూపింప సమయమేతెంచెనని ఉత్సాహపూరిత వాక్యముల హెచ్చరింప ఆబాలుడు కోపోద్రిక్త మానసుడై తొడ చరిచి పగతుర నెల్లరగాంచి

(46-వ పేజీ చూడండి)



చిత్ర రచన: 'ధనం'

# సుపుత్రుడు

అదొక చిన్న వూరు. ఆ వూరి వాళ్లంతా ఊరవతల వున్న చెరువులోంచే తాగడానికి నీళ్లు తీసుకుపోతూంటారు.

ఓరోజు ఓ ముగ్గురు ఇల్లాళ్లు నీళ్లు తీసుకుపోడానికని ఆ చెరువుకి వచ్చారు. వారు తమ బిందెల్ని తోముతూ తమ కొడుకుల గొప్పతనాలనుగురించి చెప్పుకుంటున్నారు. ఆ ముగ్గురిలో ఒకామె ఇలా చెప్పసాగింది:

"విన్నారా, అక్కలారా! నా కొడుకు గొప్పతనం? మన వూరి వాళ్లంతా నా కొడుక్కి పాండిత్యంలో గల నైపుణ్యాన్ని తెగపొగిడేస్తున్నారు. నిజంగాకూడా వాడిలాంటి పండితుడు మన వూరిలో ఎవరూ లేరంటే నమ్మండి. అలాంటి సుపుత్రుని కన్న నేను అదృష్టవంతురాలిని."

"ఇక నా కొడుకు గొప్పతనం కూడా కాస్త వినండి. వాడు ప్రఖ్యాత పహిల్వానౌతాడని మన వూరివాళ్లంతా అనుకుంటున్నారు. వాడు ప్రతిరోజూ రెండు వందల గుంజీలు తీస్తాడు. మొత్తంమీద వాడిలాంటి బలిష్టమైనవాడు మన వూరిలోనే లేడు. అలాంటిసుపుత్రుడి తల్లినైనందుకు నేనెంతో గర్విస్తున్నాను," అని చెప్పింది రెండో ఆవిడ.

కాని, మూడో ఇల్లాలుమాత్రం తన కొడుకు గొప్పతనమేమీ చెప్పక గప్‌చిప్‌న ఊరుకుంది. అప్పుడా ఇద్దరు ఇల్లాళ్లూ "నీ కొడుకు గొప్పతనంకూడా చెప్పు; విని సంతోషిస్తాం," అని హెచ్చరించారు మూడో యువతిని.

అప్పుడామె "అక్కలారా! నా కొడుకు మీకొడుకులకుమల్లే గొప్పవాడు కాడు. వాడి కెలాంటి పాండిత్యమూ లేదు. ఎలాంటి బలమూ లేదు. ప్రొద్దునే పొలానికి వెళ్లి వళ్లు వంచి పనిచేసి సాయంత్రం ఇంటికొస్తాడు. ఇంట్లో నాకు కష్టంగా ఉండే పనులని చేసిపెడుతూ, నాకు ఆసరాగా వుంటాడు. అంతకంటే మరేపనీ వాడికి రాదు" అని చెప్పింది తన కొడుకుని గూర్చి.

యం. యల్. పతి

అంతేలే! లేకుంటే నీ కొడుకు మా కొడుకులతో సమానమౌతాడా! అన్నట్లు చూశారు మొదటి ఇద్దరు యువతులు.

ఇక తమ బిందెల్ని తోముకోవడం పూర్తిచేసి నీళ్లు ముంచుకొని నెత్తిన ఎత్తుకొని నడవసాగారు. అప్పుడే పక్కవూళ్లో జరుగుతున్న తిరుణాలకి వెళ్లి వస్తున్న వారి ముగ్గురు కొడుకులూ చెరువు కట్ట మీంచి నడుస్తూ తమ తల్లుల్ని చూసి వెంటనే కట్టదిగి తమ తల్లుల దగ్గర కొచ్చారు.

అప్పుడు మొదటివాడు తన తల్లితో "అమ్మా! నేను తిరుణాలలో నా పాండిత్యపు గొప్పతనాన్ని చూపి, ఎందరో పండితుల్ని ఓడించి అందరిచేతా "సెబాస్!" అనిపించుకున్నాను. నేను త్వరగా వెళ్లి ఈ సంగతి నాన్నకి చెప్పాలి. నువ్వు త్వరగా రా," అంటూ గబగబా నడిచి వెళ్లిపోయాడు.

ఇక రెండోవాడు తన తల్లితో "అమ్మా, నేను తిరుణాలలో ఎంతో బలిష్టమైన పహిల్వాన్లని ఇట్టే ఓడించి, ప్రేక్షకులచేత గొప్ప పహిల్వాను ననిపించుకున్నాను. ఈ సంగతి నాన్నకి చెప్పాలి. నేను వెళ్తున్నా" అంటూ వెళ్లిపోయాడు.

కాని మూడోవాడు తన తల్లి దగ్గరికొచ్చి "అమ్మా! నేనుండగా కూడా నువ్వే ఇంతదూరం వచ్చి నీళ్లు తీసుకుపోవాలా! ఎందుకమ్మా నీకింత శ్రమ. అబిందె ఇలా ఇయ్యి" అని తన తల్లి తలమీది బిందెని తీసుకొని తాను ఎత్తుకున్నాడు.

ఇదంతా చెరువుగట్టుమీద కూర్చొని ఉన్న ఓ వృద్ధుడు గమనిస్తూనే ఉన్నాడు. అప్పుడా ముగ్గురూ తమ సంగతంతా గమనిస్తున్న ఆ వృద్ధుడి దగ్గరికెళ్లి "మా పుత్రుల్లో ఎవరు సుపుత్రుడో చెప్పండి?" అని అడిగారు.

ఆ వృద్ధుడిలా అన్నాడు: మీ ఇద్దరి పుత్రులూ చెరో విద్యలో ప్రవీణులు. అయినా, వాళ్లు స్వార్థపరులు. తమ గొప్పతనాన్ని చూసే మురిసిపోతారు. కాని తమని కని పెంచిన తలిదండ్రుల కష్టసుఖాలను ఏమాత్రం చూడరు. కాని ఈమె పుత్రుడు ఏ విద్యలో ప్రవీణుడు కాకపోయినా, తన తలిదండ్రుల కష్టాలని చూడలేక ఆదుకుంటాడు. కావున ఈ మెపుత్రుడే "సుపుత్రుడు."

ఆ వృద్ధుడి మాటలు విన్న మొదటి ఇద్దరికీ ముందు కోపమే వచ్చినా, తర్వాత అసలు విషయాన్ని గ్రహించి నిజంగా మూడో

ఆవిడ కొడుకే నిజమైన "సుపుత్రుడ"నీ తమ కొడుకులు స్వార్థపరులనీ ఊహించుకోగలిగారు. ★

# గురుభక్తి

క్రొవ్వి రామమోహనశాస్త్రి

చాలా ఏళ్ళ క్రిందట ఒకానొక అరణ్యంలో ధౌమ్యుడనే మునీశ్వరుడు తపస్సు చేసుకుంటూ వుండేవాడు. ఆయనకు రాని విద్య లేదు. ఆయనవద్ద గల శక్తులు అద్భుతాలు. భగవానుని తేజస్సు ఆయన ముఖకమలంలోంచి తొంగి చూస్తూంటుంది. సమీప పట్నాల నుంచి అనేకమంది బాలురు ఆయనకు శిష్యరికం చేసి తరించాలనే వాంఛతో వస్తూ వుండేవారు. అలా వచ్చిన వారిని ధౌమ్యుడు అనేక విధాలుగా పరీక్షించి, పరీక్షలో నెగ్గిన వారిని మాత్రమే తన శిష్యకోటిలో చేర్చుకొంటూ వుండేవాడు.

ఒకసారి ధౌమ్యుడి వద్దకు ఉపమన్యుడనే బాలుడు వచ్చాడు. ఆయన పాదాలకు నమస్కరించి, పాదధూళిని శిరస్సున ధరించాడు. ఆ తరువాత చేతులు జోడించి, "స్వామీ! నన్ను కూడా తమ శిష్యకోటిలో ఒకణ్ణిగా చేసుకొని, నాకు విద్యాగంధాన్ని ప్రసాదించండి," అని ప్రార్థించాడు, ఉపమన్యుడు.

ధౌమ్యుడు అతని వినయ విధేయతలకూ, భక్తికీ ఎంతో సంతోషించాడు. కాని అంతమాత్రానికే అతనిని శిష్యుడిగా స్వీకరించటం ఆయన అభిమతంగాదు. ఇంకా కొంత పరీక్ష చేస్తేనే గాని, అతని గుణ గణాలు బయటపడవని తలచి, "నాయనా! నా ఆజ్ఞలకు - అవి ఎలాంటివైనా సరే-బద్ధుడవు కావాలి. ఒక్కొక్కసారి నా ఆజ్ఞలు చాలా కఠినంగా వుంటాయి. విసుగూ విరామం లేకండా నా మాటను పాటించి తీరాలి. అటుపైన నాకు మనసు కలిగితేనే నేను నిన్ను శిష్యుడిగా స్వీకరిస్తాను. తెలిసిందా?" అన్నాడు.

ఉపమన్యు డందుకు ఆనందంగా అంగీకరించాడు. ఆరోజే ధౌమ్యుడు, ఉపమన్యుణ్ణి ఆశ్రమ ధేనువులకు కాపరిగా నియమించాడు. ఉపమన్యుడు ప్రతిదినమూ చీకటితో లేచేవాడు. కాలకృత్యాలు తీర్చుకొని పక్కవూరికి వెళ్ళి మధూకరమెత్తుకొని, లభించిన దానితో పొట్ట నింపుకుని తిరిగివచ్చి గోవులను తోలుకుపోయేవాడు. ఇదీ అతని దినచర్య.

ఒకరోజు సాయంసమయాన ఉపమన్యుడు గోవులను ఆశ్రమానికి




అభయ గణపతి

—చిత్రకారుడు: నేతులూరి లక్ష్మయ్య]

# ★ గురుభక్తి ★

తోలుకు రాగానే, ధౌమ్యుడతనిని చూసి, "నాయనా! నీవు మధూకరం ఎత్తుకుని కడుపు నింపుకుంటున్నా వని తెలిసింది. ఇది మంచి పనికాదు. పోగా, పాపంకూడాను. ఇటుపైన ఈ పాపం చెయ్యకు," అని చెప్పాడు.

ఉపమన్యుడు ఆ క్షణం నుంచే మధూకరం ఎత్తుకోనని మనస్సులోనే ప్రతిన చేసుకున్నాడు, ఐతే, పొట్టగడవట మెలాగ? అతనికి ఒక ఆలోచన తట్టింది. ఆవులను మేతకు తోలుకుపోయినప్పుడు ఏదో ఒక ఆవుపాలు త్రాగి ఆకలిబాధ తీర్చుకో సాగాడు.

మరలా ఒకరోజున ధౌమ్యుడు ఉపమన్యుడి ఉద్దేశించి, "బిడ్డా! నీవు ప్రతిదినమూ ఆశ్రమ ధేనువుల పాలు త్రాగి క్షుద్బాధ తీర్చుకుంటున్నా వని తెలిసింది. ఆ ఆవులపాలు వాటి బిడ్డలవంతు అన్న విషయం మరిచి పోకు. వాటి వంతు హరించేందుకు ప్రయత్నించడం పాపహేతువు. ఇం కెప్పుడూ ఇలాగ చెయ్యటానికి పూనుకోకు," అని పలికాడు.

ఉపమన్యుడు ఇకమీదట ఆవుపాలు త్రాగనని మనస్సులోనే ప్రతిజ్ఞ తీసుకొని అరణ్యంలోని గడ్డి-గాదమూ తింటూ రోజు లెలాగో గడుపుతున్నాడు.

మళ్ళీ ఒక రోజు ధౌమ్యుడు, "నాయనా! నీవు రోజూ అడవిలో గడ్డి తిని ఆకలిబాధ తీర్చుకుంటున్నా వని తెలుస్తోంది. ఆగడ్డి పశువుల సొత్తు; వాటి సొత్తు అపహరించే అధికారం నీ కెవరిచ్చారు?" అని ఉపమన్యుడ్ని మందలించాడు.

ఉపమన్యుడేం చేస్తాడు? ఏం తింటాడు?

గత్యంతరంలేక, అతను ఉపోషాలు చెయ్యసాగేడు. కాని ఎంత కాలమని చెయ్యగలడు? అంతకంతకు అధికమాతున్న ఆకలిబాధ సహించలేకపోయాడు. వెంటనే సమీపంలో వున్న జిల్లేడు చెట్టు వద్దకు వెళ్లి కాస్సేపు దానివేపు పరీక్షగా చూశాడు.

జిల్లేడాకులను పశువులు తినగా తనెన్నడూ చూడలేదు మరి. ఇందుకు కారణం ఈ ఆకులు బహుశ పశువుల కాహారమై వుండవు. అవును, అంతే అయివుంటుంది. కనుక నేను ఈ ఆకులు తిని ఆకలి బాధ తీర్చుకుంటాను. అనుకుంటూ గబ-గబ ఆకులు కోసి తిన్నాడు.

మరి కాస్సేపటిలో జిల్లేడాకులు ఉపమన్యునిపై బాగా పని చేశాయి. అతను అంధుడైపోయాడు. కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తూ, తడుముకుంటూ, తడుముకుంటూ ఆశ్రమంకేసి పోతూ వుండగా ఒక పాడుబడిన బావిలో పడిపోయాడు. ఇక్కడ ఉపమన్యుడు బావిలో పడగానే, అక్కడ ఆశ్రమంలో ధ్యాన నిమగ్నుడై వున్న ధౌమ్యుడి శరీరం ఒక్కసారిగా కంపించిపోయింది. ఇలా జరగడానికి హేతువేమిటో తెలుసుకుందామని తన దివ్యనేత్రంలో చూసుకొన్నాడు. వెంటనే పాటుబడిన నూతిలో బాధపడుతున్న ఉపమన్యుడు ఆయన కళ్లముందు కదిలాడు, ధౌమ్యుడు, ఉపమన్యుని గురుభక్తికి మెచ్చుకున్నాడు. ఆ క్షణమే ఆయన పాడుబడిన ఆ బావి వద్దకు వెళ్ళి నూతిలోంచి ఉపమన్యు బైటికి తీశాడు. ఉపమన్యుడు ధౌమ్యుని పాదాల మీద వ్రాలిపోయాడు. ధౌమ్యుడతనిని లేవనెత్తి, స్వస్థుడవు కమ్మని దీవించాడు. ఉపమన్యునికి ఆయన ఆశీర్వాద బలంవల్ల దృష్టి వచ్చింది. ఆ తరువాత అతడు ధౌమ్యుని శిష్యకోటిలో ఒకడై నిరుపమానమైన గురుభక్తిని ప్రదర్శించి సకల విద్యలూ నేర్చుకొని మహా పండితుడై చిరకీర్తి నార్జించాడు. ★

## ఊహాశక్తి

సైకిల్ మీద పోతున్న ఒక సుబ్బారావు దారేపోతున్న ఒకాయన్ని చూసి ఆగి "మేష్టారూ! టైమెంతయిందండీ" అని ప్రశ్నించాడు.

"నేను మేష్టరునని నీకెలా తెలుసు?" అని ఆయన కోపంగా అడిగాడు.

"అబ్బే ఊరికే ఊహించానండీ!" అన్నాడు సుబ్బారావు.

"అయితే టైము కూడా ఊహించు", అని మేష్టారు తన దారిన తాను పోయాడు.

# నానని నువ్వుగింజ

★ మధునాపంతుల గౌరీదేవి ★

చీకటి పడింది. తాతయ్య భోజనం చేసి వసారాలో తన పక్క మీద చుట్టకాల్చుకుంటూ కూర్చున్నాడు.

"తాతయ్యా" అంటూ చక్కా వచ్చింది పదకొండేళ్ళ మనవరాలు సీత.

"ఏం?" అన్నాడు.

"మంచి కథ చెప్పాలి"

"ఏం కథ చెప్పనూ?"

జ్ఞాపకం తెచ్చుకుంది సీత. "తాతయ్యా నాన్న ఇవ్వేళ అమ్మని కేకలేశాడు—ఆడవాళ్ల నోట్లో నువ్వుగింజ నానదు అని. ఆ విషయం నీతో చెప్పడం నాదే తప్పు" అని, ఆగింది.

"మరి ఆడవాళ్ల నోట్లో నువ్వుగింజ నిజంగా నానదా?" అని అమాయకంగా ప్రశ్నించింది.

"ఓ! అదా నీ సందేహం?" అని "ఇలారా. కూర్చో ఆకథ చెబుతాను" అన్నాడు

సీత ఉత్సాహంగా కూర్చుంది.

"నువ్వుగింజ నానడం అంటే నిజంగా అదికాదు. ఆడవారికి తెలిసిన విషయం ఏదీ పదిమందికీ చెబితే కాని వాళ్లకి తోచదు. ఒక్క నిముషం కూడా ఊరుకోరు పక్కవాళ్లకి చెప్పకుండా. అందుకనే రహస్య విషయాలు ఆడవారికి చెప్పరు. ఎందుకంటే దీనికో కథ ఉంది."

"ఏమిటదీ?" అంది మధ్యగా అందుకుని.

చుట్టకొడి దులిపి అందుకున్నాడు తాతయ్య.

"ఒకప్పుడు ధర్మరాజు శపించాడు ఆడవారి దగ్గర రహస్యం ఉండకూడదని. అప్పటినుండీ ఆడవాళ్లేవిషయమైనా దాచుకోరు."

"ఊహూం..." అంది సీత కళ్ళు తిప్పుతూ.

"భారతంలో ధర్మరాజు నెరుగుదువా?"

"ఎరుగుదును—"

"అతని తల్లి కుంతీదేవి."

"ఔను"

"ఆమెకి మొట్టమొదట సూర్యానుగ్రహంవల్ల కలిగిన కుమారుడు—"

"కర్ణుడు," అంది గబుక్కున.

"మహాభారత యుద్ధానికి ముందర, కుంతి తన పెద్ద కొడుకైన కర్ణుడి దగ్గరకి వెళ్ళింది. కుంతి అతన్ని బ్రతిమిలాడింది. "నువ్వు నాకొడుకువే... అందరికన్నా పెద్దవాడవు. నువ్వు వస్తే, ధర్మరాజు సర్వాధికారాలునీకిచ్చి నిన్ను పూజిస్తాడు... నువ్వెలా చెబితే అలావింటారు నీ తమ్ముళ్లైదుగురూను. నువ్వివతలకి వచ్చేస్తే యుద్ధ ముండదు. నిన్ను చూసుకునే దుర్యోధనుడుయుద్ధానికి కాలు దువ్వుతున్నాడు. నేను తల్లిని కనకనామాట కాస్త విను. వచ్చెయ్యి నాయనా!" అంది కుంతికన్నీరొత్తుకుంటూ.

"అప్పుడేమన్నాడు తాతయ్యా, కర్ణుడు?" అని అడిగింది సీత.

తాతయ్యగొంతు సవరించుకొని ప్రారంభించాడు:

"అమ్మా నన్ను క్షమించాలి—ఎప్పుడైతే లోకనిందకి వెరచి నన్ను గంగలో వదిలివేశావో, అప్పుడే నీకూ నాకూ ఋణం తీరిపోయింది. నీకూ నాకూ సంబంధంలేదు. అదీకాక, చిన్నప్పటినుండీ కన్నకొడుకు కంటే ఎక్కుడుగా ప్రేమించి పెంచింది రాధమ్మ నన్ను. దుర్యోధనుడు నాకు చెలికాడు. ఆనాడు అస్త్రవిద్యా ప్రదర్శనం నాడే నా కతను రాజ్యాన్నిచ్చి నా గౌరవాన్ని కాపాడేడు. అదీకాక అతను నా మీదే ఆశలన్నీ పెట్టుకున్నాడు. రాజ్యం ఇచ్చాడు, రాజుని చేశాడు. అతను నాకు ప్రభువు. ఇప్పుడతన్ని వదిలి నీ దగ్గర కొచ్చానంటే, స్వామిద్రోహం కాదా? స్వామిద్రోహంవల్ల ఎంతపాపం చుట్టుకుంటుందో నీకూ తెలుసును. కనక—అమ్మా నన్నురమ్మనకు. యుద్ధం తప్పదు. అర్జునుణ్ణి మినహా ఇంకెవర్నీ చేజిక్కినా చంపను. ఎలాగయినా నీకైదుగురే కొడుకులౌతారు. లేదా నేనర్జునుడి చేతులో చచ్చిపోతాను. బెంగపెట్టుకోకు. కాని, అమ్మా నాకొక్క మాటివ్వాలి," అన్నాడు

"ఏమిటది నాయనా?" అని అడిగింది నిరుత్సాహంగా.

"నేను నీ కొడుకునని మాత్రం ఎప్పుడూ ధర్మరాజుకి చెప్పవద్దు, యుద్ధం ముందర. అలా చేస్తే, ధర్మరాజు యుద్ధం చెయ్యడు. నాకే వదిలివేస్తాడు. కనక

(59 వ పేజీ చూడండి)

# రావణ నీతి

మూలం ..... సుధామజుందార్

అనువాదం .... శ్రీనివాస్



"రావణుడు రాక్షసప్రవృత్తి గల వాడైనప్పటికి గొప్ప శివ భక్తుడు. ప్రస్తుతం అతను గాయపడి యుద్ధభూమిలో పడి ఉన్నాడు. అతడు చనిపోయేలోగా నేనొకసారి అతన్ని చూడాలి" అని తలచి రాముడు లక్ష్మణుని పిల్చాడు.

"నే చెప్పేది జాగ్రత్తగా వినాలి లక్ష్మణా! మనం రాజకులంలో జన్మించినప్పటికి రాజవిద్యను మన తండ్రివద్ద నేర్చుకునే అవకాశం లభించలేదు. మనం చిన్నతనంలోనే తాటకిని సంహారించటానికి అడవులకు వెళ్ళాల్సిరావడం, తరవాత వివాహం జరగటం, మనకు రాజవిద్య నేర్చుకోవాలని కుతూహలం ఉన్నప్పటికి విధి ప్రతికూలించడంవల్ల తండ్రి కోరిక మీద అడవులకు రావడం జరిగింది. ఈ పధ్నాల్గు సంవత్సరాలు మనం అరణ్యజీవితం గడిపాము. తర్వాత రావణసురునితో మనకు యుద్ధం రావటం అతడు ప్రస్తుతం గాయపడి ఉండటం నీకు తెలుసు. మనం యింక కొద్దికాలంలో అయోధ్యకు వెళ్ళబోతున్నాం. కోసల ప్రజలు మనకు అయోధ్యలో పరిపాలనాభారాన్ని అప్పజెబుతారు. మనకు రాజ్యాంగనిర్వహణలో అనుభవం అసలు లేదు. అందువల్ల పరిపాలనలో అవకతవకలు బయల్దేరి అసమర్థులమనే పేరు రావచ్చు. ఇప్పుడు మనం ఎవర్ని ఏమని అడిగేటట్లు? ఇది మంచి, ఇది చెడ్డ అనేది మనకు చెప్పేదెవరు? రావణుడు అతి దుర్మార్గుడైనప్పటికి రాజ్యాంగ నిర్వహణలో సిద్ధహస్తుడు. అతడు ఆ విషయంలో ప్రజల మన్నన పొందాడు. అతడు యింక కొద్ది ఘడియలలో జీవితం ముగించబోతున్నాడు. కాబట్టి నీవు తక్షణం బయల్దేరి అతని దగ్గరకు వెళ్ళి నేనిచ్చే ఈ ప్రశ్నలడిగి వానికి సమాధానాలు తెలుసుకుని రావాలి. అది మనకు ముందు ముందు చాలా ఉపయోగపడుతుంది. మంచి ఎక్కడ ఉన్నప్పటికి గ్రహించవచ్చు - అన్నారు మన పెద్దలు," అని రాముడు అన్నాడు.

బ్రహ్మాస్త్రంతో గాయపడి మరణోన్ముఖుడై యున్న రావణుని దగ్గరికి లక్ష్మణుడు బయల్దేరాడు. లక్ష్మణుని చూడగానే రావణుడు పశ్చాత్తాపంతో ఇలా అన్నాడు:

"లక్ష్మణా! నేను రాక్షసప్రవృత్తితో అనేక దుష్కార్యాలు జేశాను. నా జీవితం యిక కొన్ని ఘడియలలో ముగియబోతున్నది. నన్ను క్షమించు. ఈ చివరి ఘడియలలో నా మనస్సుకు శాంతిని చేకూర్చు".

"రావణా! ఇప్పుడు నిన్ను నీవు నిందించుకోవాల్సిన అవసరం లేదు. నీవు తప్పులు చేసినందుకు బలీయమైన విధి నిన్ను శిక్షించింది. ఈనాడు నీ మిగిలియున్న పాపాన్ని నీ పశ్చాత్తాపం కడిగివేస్తోంది. నీవు విజ్ఞుడవు. అలాంటివాడివి నీవే యిలా బాధపడితే లాభం లేదు. జరగబోయేదాన్ని, ధైర్యంతో ఎదుర్కోటానికి సిద్ధపడు. మరో విషయం. రాజ్యపాలన విషయంలో కొన్ని విషయాలు నీవద్ద తెలుసుకు రమ్మని శ్రీరాముడు నన్ను

సీ దగ్గరికి పంపించాడు. - అన్నాడు లక్ష్మణుడు.

"శ్రీరాముడికి తెలియని దేమున్నది? ఆ మహానుభావుడికి నేను చెప్పాల్సినవాణ్ణా! అయినా శ్రీరాముడు ఆజ్ఞాపిస్తే నాకు తెలిసిన అల్ప విషయాలు అతని పాదాలముందుంచుతాను. నేను కదలలేకుండా ఉన్నాను. నా జీవితం చివరి ఘడియలు సమీపించబోతున్నాయి. ఒక్కసారి శ్రీరాముని సందర్శించి వారి యెదటనే......—అబ్బా! బాధ"! అంటూ రావణుడు మూల్గాడు. అతని భావాన్ని అర్థం చేసికొని లక్ష్మణుడు శ్రీరాముని దగ్గరకు వచ్చి:

"అన్నా! రావణుడు పశ్చాత్తాపంతో బాధపడుతున్నాడు. అయితే నీతోనే ఆ రాజ్యాంగవిషయాలు మాట్లాడాలని ఉందనే భావాన్ని వ్యక్తపరిచాడు. అతడు నిన్ను చూడాలని వాంఛిస్తున్నాడు," అని చెప్పగానే సరే నని శ్రీరాముడు రావణుని దగ్గరకు బయల్దేరాడు.

రావణుడు కాళ్లు చేతులు తెగి వాటివల్ల కల్గే బాధతో మూల్గుతూ పడున్నాడు. అతని సేన అంతా నిశ్శేషమైపోయింది. ఓదార్చే దిక్కు లేక చూచేవాళ్లు లేక అంత లంకాధిపతి అనాథుడై పడున్నాడు. అతను రాముని చూచిందే తడవుగా మనస్సులోనే నమస్కారం పెట్టుకున్నాడు. అతని స్వరం క్షణక్షణానికి క్షీణించి పోతున్నది. "భగవంతుడే మానవరూపంలో ఉద్భవించాడు," అనుకున్నాడు. "శ్రీరామా! నీ మహిమ, మంచితనం అర్థం చేసుకునేందుకు నాలాంటి నీచ రాక్షసుని తరంగాదు. పవిత్రమైన బ్రహ్మవంశంలో పుట్టినా రాక్షసప్రవృత్తి వల్ల ఇది తప్పు, ఇది మంచి అని అర్థం చేసుకోలేక అనేక దుష్కా-

(45- వ పేజీ చూడండి)



# వ్యాక్ష్యేయం

## కందుకూరి లింగరాజు

ఒక్కొక్కసారి సుందరామయ్య మనసుని గజిబిజి అయిపోయి, బాధపెట్టేది. దాంతో పరిసరాలు, పరివారాలు, అంతస్తులు, గౌరవంకూడా ఓటికుండవతుగా కనపడి, "నీ జీవితంఅంతా ఎందుకూ కొరగానిదే అయిపోయింది కదా!" అన్న కుమిలింపు కల్గేది. 'నెలకు దరిదాపు మూడువందల రూపాయిల జీతం, ఇంట్లో నౌకర్లు, బయట ప్రజల నమస్కారాలు, వూళ్లో పలుకుబడి, ఆఫీసులో అదమాయింపుపడే ముప్పైమంది భృత్యులూ ఉన్నా "నువ్వుమాత్రం ఒక్కడివిగానే, వెంకాయమ్మతప్ప, మరొకరు లేనే లేరని" టొకాయింపూ కల్గేది. అల్లాడిపోయేవాడు.

అలా వూహలు అల్లుకున్నప్పుడు సాలిగూడులోపడ్డ ఈగలిబ్బంలా చెవుల్లో హోరు, హృదయస్పందనం వెల్లువలే అయిపోయి చికాకు, దుఃఖం కలేవి.

దాంతో వెంకాయమ్మమీద కోపం వచ్చేది. మొదట పెళ్ళిచూపులకు వెళ్ళినపుడు, వాళ్ళతాతగార్కి నల్గురు సంతానం, ముత్తాతగారికి కుచేలసంతతి, ఈమెకు ఇద్దరు అన్నగార్లు, మరో ఇద్దరు చిన్నవాళ్ళు ఉండడం, వంశగౌరవాలు మోతాదుగా చెప్పకోవడంతో, మొగ్గేడు. క్షణంసేపు. అప్పుడు ఏవో ఏవో ఆశలు, కలలూ, తనవంశం నిలబడడంకూర్చి కన్నాడు. వాట్లమీద ద్రాక్షతీగల్ని అల్లుకున్నాడు.

పదేళ్ళుదాటిన సంసారంలో, అటు ఉద్యోగంలో గబగబా మెట్లుఎక్కినా ఇటు వెంకాయమ్మమాత్రం మొరడులా వుండి, ఆ ద్రాక్షతీగల్ని త్రెంపివెయ్యడానికి సిద్ధపడ్డది అన్న భావనలోకి తీసుకువెళ్ళడం ప్రంగతీసేసింది. దాంతో నిరాశ, కోపం, దుఃఖం కలేవి.

ఇన్నాళ్ళూ, మొదట్లో ఏ రెండుమూడు సంవత్సరాలో చిలకా గోరింకల్లా ఇద్దరం వున్నామన్న భావనతో సరిపెట్టుకున్నా, తోటివాళ్ళు మొదటి సంవత్సరం అయ్యేసరికే, పాలడబ్బాలకోసం పరిగెత్తుతూ 'నువ్వు చాలా అదృష్టవంతుడివోయ్' అని భుజాలుతట్టి మెట్లు ఎక్కించడం ఓ విధంగా ఈ పాశ్చాత్య విద్యాప్రగతి చాటింపించి తృప్తిపరచినా, ఏళ్లు మూడులోంచి నాలు, ఐదు, ఆరు,పది అవడంతో, ఏ అగాధాల్లోకో అణగ్రదొక్క వేయపడుతున్నానన్న కుమిలింపు కలింది. దీనికితోడు అగ్నికిఆజ్యంలా అటు అత్తగారు, సంవత్సరంలో వెంకాయమ్మను తనదగ్గర వుంచుకున్న మూడు ముప్పైళ్లోనూ కూడా, దేవతలు, దేవుళ్ళు, ఉపోషాలు, పూజలు, పునస్కారాలు, మిషన్ ఆస్పత్రులు, ప్రభుత్వ వైద్యులు, హోమోపతీమాత్రలు, కరక్కాయ రసాలు, హకీముల సలహాలు, వరసపెట్టి ఎన్ని వున్నాయో అన్నీ దాని నెత్తిమీద రుద్దడం, 'గుణం కన్పిస్తోందన్న' ఆశలో ఉయ్యాలలూగడంతో సమాప్తి అయ్యేవి. క్షణం అలా వినడంతో మనస్సుకు ఉత్తేజం కల్గినా, కాగితాలు తారీఖులవెంబడి చిరగడంతో మళ్ళీ దిగ్భ్రాంత అయ్యేది.

పైగా ఉన్నవాళ్ళు, ఉన్నట్లు వుండకుండా, తల్లి "పెద్దవాళ్ళమైపోతున్నాం" నీ కడుపునకూడా ఒక్క కాయకాస్తే... చూడాలన్న బెంగేరా" అని తను ఏ సెలవులకో వెళ్ళినప్పుడు అనడం, తలక్రిందు చేసేసేది.

వీటన్నిటికి, ఎంత కర్మవిధానంలో తను తృప్తి పడదామనుకున్నా, శాంతికం అగలేదు. వణికిపోయింది. నిస్పృహతో నిండిన్నీ పోయింది.

అప్పుడప్పుడు ఏదో స్నేహరీత్యా వచ్చినవాళ్ళు, కాలు పెట్టీ పెట్టడంతోనే "ఎంతమంది పిల్లలు?" అని అనడం, ఏ లక్షవత్తుల వ్రతంలాగో మననం అవడంతో అంతమయ్యేది.

అల్లాంటప్పుడు మాత్రం "ఇద్దరూ!" అనేవాడు సుందరామయ్య.

"ఐ. జి. వా? ఓ. యస్సా?"

"ఇరొకటన్నీ"

"అదృష్టవంతుడివోయ్!" అనేవారు.

తీరా వాళ్ళు నిలబెట్టి. వాళ్ళేరీ? అన్న ప్రశ్నకు తావివ్వకుండానే కలహూరగంప అయ్యేవాడు. గత్యాగత్యా ఒక్కొక్క పెంకిఘటం నిలదీసేసే, తన్ని ఐ. జి. గాను, వెంకాయమ్మను ఓ. యస్. గాను, పుత్ర పుత్రికా విభేదాల్తో చూపించి, ముఖం మీద నీళ్ళుకొట్టే పర్యంతం చేసి వాణ్ణి పంపేవాడు.

పదులుకోలేని ఆశ, ఆశ పెట్టుకో నక్కర్లేదన్న కుమిలింపుల్లో, "ఇంక మనం ఎవణ్ణో ఒకణ్ణి దగ్గరగా చేరతీసుకోవడం యుక్తమేమో!" అన్న నిర్దుష్ట నిర్ణయానికి వచ్చేసిన సమయాలు లేకపోలేదు సుందరామయ్యకు. అయినా అదిమాత్రం పైకి కక్కకుండానే లోపల్లోపలే మింగుకున్నాడు. అది పైకిరాలేక, లోపలికి వెళ్ళక ఉన్న తెమడులాగే వుండిపోయింది.

ఆ పుట్టింటికి వెళ్ళిన వెంకాయమ్మ, 'ఇవ్వాళరాత్రి ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్నా' నన్న టెలిగ్రాంతో వెంట ఆరేళ్ళు నిండి ఏడో ఏడులో పడ్డ అమ్మాయితో దిగడం ఆశ్చర్యపర్చింది. కాసేపు 'వడిలోసహా' అన్నట్లుగా, వున్న మూడు నెలల్లోనూ ఏ శేళ్ళ పిలనీ కనేసిందా ఏమిటి కొంపతీసి' అన్న భావన మెరుపయ్యింది.

కళ్ళన్నీ తెల్లబోయి ఓసారి సామాను దించడం తర్వాతనే, పిల్లను అందుకుంటూ, వెంకాయమ్మవపు చూచేడు.

వసంతంలా నవ్వుతూ, "ఆనమాలు కట్టలేదూ! అది మా..." అంటూ ఏదో ప్రవర ఏకరువుపెట్టి "అమ్మాయి. కొన్నాళ్ళు మనదగ్గర వుంచుకుందాం అని తీసుకువచ్చే" అని రహస్యంగా అనేసింది. పైగా దిగుతున్నప్పుడే రైల్లో సహపాఠీలుగావున్న ఓ నలభైఏళ్ళ ఆవిడ,—

"ఆయనేనా మీవారు?" అంది.

తలూపింది, ఓ ఆఫీసరుగారి పెళ్ళాం హుందాలోను, స్వరాజ్యంలో అడుగుపెట్టేమన్న ధైర్యంలోనూ.

"ఎంత ముద్దుగా వున్నారో వాళ్ళూ, ఆ అమ్మాయినూ" అనేసింది ప్రక్కనున్న ఇరవై సంవత్సరాల క్రొత్తకోడలో కూతురోనో.

బిక్కపోయేడు. దాంతో వెనువెంటనే 'మా ఆవిడ రైల్లో బహుశః ఆ అమ్మాయి మా అమ్మాయే' అని బడాయి చెప్పకుని వుంటుంది అన్న నిర్ణయమూకల్గింది.

రైలు కదులుతున్నప్పుడే "ఎప్పుడేనా హైద్రాబాదువస్తే మా ఇంటికి మీరూ అమ్మాయీ తప్పకుండా రాండే, చిక్కడపల్లి కోవిలదగ్గరే మా ఇల్లు," అని ఆవిడ ఆహ్వానం పంపేసింది.

'చూచేరా నా ప్రతిభ' అన్నట్లు శరీరాన్ని ఓసారి పెంచి, కుంచుతూనే "మీరు ఆఫీసుకు, సర్కిట్లకు వెళుతూవుంటూనే వుంటారు. ఇంట్లో నాకుతోడు ఎవరూ లేనే లేరు. శారదతో కాస్త ప్రొద్దుపోతుంది నాకు. అందుకే తీసుకువచ్చేను" అన్న




కారణం కునుస్తూ అనేసింది.

చుర్రుమంది కొరడా దెబ్బలా. ఏమీ మాట్లాడలేని కోపంలోనే తలూపేడు. అవడానికైనా పైగా పెద్దపాటుఫారంమీద, వందల జనం వుండగా ఉన్న పిరికితనం నోరు మెదపనివ్వలేదు.

ఒక్కటే బాధించింది. వెంకాయమ్మ ఈ వుద్దేశ్యంలో వున్నానని కాస్త ఉత్తరాల్లో ముందు చూచాయిగా తెల్పివుంటే ఇంత బాధపడకపోయివుండును. ఈ అధాటుగా రావడం, అందులోనూ దాంతోటి అన్నది కొంచెం చికాకుకల్గించింది.

పైగా మొన్న సెలవులకు వెళ్ళినప్పుడు, తన చెల్లెలును నోరారగా ఆఖరుదాన్ని సాదగరవుంచుకుంటాను అని అడగనే అడిగేడు. కాని అది కార్యరూపంధరించే ముందుగానే, వెంకాయమ్మ, తన ఉత్తరంలో తెల్పినా, పోటీపడి, ఇల్లా తన నెత్తిమీద రుద్దడం, మనస్సు ఒప్పుకోలేపోయింది.

తనలో తానే మండుకుపోయేడు, సుందర్రామయ్య.

* * *

గతించిన వత్సరాల్లో జరిగిన కాపురం ఓవతు, ఇప్పుడు రూపొందిన దినచర్యలు ఇంకోవతుగాను సుందర్రామయ్యకుతట్టేయి. ఓవిధమైన మార్పులు, ఆమార్పులకు కొజాకో

# ★ వ్యాఖ్యేయం ★

వ్యాకులత, సంకలనం, రోజుకో క్రొత్త క్రొత్త పురమాయింపులు, సంబాళింపులు ఉంటే సరికి, గజిబిజీ అయినట్లు తట్టింది. ఏదో అంతా ఓ మాడావిడిగాను రూపొందించుకుంది.

మొదట కొన్ని రోజుల్లోనూ శారద తన్ని చూసే సిగ్గుపడి, దగ్గరకైనా రాకుండా పారిపోయేది. ఒక్కసారైనా దగ్గరకు రాకుండా వుండడంతో. తను సంబోధించడం, అఖరికి పిలిచి లాలించడంకూడా తెలియని పోతేమా అన్న భావన తట్టె ముఖం ముడుచుకునే వాడు. వెంకాయమ్మ కొంచెం బాధపడి, మొఖం చేవురించుకుంటూనే

"ఏమే మొదూ! ఆ బాబయ్యగారు పిలుస్తుంటే పలకవేం?" అని గదమాయించి, ముందుకూర్చొబెట్టేది. అదిబిక్క ముఖంతో పెళ్ళికూతుర అయితే, తనే విధంగా మాట్లాడాలో అన్నంత తబ్బిబ్బు పడేది.

"పెళ్ళి చేసుకుంటావా?"

తెలూ పేది, ఏమంటే ఏమవుతుందో అన్న భయంలో.

ఈయనకు ఏం మాట్లాడాలో కూడా తెలియనందుకు నవ్వుకుంటూనే "మంకా! ఇంకా పళ్ళు రాలేదు. అప్పుడే పెళ్లి కావాలా నీకు. ఆయనఅడగడం, నువ్వు చెప్పడం బాగా చేవున్నాయి. 'చక్కగా బళ్ళో వేయించండి. చదువుకుంటాను' అని అనాలిగాని" అని దానికి భగవద్గీత చెపుతూనే

"మీరు ఇవ్వాళ ఓసారి ఆ స్కూలుకు వెళ్ళి దాన్ని చేర్పించిరావాలి. ఇంటి దగ్గర అక్కడ వున్నప్పుడు దొమ్మరిదానిలా రోడ్ల మ్మట తిరగడమే కాని ఒక్క క్షణం ఆటలు విద్దుకునేది కాదు." అంటూ టీక దానికి తోడు ఉపమానాలు చెప్పేసి, "శారద తల్లి తండ్రీకూడా దాన్ని వంచలేక పోయేరు"



అంటూ తేల్చేసింది. ఆ చెప్పడంలో తనేదో స్వర్గలోకంలోంచి ఊడిపడ్డ చదువుల సరస్వతిలాగే రూపం ఆపాదించుకుంది.

"అయితే కాకరకాయ మేస్టర్ని రమ్మనవా?" అన్నాడు. ఆయనకేదో ఆఫీసు పని చేసి పెడితే కాకరకాయలు లంచం ఇచ్చేడు. అక్కడినుండి పేరు నరసయ్య అయినా ఆయనకు ఈ పేరే చెలామణీ అయిపోయింది.

"అక్కర్లేదు. పొద్దున్న మీకు పదింటి వరకూ తీరుబడే కదా! ఓ ఘంట చెప్పండి. మధ్యాహ్నం నేను చెపుతా!"

"మరి స్కూలో"

జాలికలుచుకుంది. తన తెలివి తక్కువకు వెంకాయమ్మ. సద్దుకుంటూనే "సాయింత్రం ఓ అరఘంట..." అంటూనే కళ్ళల్లోకి చూచింది.

అర్థం అయినట్టే "చూద్దాంలే!" అనేశాడు తాత్కాలికంగా.

ఆ సాయింత్రం ఓ పలకా, బలపాలూ, కాపీ పుస్తకం, అ ఆ లు వుండే బొమ్మల కాగితం, ఓ సంచీ, అంకెలు కూడుకొనే పూసలచట్రం వగైరాలన్నీ బడ్జెటులో పడాయి—ఎసెంబ్లీ ఆమోదించినట్లు, గవర్నరుగారి ముద్ర పడ్డట్టున్నా.

శారదతోనే బజారుకు పడాడు, పై అంగాంగియాలన్నీ కొనాలని. కూడా చెయ్యి పట్టుకుని నడిపిస్తుంటే, 'పదేళ్ళనుండి ఈయన్ని ఈ వూళ్లో చూస్తున్నాం; ఎప్పుడూ ఒంటరిగా వచ్చే ఆయన, ఇవ్వాళ ఇలా తయారయ్యే' డన్న కుతూహలంలో, ఓ అరడజనుమంది ప్రశ్నలు కురిపించేరు.

"మీ అమ్మాయా?"

చివుక్కుమంది హృదయం. ఒకళ్ళిద్దరికి సమాధానం చెప్పకుండానే మాటలు తారుమారు చేశాడు. మరో ఇద్దరు బుగ్గలు పుణుకుతూనే, కళ్లు మెరిపించుకున్నారు శారద కళల్లోని సౌందర్యాన్ని చూసి మురిసిపోతూ, ఏ బ్రాపిలా వుంటే ఇంటిదగర చంతలి స్మరణకు వస్తేను, భార్యల్ని తిట్టుకుంటూ.

ఇది నిజంగా ఒక్క గంతేసినట్టేఅయితే, శారద మీద అనురాగం ఊటే అయి పొంగిపోతూ, వెనకాల వెంకాయమ్మకు పిల్లల్ని ఎలా సంరక్షించాలో తెలుసును, శృంగారించాలన్న విషయం కరతలామలకం అన్న గొప్ప ఊపు ఊపేస్తే—

"మా అమ్మాయే!" అనేశాడు.

"మరి ఇన్నాళ్లూ ఎక్కడుంది?"

అడిన అబద్ధం, తన చదువుల విశాలత్వంలో విజృంభిస్తే, మద్రాసు, కాకినాడ, గుంటూరు వగైరా కాన్వెంటు చదువుల్లో వుంది అని జవాబు చెప్పదామనుకున్న ఉత్సాహం చప్పబడి "వాళ్ల అమ్మమ్మదగ్గర ఉంటోంది" అనేశాడు.

వివిధ వస్తుసామగ్రితో, స్నేహితులు శారదకు కొనియిచ్చిన చాక్లెట్లతో, దారిలో మారికి పట్టుబడిపోయే వోళ్లు, స్టాకింగ్స్, రెండు రబ్బరు బంతులు మొత్తం పదిరూపాయల కిలం చెల్లించుకుని ఇంటిగుమ్మంమెట్లు ఎక్కాడు.

వెంకాయమ్మ ఒక్కొక్కటే చూస్తూ కళ్లు నత్తి తాత అయితే "పిల్లలంటే మను కోరం మీకు మాత్రం లేదా ఏమిటి?" అనేసింది.

కటకరోహిణి కషాయం మింగినట్లయ్యింది. 'అల్లాగా' అంటూనే కుర్చీలో కూలబడ్డాడు.

* * *

మొదటి నెల్లాళ్లూ జరిగేసరికి ఓ విధమైన లాలింపు, శృంగారింపు, గారాబం ఓ పెడ, ఇంకో పెడ చపేటికలు, తొడపాశాలు. గోడ కుర్చీలు, వల్లింపుల్లో శారద స్వాతంత్ర్యం కట్టుబడిపోయి, ఓనామాలు దాటి 'అ' 'ఆ'ల మీదుగా యిరలవల్లో పడింది.

ఈ అభ్యుదయంతోపాటు, సుందర్రామయ్యకు కూడా దినచర్యలో మార్పు వచ్చింది. ప్రతీఉదయం కాఫీ సేవింపు తర్వాత ఏ పేపరు చదవడమో మొలబడి, శారదకు ప్రయివేటు మేష్టరు పని పుచ్చుకున్నాడు. ముంకుతనంలో తెలివి తేటలున్న శారద రాలుగాయితనానికి వైద్యం ఎలా అన్నా అరాటంతో, అఖరుకు తిన్నా తాను సంబాళించుకోలేక కొట్టేవాడు. గోడకుర్చీ వేయించేవాడు. ఇల్లా నిత్యరోదనం, పళ్ళు తోరణాలల్లో పక్షం తిరగకుండానే గుణింతాలు పూర్తిచేయించి, అల, వల, తల, పలక, పుస్తకం పట్టించేసి, వెంకాయమ్మ దగ్గర ఫాలివిరుచుకుని కులికేవాడు.

అల్లాంటప్పుడే వెంకాయమ్మ తనమధ్యాహ్న కార్యక్రమంలో దాన్ని చీల్చి చెండాడిన అంశాలు ఏకరువుపెట్టి తన గొప్పా చెప్పుకునేది.

తాత్కాలికంగా ఈ నెలన్నర రోజులోనూ భార్యభర్తలు తెచ్చిన ప్రగతి మురిసిపోయినా, నిర్దిష్ట అభివృద్ధి, వెంకటితనం వదలింపుల్లో శారద దారిలోపడా, అప్పుడప్పుడు సుందర్రామయ్యకు దాన్నిరకం కళ్ళచూచేదీనాకుదిలో మనస్సు కెలికినట్టయ్యేది. వెనువెంటనే "శారదా నీ రక్తం, చీము పంచుకుని పుట్టిందై తే ఇంత కష్టం భోమలో పెట్టేవాడినా?" అన్న ఆలోచన కలిగితే, కుమిలిపోయేవాడు.

సైగా డీలిగోడు అన్నట్టు వచ్చినప్పటి శారదరూపంలో చిక్కి నలు, కళ్ళల్లో తనం చూసే భయంతో ఎదురుగా తిరగడంతో

జారిపోయాడు. ఇదే అది ఉన్నంతకాలం విజృంభిస్తే తన మానవత్వం, తెలివి కూడా మంట కలసిపోతాయన్న దిగులూ పుట్టింది. ముక్కుపచ్చలు ఆరనిది ఈ వయస్సులో చీకూ చింతా లేకుండా ఆడుకోవలసిన కాలంలో యిలా అపదిగ్భ్రంశనాలు చేస్తే, ఏమైయిపోతుందో ఆలోచించేవా అన్న ప్రశ్న ఉక్కిరిబిక్కిరే అయ్యేది. అటువంటప్పుడే అవ్యక్తంగా కళ్ళు చెమర్చేవి.

తన ఆవయస్సు, అందులో చేసిన చేష్టలు ఆకతాయితనం మననం అయితే, సహా ప్రాంతంకూడా దానికి స్వేచ్ఛ నివ్వకుండా మీ దంపతులిద్దరూ ఎంతగా రాక్షసులైపోయారో అన్న నగ్న సత్యం ఛురిక విసరి వల్లయ్యేది. పైకి ఈ విషయాన్నే వెంకాయమ్మకు చెపుదామని ఎన్నో సార్లు ఉద్యుక్తుడవడమూ, అది కార్యరూపం పొందలేని స్థితిలో దిగమింగుకోవడమూ అయింది. గత్యా గత్యా చెప్పినా, వెంకాయమ్మ వినే స్థితిలో లేనే లేదన్నది నిరుకు. పైగా ఇదివరకు అన్నట్టే "వాళ్ళమ్మా నాన్నా కూడా ఏమీ వంచలేకనే మనదగరకు పంపేరు"అన్న పర్యాయపదం ఊతగా తీసుకుంటుంది అన్నది గట్టే.

ఇవన్నీ ఎలావున్నా, వెంకాయమ్మలోని మార్పుకు సుందరామయ్య ఆశ్చర్యపోయేడు. తను నెల నెలా వేసే బడ్జెట్లుల్లో శారదకోసం పదిదగ్గరనుండి ముప్ఫై వరకూ పెరిగి, బటలు, షోకులు, వగైరాలకు దిన దిన ప్రవర్ధమాన మవడం, ఓవిధంగా సంతోష పెట్టింది. వేసిన ఒక పంథా రోండో రోజు లేకుండా వేసి దాన్ని ఆ సాయంకాలాల్లో తనతో పంపడం, వెన్ను వేసిన ట్టయ్యింది. దాంతో నలుగురు కళ్ళూ మెరిపించడంతో తనే మాఘాచారాల్లోకి వెళ్ళి, ఇంటి మెట్లు ఎక్కి లోపలికి వచ్చినపుడే "ఇవ్వాళ కాస్త మిరపకాయలు తీసివెయ్యవే" అనో "రాత్రి కాస్త వీభూతి పెటవే' 'ఉప్పు ఓ సారి తీసెయ్యి' ఇల్లా పురమాయింపు చేసేవాడు.

ఒకవిధంగా శారద రావడంవల మానసికంగా కొంచెం ఉల్లాసం కల్గించి, ఇంటో పిల్లలుండడంవల్ల వచ్చే నిండుతనం, తీరి బుజాపైనా, ఏరాత్రిళ్ళో అది లేచి "పిన్నీ! నీదగ్గర పడుకుంటాను"అని అనడం, దాంతో తామేదో తప్పు చేసినవాళ్లలా అయిపోవడం చూస్తే చీకాకుకలేంది. తాత్కాలికంగా కోపమూ వచ్చేది వెంకాయమ్మ "ముద్దముండా! నిద్రపోలేదా!" అంటూనే రుసరుసలాడుతూ వెళ్ళేది. ఈ విచిత్రానుభూతి తను ఎంతవరకూ స్వీకరించగలడు అన్నదే సంశయమూ అయింది సుందరామయ్యకు.

వెంకాయమ్మ తనపై పువాళ్ళకు వ్రాసే ఉత్తరాల్లో 'ఆ శారదే కాదు. ఇప్పుడు పూర్తిగా మారిపోయింది. ఒకటో క్లాసులో వేసేశాం. ఇంగ్లీషు అక్షరాలు కూడా నేర్పించి వచ్చే సంవత్సరం కాన్వెంటులో చేర్పిద్దామనుకుంటున్నాం', అన్న వరసలో ఆ మూలాగ్రం ఏ స్వర్గలోకంలోంచో, బండ, మొండి, రణపెంకి, రాలుగాయి పిల్లల్ని అందర్నీ కట్టుబడి కట్టి ఉద్ధరిస్తాం, అధర్మ సంపాపనార్థం మేం ఉన్నాం అన్న గరువాల్లో అంతం చేసేది.

ఉండపట్టలేక, ఏ పూర్వీకుల కాలంలోనో సూర్యచంద్రాగుల సాక్ష్యం అన్న రిజిస్టరీ దస్తావేజుల్లో, దాని చేత, మూడు వాలు సార్లు కాపీ వ్రాయించి, దానికి చిత్తు, సవరణలు చేసి, అసలు మేలిం బంగారం అంటున్నట్టే, తాజాకలంలా పూర్తిచేసి పంపేది.

వాటిల్లో దుశ్శాలువలు వలె వేసుకుని మురిసిపోయేది. ఈ ఆజ్యహోమం బాప్రక్కవాటాలో వున్న మూర్తి భార్య 'మా అబ్బాయికీ కాస్త అన్నయ్యగారి చేత భయం చెప్పించి రెండు అక్షరం ముక్కలు నేర్పిద్దురూ' అనే దరఖాస్తు రావడంతో మెట్లు ఎక్కిన ఆయనతో అది చెప్పి మురిసిపోయింది.

కుప్ప కూలినట్టు కూలబడ్డ సుందరామయ్యకు జవాబు చెప్పనియ్యకుండానే సంయ్యే అంటే సంయే అనుకున్న వతులో 'రేపటినుండి పంపండి' అని అనేశాను అనీ చెప్పేసింది.

ఇల్లూ, వళ్ళూ ఏదో చీకటిగా తట్టినట్లయ్యింది సుందరామయ్యకు మనస్సు ఆవేదనా పడిపోయింది. గుండెల స్పందనం ఎక్కువే అయింది.

'ఎంతవరకూ వెళుతుంది?' అన్న సందిగ్ధంలో పడి కళవళ పడిపోయేడు.

* * *

అణగద్రొక్కబడి, కాళ్ళక్రింద వేసి రాపాడి, రంపపుకోత కోసిన ప్రజలు, ఎప్పుడో అప్పుడు దౌర్జన్యంతో తిరుగుబాటు చేస్తారు అన్నది చరిత్ర సత్యం దానికి ఒక్క చరిత్రనే సాక్ష్యం అక్కరలేదు. యుగయుగాల సింహావలోకనమూ అక్కరలేదు నిత్యకృత్య ప్రజా పరళిలో అది వ్యక్తం అవుతూనే వుంటుంది.

ఆరునెలలు గడిచేసరికే అదే విజృంభించింది సుందరామయ్య ఇంటో. అటు రోజూ రావడంతో దినప్రమాణంలో ఉన్న ఘడియలు, విఘడియల్లో శారద ఏవిధంగా తన ఆదేశాలను, తన మాటలను ఉల్లంఘించి తలవొంపులు కలచేసిందో చెప్పడం, తను నయాన్నీ భయాన్ని చెప్పినా వినకుండా, ఈ యీ పనులు చేసింది అని విపులీకరించడం జరిగేవి. దాంతో తను కట్టుకున్న సువర్ణ సౌధాలన్నీ కుప్పకూలిపోతున్నాయి. గౌరవం మంట కలిసపోతోంది, వాళ్ల దగ్గర తలవొంపే అన్న కుమిలింపుల్లో కళ్ళ నీళ్ళ పర్యంతరం అయిపోయేది.

గుండెలు గుబగుబలాడిపోయేవి సుందరామయ్యకు. వెంకాయమ్మతో పంతం దాన్ని జీవితంలో దుఃఖపెటకూడదు అని చేసుకున్న నిర్ణయాలో, తను తనమీద వేవిధించుకున్న ఆంక్షలన్నీ కూడా ఎంత వటి మిథ్యా స్వరూపాలై పోతున్నాయో అని తహతహలాడిపోయేవాడు.

సత్యం ఒప్పుకోవాలంటే ఏనాడు శారద ఇంట్లో కాలెట్టిందో ఆరోజే గుండె దుగుకు పడింది. తనకీ, వెంకాయమ్మకు కూడా పిల్లల్ని పెంచడం, అభివృద్ధిలోకి ఎల్లా తీసుకురావాలో అన్నది తెలియనే తెలియదు. 'స్వం' అనేది గవుడు ఇవ్వకపోవడంవల్ల, ఆ అనుభవం సృష్టివిరుద్ధంఅయి మనస్సులను కలచివెయ్యడంవల.

ఇద్దరూకూడా ఓ పంచవర్ష ప్రణాళికలా శారదను తమదగ్గర ఉనికిలో రూపొందించుకుంటూనే మేడలు కట్టుకున్నారు. ఆకట్టినవి, రూపొందించుకున్నవికూడా ఊహల్లో విహంగాల్లా వుండడం. ఇటు పునాది ఓటుదనం చూడకుండానే కార్యరంగంలో దుముకడం తటస్థించింది. లక్ష్యంకూడా ఆ తద నంతరపు ఔన్నత్యంమీదనే కేంద్రీకృతం అవడంవల్ల, గుడ్డెదు చేలోపడినట్టే, తప్పటడుగులు పడిపోయేయి.

భుజబలాలు, జబ్బసత్తువులమీద, శారదను ఆ లక్ష్యానికి ఎంతత్వరలో చేర్పిస్తామా, అన్న మైకంలో, పప్పులో కాలు వేసెయ్యడంతో, శారద మురాయించి, మొండికెత్తేసింది. 'కొట్టండి, తిట్టండి, గారచవించండి, మీరు ఏంచేసుకున్నా నాభౌతిక శరీరం మీచేతుల్లో పెట్టేస్తున్నా' అన్న తత్వంలో, ఆత్మీయంలో బెంగను పెంపొందించుకుని, బక్కచిక్కి అయ్యింది.

# ★ వ్యాఖ్యేయం ★

అటుభార్య, ఇటు శారద, తన వ్యక్తిత్వంలోని మానవత్వం, మూడు వైపులా కత్తులు వేసి బిగపట్టేస్తే సుందర్రామయ్యకు పాలుపోలేదు. వచ్చినప్పటినుండి, శారదను నానా చిత్రవధలు చేసి, దాన్ని దాన్నిగా ఎప్పుడూ గాలి పీల్చుకోనివ్వలేదు. ఇద్దరూ! తమ కళ్ళల్లోంచి దాన్ని పెరగమన్నారు, సాధ్యం అసాధ్యం కూడా విచక్షణ లియ్యలేని మూర్ఖులే అయిన్నీ పోయారు.

ఏం చెయ్యాలి? పోనీ వాళ్ళింటికి పంపేస్తే! వెంకాయమ్మ ఒప్పుకోదు! పంథా మార్చుకుంటే? ఏ విధంగా మార్చుకోవాలి? ఏ గాంధిగారి మార్గాల్లోగా సత్యాగ్రహం చేయిస్తే...వటి మాధ్యంలా తట్టింది. ఇంత వయసున్న అనుభవను కూడా ఎందుకూ పనికిరానివి క్రిందజమ వేయవలసి వచ్చింది.

ఓ మార్గంలో దౌర్జన్య సిద్ధాంతం పూర్తి అమలు జరుగుతోగది కనుక తను పూర్ణ శాంతి సిద్ధాంతాలను అమలులో పెట్టి లాలింపు, పొగడ్త లంచం, వినోదాలు, కథలు కబుర్లు చెప్పడం ప్రారంభించేడు. ఇది కార్యక్రమ రూపంలోకి వచ్చేసరికి, వెంకాయమ్మ పతనంలో, తనమీదనే దుమ్మెత్తిపోసే వరకు వచ్చింది.

“ఆ ముద్దుకు గారాబం చేస్తేనా తిక్కెక్కి కూర్చుంటోంది. నాకు చెడ్డచావొచ్చి పోతోంది” అన్న పీఠికతో, ఆ మధ్యాహ్నం పదిమందిలోను తన్ను ఏదో అనరానిమాట అని న్యూనత పరిచేసింది. అన్నదాంతో ముగింపు చేసింది.

ఈ మధ్య ఈ శాంతి కార్యక్రమం ఎంత వటిడాలకు పునాదులయ్యిందో అన్న కుమిలింపు, కోపాన్ని పట్టపగాలు లేకుండానే చేయిస్తే, స్కేలుబద్ధతో విజృంభించేశాడు; కాపలాలేని వరిచేలోపడ్డ పశువులా, అక్కడక్కడ రెండుమూడువాతలూ పడ్డాయి.

ఆరోజు అన్నందగ్గర మెతుకు కొరకనే లేకపోయేడు. ఏదో చెప్పబోయిన వెంకాయమ్మను రెండుమాటలని ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

అంతే!

ఆ సాయంత్రానికి శారదకు ఒళ్ళు పేలిపోయే జ్వరం వచ్చేసింది. మనస్సు చచ్చిపోయింది సుందర్రామయ్యకు. ఈ మనుకార హోమంలో శారదను బలిపెట్టినట్లయితే, మానవత్వంలోంచి పశుత్వంలో పూర్ణత్వం పొందినట్లయ్యింది. దుఃఖం వచ్చింది. ఇప్పుడు మంచం ప్రక్కగా కూర్చుని, ఆ బొద్దారని శారదను, తనే విధంగా తుమాపణలు చెప్పుకోవాలో కూడా తెలియలేదు. వెంకాయమ్మ మీద నిలువెల్లా ద్వేషం పలుకరించింది.

ఆ రాత్రిళ్ళల్లో, కంటిమీద కునుకైనా లేకుండా, పహరా ఇచ్చేడు. ఊళ్ళోవున్న డాకర్ల నిద్దరినీ తీసుకూ వచ్చేడు. ‘ఆరాటంలో ఏమవుతుంది?’ అన్న ప్రశ్న భీకరాకృతి దాల్చి, తన్ని నిలువెల్లా దహనమే చేసింది.

అప్పుడప్పుడు మైకంలోంచి తెప్పరిల్లిన శారద “పిన్నీ! మంచిగా వుంటా! బాబయ్యతో చెప్పకేం” అని కలవరింతలు వింటుంటే సుందర్రామయ్యకు చీమలూ జెర్రెలూ ప్రాకినట్లయ్యేది. వల్లమాలినకోపం వచ్చేసింది వెంకాయమ్మ మీద.

నాలుగోజులవరకూ గుండె నిబ్బరంతో వున్న వెంకాయమ్మ’ ఆపలవరింతలు ఎక్కువయ్యేసరికి, తబ్బిబ్బు అయిపోయి తీలా అయ్యింది. దాంతో కళ్ళలో ఏమవుతుందన్న భయం, ఆందోళనతోటి, బావురుమనే పరిసితిలో పడనూ పడింది. ఆ ఆవేదనలో సుందర్రామయ్య భుజాలమీద తలపెట్టేసి బావురుమని పోయింది.

నిజంగా ఆలోచిస్తే ఇద్దరికీ బిడ్డల పెంపకం తెలియదు. ఒక్క మిథ్యా స్వరూపంలో ‘ఇల్లావుంచాలి! అలా కట్టుదిట్టాల్లో పెట్టాలి. ఉండుకున్న చదువులో మంచిచదువు చదివించాలన్న’ ఆశయం తప్ప ఈనాడు శారద విషయంలో, మనసా వాచా సర్వస్వం దానికొరకు త్యాగంచేసి, చీమూ నెత్తురూ ధారపోసినా, దేవుడు అన్యధాతలిస్తే జీవితాంతం, దానితల్లీదండ్రీ, చుటపక్కాలుకూడా, తుమతో, అనునయం చెయ్యరు. పైగా ఆగావుమాటలు అంటారన్న సత్యం. దాంతో జీవితం అంతా కొరితో తలగోకుకున్నట్లు అవుతుంది. క్షోభల్లో క్షుభితంకూడా అవుతుంది. ఇదే ఇరువురి హృదయాల్లోనూ మెసలి, ఎండు రావిటాకులే అయిపోయి గోలపెట్టేసేరు.

బుజ్జగించినట్లుగానే సుందరరామయ్య వీపునిమురుతూ “డాక్టరు” ఎల్లుండికల్లా జ్వరం తగ్గుతుందన్నారు” అన్నాడు.

మాట్లాడలేకపోయింది: ఎక్కిళ్ళు ఎక్కువయ్యాయి.

“ఊరుకో! ఎందుకూ ఏడుస్తావ్! దేవుని దయవల్ల అన్నీ సవ్యంగానే అవుతాయి.”

“నాకు పిల్లల్ని పెంచడం చేతకాదేమో! అందుకే...” ఇక మాట్లాడకుండా గుండెల్ని తడిపేసింది.

రువ్విన తగిలేయి ఆ మాటలు. అంతవరకూ ఆ భావన తన హృదయంలోనే దాచుకున్న గరళకంఠం కట్టు తప్పినట్టే అయ్యింది. అత్తి నన్నటే తెలూపేకాడు కళ్ళల్లోకి చూస్తూ “నెమ్మదించగానే పంపించేద్దాం” అంది అంగుల్లో పూర్ణ ఆహుతిఅయినట్లే స్తంభించిపోయేడు సుందరరామయ్య.

* * *

వారందాటి పదిహేనురోజుల్లోకి అంకెలు వచ్చేసరికి, పథ్యం పెట్టమని డాక్టరు ఆజ్ఞ ఇచ్చేశాడు.

ఆ కోలుకొనే రోజుల్లో శారద ఇంటి యజమాని, భార్యాభర్తలిరువురూ తాబేదార్లు, భృత్యులు అన్న పరిస్థితిలో పడిపోయేరు. ఏ క్షణానికి ఏమి కావాలంటుందో, ఏ వేవి తింటే బలం కూరుతుందో అన్న ఆశయంలో అడుగులకు మడుగులొత్తేశారు.

అది కోపంలో, ద్వేషంలో ఎన్నిమాటలన్నా, బక్కతనంలో ఎంత మంకుతనం చూపించినా, ఇంతవరకూ పెంచుకున్న కసి చూపించుకుందుకు పెంకితనం ప్రదర్శించినా, ఆ రోజుల్లో వెంకాయమ్మ ఓర్చుకుంది. కాశికా అన్నపూర్ణే అయ్యింది. సుందర్రామయ్య కూడా తందానతాన అనే స్థితిలో వుండడం గ్రహించేసి శారద, మరింతగా విజృంభించేసింది. ఆ విశ్వరూపం పరిధిదాటి, ఆఖరుకు భార్యాభర్తల్లో “ఈ పిల్లలు లేనివాళ్ళు పెంపకాలు, దత్తతలు అని గోలెట్టుతారే! ఎందుకో!” అన్న చైతన్యం కూడా దృగ్గోచరం అయి “ఉంటే ఉన్నారు. లేకపోతే లేకపోయేరు. జన్మలో ఎవర్ని దగ్గరగా తీసుకుని రాకూడ”దన్న జ్ఞానోదయంలో నిర్ణయాలు చేసుకున్నారు.

“ఆ నిర్ణయం, శపథాలు కూడా ఒత్తి బోడివ్యూహాలు. పునాదులులేని అంతస్తులు. మీరు దాని పెంపకంలో ఓడిపోయేరు. అదే సత్యం” అని మనస్సుటాకాయించినా ఒప్పుకోలేక పోయేరు.

ఇదే ఓటమి అయితే...అది చాలా అర్థంలేని బాధేమో అనిపించింది.

ఆ ఏకాదశి బుధవారంనాడు శారద వెళ్ళిన్నీ పోయింది.

* * *

మానవ సహజ దౌర్బల్యం అనండి, అలవాటతో జీర్ణించిపోయిన శరీరం అనండి, మానసికంగా పరివర్తన చెందలేక ఓడిపోయిన ప్రాణి అని నిర్ణయం చెయ్యండి, ఏది ఎల్లా వున్నా శారద వెళ్ళిపోయిన తర్వాత ఏర్పడ్డ శూన్యాన్ని తట్టుకోలేకపోయేడు సుందర్రామయ్య.

ఆ ఇంటిగుమ్మం ఎక్కినప్పుడు, కాఫీ త్రాగినతర్వాత సావిటో కూర్చునప్పుడు, సాయంకాలాల్లో షికారుకు వెళ్ళే సమ

యంలోనూ, ఒక్క పేచీలేకుండా, దివం ప్రమాణంలో గడిచినఘంటల్లో, శారద తనమీద అవ్యక్తంగా ఏర్పరుచుకున్న ఆక్రమణ, వెల్లువలే అయి కట్టలు తెంచేసింది. దాంతో శాంతి లేకపోయేది.

ఒక్కొక్కసారి, ఆ చిన్న చిన్న విషయాలే మననంఅయి, భావుకతలో రూపొందినపుడు, హృదయం కదలింపులకు భౌతికంగా, ఆత్మపరంగా కల్గిన క్షోభలకు తట్టుకోలేక మధన పడేవాడు.

ఆ రోజు అదే జరిగింది. భోజనానికి కూర్చున్నప్పుడే, శారదకు లేనిపోట, కలి కేస్తే, మటుకోలేక నే, కళ్ళమ్మట నీళ్ళు చెమరిస్తే లేచిపోయేడు.

వెంకాయమ్మడిల్లిపోయింది. ఛురిక విసిరినట్లుగా 'నీ చిలిపి పనులవల్ల మనస్సుల్ని ఎలా వధ్యశిల ఎక్కిస్తావో తెలుసుకున్నావా?' అనే సవాలు తిరిగితే వణికిపోయింది. హృదయ స్పందనం ఎక్కువే అయ్యింది. కళ్లమ్మటనీళు తిరిగినవి తుడుచుకుంటూనే వెనువెంట వెళ్ళింది.

చొక్కా వేసుకోబోతున్న ఆయన్ని తన వేపు త్రిప్పుకుంటూనే "నేను ఒట్టి పాపిష్టిదాన్ని. మీకు...."అంటూనే ఏడ్చేసింది.

పొదివి తీసుకున్నాడు. ఏ విధంగా అనునయం చెయ్యాలో తెలియని స్తబ్ధత ఆవరించింది సుందర్రామయ్యకు.

వెక్కి వెక్కిన ఎక్కిళ్లమధ్యలోనే, విడవలేని అనునయ ఆకాశాల్లోనే "నేను గాజులు మోచేతివరకూ వేయించుకోవాలేమో!" అంది.

తెల్లబోయేడు సుందర్రామయ్య, నడుం మీద చేతులువేసి దగ్గరగా ఒత్తుకుంటూ 'నిజంగా' అని అనేసేడు.

తలూపితే, ఇద్దరి కళ్ళవెంబడి కారి పడిన అశ్రువులు, హృదయాలకు అమృతాలే అయ్యాయి. ప్రపంచం చుట్టూ, ప్రక్కలా ఏమీ లేనే లేవు.

ఆచూపుల్లో గరిమ దూరం దూరంగా వున్న నక్షత్రాలను దాటి, సరస్వతీ వీణ వాద్యం విన్నట్టే అయిన్నీ పోయింది. ★

## "రావణ నీతి"

(39-వ పేజీ తరువాయి)

ర్యాలు చేశాను. నన్ను క్షమించాలను. రామా! సర్వం తెల్సిన నీకా నేను చెప్పాల్సింది," అన్నాడు రావణుడు.

"నీవు చెప్పింది నిజమే. అయితే ప్రతివాడు ఈభూమిమీద నేర్చుకోవాల్సింది ఉంటూనే ఉంటుంది. నీవు మాత్రం సామాన్యుడవా? ముల్లోకాలను నీ భుజబలంవల్ల జయించావు. నీ దగ్గరనుంచి రాజ్యపాలన విషయంలో కొన్ని విషయాలు నేర్చుకోవా లనుకుంటున్నాను" అన్నాడు శ్రీరాముడు.

"నా జీవితం యింక కొన్ని ఘడియలు మటుకే." అని అతి క్షీణ స్వరంతో అని "అయితే నాకు తెలిసిన అల్ప విషయాలు చెబుతాను విను", అన్నాడు రావణుడు.

"రామా! నీవు ఏదైనా ఒక మంచికార్యం తలపెడితే అది తక్షణం చేసెయ్యి, ఆలస్యం చేస్తే ఆపని చేయటం దుస్సాధ్యం అవుతుంది. దీనికి నా జీవితంలోని ఉదాహరణ చెబుతాను విను," అన్నాడు రావణుడు.

"ఒకరోజు స్వర్గం నుంచి భూలోకానికి నా రథం మీద వస్తున్నాను. అలా వస్తూంటే దారిలో నాకు నరక లోకం కన్పించింది. మూడు ద్వారాలు దేదీప్యమానంగా వెల్గుతున్నాయి. నాల్గవ ద్వారం మట్టుకు చీకటిగా ఉంది, ఆద్వారం లోనే ఎనభైనాల్గు నరకబిలాలు ఉన్నాయి. అక్కడ ఆ బిలాల లోంచి పాపులు భూలోకం చూడాలని తలలు బయటపెట్టటం, యమకింకరులు వాళ్ళ తలల మీద తమ దండాలతో కొట్టడం, వాళ్ళు బాధతో తిరిగి తమ తలలు లోపలకు లాగుకోవటం చూచాను. ఆ క్షణంలో నరకం మీదకు దండెత్తి వాళ్లను బాధనుంచి విముక్తుల్ని చేయాలని అనుకొన్నాను. తర్వాత నేను నా రాజధానికి వచ్చేశాను. తర్వాత ప్రతిరోజు రేపు చేద్దాం, తర్వాత చేద్దాం అని దాన్ని వాయిదా వేస్తూవచ్చాను. తర్వాత సీతతో యుద్ధానికి తలపడటం నేను మృత్యుముఖంలో పడి యుండటం నీకు తెల్సిందేకదా! నా జీవితం ఇక కొద్దిఘడియలలో ముగియబోతున్నది. అయితే ఆమంచిపని చేయటం మట్టుకు సాధ్యం కాలేదు," అన్నాడు రావణుడు.

"మరొక ఉదాహరణకూడ చెబుతాను విను," అన్నాడు రావణుడు. "బ్రహ్మ ఏడు సముద్రాలను సృష్టించాడు. కాని సుందరమైన నా లంకా పట్టణం ఈ దరిద్రపు ఉప్పు సముద్రంలో ఎందుకుండాలి? నా లంకా పట్టణం పాలసముద్రవలయితం ఎందుకుకాకూడదు? నేనువెళ్లి పాల సముద్రాన్ని తెస్తాను," అన్న ఆలోచన వచ్చింది. అయితే తర్వాత చేద్దాంలే అని అలక్ష్యం చేశాను. ఇక ఆపని నా జీవితంలో చేయలేక పోయాను. ఇదేవిధంగా ఎన్నో మంచి కార్యాలు నాఅలక్ష్యంవల్ల, తర్వాత చేద్దాంలే అని అనుకోవడంవల్ల చేయలేకపోయాను.

"బ్రహ్మ తనచేత్తో అనేక జీవాలను సృష్టించాడు. అందులో దేవతలు, మానవులు, పాములు, నేల మీద తిరుగాడేవి నీళ్లలో జీవించేవి, ఆకాశంలో సంచరించేవి ఉన్నాయి. ప్రతి జీవికి అది ఎంత అల్పజీవి అయినప్పటికి స్వర్గం చూడాలని, స్వర్గ సౌఖ్యాలు అనుభవించాలని కోరిక ఉంటుంది. అయితే ఆ అవకాశం అందరికీ లేదు. ఇది చూచి ఆ అవకాశం అందరికీ లభించేట్లు చేయాలని ఒక పద్ధతి ఆలోచించాను. అయితే దాన్ని ఆచరణలో పెట్టడంలో ఈరోజు చేద్దామని మరునాడు చేద్దాంలే అని అలక్ష్యం చేసి ఆపని చేయలేకపోయాను" అన్నాడు రావణుడు ఆయాసంతో.

## రావణనీతి

"లంకాధిపతీ! నీవు ఇంతవరకు మంచి కార్యాలవిషయమై చెప్పావు. అయితే త్వరపడి చెడ్డపనులు చేయడంవల్ల వచ్చే ఫలితాన్ని గురించి చెప్పలేదు" అన్నాడు రాముడు.

"రామా! దీనికి తార్కాణం నా జీవితమే. అబ్బా! ఈ గాయాలు యమబాధను కల్గిస్తున్నాయి. వాటిని భరించలేకుండా ఉన్నాను. అయినా చెబుతాను విను." అన్నాడు రావణుడు.

"నీ తమ్ముడు లక్ష్మణుడు నా చెల్లెలు శూర్పణఖ ముక్కు, చెవులు కోసి పంపినపుడు అది హృదయ విదారకంగా ఏడుస్తూ నావద్దకు వచ్చింది. దాని బాధ చూసేటప్పటికి నాకు వళ్లు తెలియలేదు. ప్రతీకారవాంఛ ప్రబలిపోయింది నాలో. ముందు వెనకలు, మంచి చెడ్డలు ఆలోచించే శక్తి పోయింది ఆ క్షణంలో నాకు. ఆ సమయంలో నా చెల్లెలు నాకు "సీతాదేవిని నీదగ్గర బంధించి ఉంచుకో" అని సలహా యిచ్చింది. అది మంచిదా చెడ్డదా అనే ఆలోచన లేకుండా దాన్ని తక్షణం ఆచరణలో పెట్టి నా వినాశనాన్ని నా చేతుల్తో తెచ్చి పెట్టుకున్నాను. నా బంధువులు మరణించారు. నా తమ్ముడు మరణించాడు. శూర్పణఖ సలహా పాటించకపోతే లంకాధిపతి అనాథయై యుద్ధభూమిలో మరణించేవాడు కాదు. ఇలాంటి ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి. అవి నీకు తెలుసుకదా? నాకు తెలిసింది చెప్పగల్గింది చెప్పాను. ఇంతకన్నా మరేం లేదు" అని బాధతో కండ్లుమూసుకున్నాడు.

ఇంతలో రావణుని స్వరం పూర్తిగా క్షీణించిపోయింది. శ్రీరాముని పాదాలవైపే చూస్తూ దృష్టి అంతా అక్కడనే కేంద్రీకరించాడు. చివరిసారిగా శక్తి అంతా కూడగట్టుకొని "రామా!" అన్నాడు. అంతే మరుక్షణంలో అతని ప్రాణాలు పంచభూతాలలో కలిసిపోయాయి. ★

## మహాదొడ్డ నాయకుడు మనసిద్ధి వినాయకుడు!

(33 వ పేజీ తరువాయి)

'రండు నేనుమాహేశ్వరి దౌవారికుడను, మీరు శివాజ్ఞపాలకులు. నేనొక్కడ బాలకుండను. మీరో లెక్కకుమీరి అజేయం దారితేరిన ఘనులు. మనలో ఎవ్వరోడినను ఆకీర్త్యపకీరులు మీ శంకరునివే! అని ధైర్యముగా బలికిన బాలునిపలుకుల కచ్చెరువొంది వారెలరుపోయి శివునకీ వృత్తాంతి మెరిగించిరి.

శివుడును ఆ వృత్తాంతమాకర్ణించి తబ్బిబ్బై ఇప్పుడు వినయముజూపిన వెలది కీళ్ళరుడోడెనని లోకు లాడుదురని తలచి యా బాలుని పరిమార్ప పరివారమునకు ప్రోత్సాహము కల్పించి పంపించెను. వారును భూరికృపాణ గదాప్రహస్తులై బాలుని దాకిరి గాని, బాలుని భుజబలమునకోపలేక వెన్నిచ్చి ఒక్కొక్కరే పారిపోవుచుండిరి.

ఈవార్త విన్న కుమారస్వామి యుద్ధమున వెన్నిచ్చి పరువిడుచున్న ప్రమథగణమును, నందీశ్వర చండీశ్వరాగులనుతిట్టి వెనుకకు త్రిప్పి తాను బాలుని యెదుర్కొనెను. కాని బాలునిచూచిన మొదటిచూపులో నే కుమారస్వామికి సోదరభావ ముదయించి పసిడికాంతుల విరజిమ్ము బాలుని మేన బాణము వేయ చేతులురాక కౌగిలించి ముద్దాడవలెనను కొంతు రేకత్తి నిశ్చేష్టుడై చూచుచుండెను.

అదే అదనుకుని బాలుడు వారిని చావమోదుచుండెను. బాలునిబలపరాక్రమములకు ఈశ్వరు డచ్చెరువొందుచుండెను.

కలహమును బెంచి కన్నుల పండువగా కరవుదీర ఆనందింపనెంచిన కలహాభోక్త నారదుడుకూడ నాసమయమున పరమేశ్వరుని పరివారపు ఓటమిని కన్నులగాంచి నాటకమును రక్తి గట్టింపనెంచి తానొక పాత్రధారియై పరువిడి విష్ణువునకు బ్రహ్మకు సంగతి నెరిగించి శివునకీ సమయమున సహాయముగాపోవుట వారి ధర్మమని హెచ్చరించి, వారు తమ తమ పరివారముతో శివుని కడకువచ్చునట్లు చేసెను. పిమ్మట ఈ వింత వార్తను నారదుడు చూడ వేడుకగా దేవేంద్రాది దేవతల కెరిగించి వారు కూడ వచ్చునట్లు చేసెను.

ఇటుల పాతఅవలె శివునకు సహాయముగా తరలి తరలి వచ్చుచున్న మహానాయకుల ఆగమమునకు అచ్చెరు వందుచున్న బాలుడు అంబా కృపాకటాక్ష వీక్షణమునఆవంతయు జంకులేక యెదుర్కొన నుంకించుచుండెను.

ముల్లోకములను బాలునిపై దండెత్త ప్రేరేపించిన నారదు డంతటితో ఊరుకొనక పరుగు పరుగున పార్వతికడకరిగి 'అమ్మా! చూచితివా! ఏదో బాలుడు. చిన్నతనపు చేష్టలచేతనో, నీ ఆజ్ఞచేతనో శివుని నడిగింప పరమశివుని కింత పట్టుదలయే? బాలుడని యైన తలపక తన పరివారమును బాలునిపైకి పంపినది చాలక ముల్లోకములను తమ తమ పరివారములతో తన కండగా నుండుటకై రప్పించుకొనుచున్న నీ మగని పంతమున కేమనవలెను? నీ ముదుబిడ్డడని అయినా దయ తలచవలదా? నీ వుపేక్షించిన ఆ బాలునికిక దిక్కెది? అమ్మా! నీ బిడని నీవు తప్ప ఇంకెవ్వరు కాపాడువారు ముల్లోకములను లేరు, ముక్కోటి దేవతలు నీ ముద్దుబిడ్డనిపై పగ బట్టిరి! అని పలుకగా పార్వతి కొంతసేపు విచారించి తన బిడను కాపాడుకొను బాధ్యత తనదై యున్నదని తలచి పట్టుదల పెరిగినదై తన బిడకు జయ విజయులచే ఖడ్గమును, గదను బంపి బిడ్డకు తోడునీడగా నుండుటకై మనోనేత్రమున నిరువురు శక్తుల సృష్టించి పంపించెను.

శివుని కండగానుండి బాలుని పరిమార్పుటకై వచ్చిన బ్రహ్మ బాలునిగదా ఘాతముల కోర్వలేక పిక్కబలమును జూపెను.

బాలుని కండగా పార్వతిచే బంపబడిన ఇరువురు శక్తులలోను నొకతె కరాళ వక్త్రయై ముఖ గహ్వరంబున ప్రమథ దేవతా సైన్యంబుల మ్రింగుచుండెను. రెండవది పగతుర చెంతనున్న ఆయుధంబుల లాగికొని మరల వారిపైననే విసరుచు వారిని హతమార్చుచుండెను. బాలుడు తల్లి దీవించి తనకు పంపిన ఆయుధ ద్వయంబుతో నవలీలగా ప్రమథామరవాహినుల నాపోశనము బట్టుచుండెను.

ఇదంతయు జూచుచున్న విష్ణువు రౌద్రమూర్తియై బాలుని దాకెను. బాలుడును గదతో విష్ణువు గుండెబగులునట్లు గొట్టెను. విష్ణువు శివుని సమీపించి, ముల్లోకములు దండెత్తివచ్చినను వినిని జయింపలేరు. మాయోపాయమున వినిని మట్టు పెట్టవలెనని రహస్యముగ చెప్పుచు బాలుని సమీపించి

చక్రమును విడువనుంకించు సమయమున బాలుడు గిరిజా ప్రసాదమగు ఖడ్గమున కిటకాంతకుని ఫాలము వ్రయ్యలుచేసిన అంత మురారి హెచ్చుగ మెయినొచ్చి నేలబడం జూచిన పినాకధరుండగు శివుడు తన పినాకమును విసరెను. బాలుడది చూచి తన చేతి విలాసముగా ధరించిన బంగారు బెత్తమున నా పినాకమును భూమిపై బడునట్లుగొట్టెను. అంతముక్కంటి కోపోద్రిక్తుడై ఆపాదమస్తకము భగ్గున మండ, ఆవేశ ముప్పొంగ తన త్రిశూలము నెత్తి బాలుని కంఠమును ఖండించెను.

అంత బాలుని మస్తక మొక చోటను; మొండెమొక చోటను దొర్లుచుండ గాంచిన శివుని మనస్సెంతయో బాధజెందెను. నిర్విణ్ణుడై దేదీప్యమాన ప్రకాశవంతమగు యీ బాలుని మృతకళేబరమును జూచుచుండెను. ఇదంతయు జూచుచుండిన నారదుడు తొందరగా పోయి పార్వతికి పుత్రమరణవార్త నెరింగించెను.

పార్వతియు క్షణమాత్రము పుత్రశోకమనుభవించి నంతలోనే, తోక త్రొక్కిన త్రాచువలె లేచి, తన పుత్రుదల ఇనుమడింప ముల్లోకముల విరాధివిరులు దండెత్తి వచ్చి బాలుని సంహరించిరను కడుపు మంటతో ఖంజ, కాళి, కరాళి, బగళ, విలంబ, మస్త, ధూమవతి, మాతంగి, కుబ్జ, మున్నగు శక్తుల కోటానుకోట క్షణమాత్రమున సృష్టించి కనిపించిన వేల్పులనెల్ల సంహరించి ముల్లోకముల దగ్గమొనర్ప పంపించెను.

ఆ శక్తులును పార్వతి వరప్రసాదమున తమశక్తి కెదురులేని వారై ప్రమథులను, దేవతలను సంహరించుచు ముల్లోకముల దగ్ధమొనర్చుచుండిరి.

బ్రహ్మవిష్ణు మహేశ్వరులు ముప్వురును ఇతికర్తవ్యతా మూఢులై చిట్టచివరకు నారదోపాయమున జగజ్జననిశక్తి కెదురు లేదనీ, ఆ తల్లిని ప్రార్థించి ప్రసన్నురాలిని జేసికొనిననే గాని ఉపద్రవము చల్లారదనీ గ్రహించినవారైరి. కాని రౌద్రరూపమును ధరించిన రుద్రాణి చెంత కరుగుట కొక్కరును సాహసించరైరి. మరల నారదుని ప్రేరణమున సప్తఋషులను శాంభవి కడకు రాయబార మంపుటకై సిదపడిరి. సప్తఋషులను రావించి, జరిగిన వృత్తాంతము నివేదించి లోక కళ్యాణార్థము శాంకరి తిక్రతను శమింపజేయ మీరే సమర్థులని ప్రార్థించిరి. లోకహితార్థము సప్తఋషులు నారదునితో గూడి పార్వతి కడకేతెంచిరి. ముందు ప్రార్థనల పార్వతిని ప్రసన్నురాలినిగా జేసికొని శక్తుల నుపసంహరింపవలసినదనీ, లేనిచో సర్వలోక నాశనమగుననీ వేడికొనిరి.

అంత నా ఉగ్రస్వరూపిణి సప్తఋషుల వేడికోలు నాదరించి తన కుమారుని పునరుజ్జీవితుని జేసి వానిపై దండెత్తిన ముల్లోక నాయకులును, ముక్కోటి దేవతలును, ప్రమథగణమును, నందికేశ్వర చండీశ్వరాదులును నా బిడ్డని సమ్మానముతో గొలుచునెడ శక్తుల నుపసంహరింతునని చెప్పెను. అంత నా ఋషులుపోయి ఆ విషయమును దేవదేవున కెరిగింప శివుడును ప్రమథగణమునకు అన్ని దిక్కులకేగి తొలుత నేజంతు వగపడునో దాని శిరసు దెగవేసి దెచ్చి ఈ బాలుని కళేబరమున కతికింపుమని ఆజ్ఞాపించెను. ఆదేశ ప్రకారము ప్రమథగణ మరిగి తొలుత నొక గజము కనుపింపగా దాని శిరమును ఖండించి తెచ్చి బాలుని కళేబరమును నీటుశుభ్రపరచి ఏనుగుశిరము నతికించిరి. పరమశివుడును కృపామయుడై తన అమృతాంచిత దృష్టిబాలుని పై పరుప బాలుడు పునరుజ్జీవితుడయ్యెను.

పార్వతి శాంతించి తన శక్తులనన్నిటి మరల్చి లోకశాంతిచే కూర్చి బాలునెత్తుకుని ముద్దాడి లోకేశునంకతలంబున గూర్చుండబెట్టెను. అంత పరమేశుడును బిడ్డని ముద్దాడి సర్వశక్తి సంపన్నుండై ముల్లోకముల నల్లాడించిన నీ బాలుడు ప్రమథగణములకీశుడై వెలయునని త్రిశూలము నిచ్చి, చిరాయువు గమ్మని దీవించి బ్రహ్మవంక జూడ, నా విధాత ఈశ్వరు మనం బెరింగి వేదవిహిత ప్రకారము నాగణేశునకు ఉపనయనాది క్రియలాచరించెను పిమ్మట గణేశుడు అందరికి నమస్కరించి దీవనల గ్రహించెను.

బాలుడు గణముల కీశుడు, అనగా ప్రభువు గాన, గణేశుడు, గణపతి అను నామముల పిలువబడుచున్నాడు.

పిమ్మట పరమేశ్వరుడు బిడ్డని చేరదీసి 'నేనును విష్ణువిధాతలును సమస్తదేవ, మానవకోటితో యెల్లు సన్మానములందెదవు. అట్లే నీవును పూజింపబడుదువు. ఆదిని నిను పూజించినవారి అఖిల కార్యములును దిగ్విజయముగా సమకూరగలవు! అని దీవించెను.

ఇట్లు ముక్కోటి దేవతల గడగడలాడించిన సిద్ధివినాయకుడు దొడ్డనాయకుడు మాత్రమే గాక సమయోచితబుద్ధియందు అగ్రగణ్యుడు.

పరమశివుడొకనాడు ఇద్దరు కుమారులను రావించి మీలో భూప్రదక్షిణ మొనరించి యెవ్వరు ముందరగ వత్తురో వారికి పట్టము గట్టెదనన పరియని ముందు కుమారస్వామి బయలుదేరెను. కుబ్జదేహుడగుటచే గణేశుడు తానెట్లును భూప్రదక్షిణచేసి కుమారస్వామికన్న ముందురాలేనని తలంచి సమయోచిత బుద్ధిగలవాడు గనుక తల్లిదండ్రుల పాదములు కడిగి నీటిని నెత్తిపైచల్లుకుని వారిరువురి చుట్టును ఇరువది యొక్క మార్లు ప్రదక్షిణ మాచరించి వచ్చితోనే భూప్రదక్షిణ మొనరించి ముందు వచ్చితినని తనకేపట్టము గట్టవలెననీ తండ్రినడిగెను. పరమశివుడు ఆశ్చర్యపడి 'నీవెట్లు భూప్రదక్షిణ మొనరించి వచ్చితి' వని అడుగ తల్లిదండ్రుల పాదజలమునకు సరియగు పవిత్రజలము లేదనీ తల్లిదండ్రులతో పాటియైన దైవము ముల్లోకముల లేదనీ తల్లిదండ్రులను ఇరువది యొక్క మారుచుట్టివచ్చిన ఒక భూప్రదక్షిణముతో సమానమని పురాణములు ఘోషించుచున్నవనీ కావున నేనే ముందు భూప్రదక్షిణ చేసి వచ్చిన వాడననీ పలుక నా దంపతులు అచ్చెరువంది గణేశునకు పట్టము గట్టిరి.

పిమ్మట విశ్వరూప ప్రజాపతి తన సిద్ధి, బుద్ధి, అను ఇరువురు కూతుళ్లను గణపతికిచ్చి వివాహము చేయ పరమశివుని అనుజ్ఞ వేడెను. శివుడు అంగీకరించెను. గణపతి యా ఇరువుర పెండ్లాడి వారిలో సిద్ధియందు క్షేమాఖ్యుడు, బుద్ధియందు అమరలాభాఖ్యుడు అను ఇద్దరు పుత్రులను బడసెను.

ఇట్లు గణపతి ముక్కోటి దేవతల కారాధ్య దైవమై వుండ సౌందర్యమున సాటిలేనివాడనని గర్వముతో నున్న చంద్రుడు దేవతలముందు, వినాయకుని రూపముజూచి నీచముగా బలికి పరిహసింప వినాయకుడు ఆగ్రహావేశుడై 'నిన్ను జూచినవారు అపనిందలపాలగుదురు గాక' అని శపించెను. అంతతో కంగారుపడిన చంద్రుడు గణపతి పాదముల పడ కరుణించిన గణపతి భాద్రపదశుద్ధ చవితినాడు నా పూజను చేసినవారికి నిన్ను జూచినను ఏ అపనిందలూ రావని పలికెను.

పిమ్మట ఇంద్రుడు వృత్రాసురుని వధింప బోవునప్పుడు, రాముడు రావణునిపై దండెత్తునపుడు, భగీరథుడు గంగను దెచ్చునపుడు, దేవాసురులు అమృతమునకై సముద్రమథన మొనరించునపుడును, సాంబుడు తన కుష్ఠరోగము తొలగుటకును ఈ వినాయకుని గొలిచి జయమును పొందిరి.

చవితిచంద్రుని జూచిన కృష్ణుడు అపనిందపాలై మరల వినాయకుని పూజించి శమంతకమణి సంపాదనతోపాటు సత్యభామా జాంబవతులను పరిణయమాడెను.

అట్టి వినాయకుని భాద్రపదశుద్ధ చవితినాడు యథావిధిగా పూజించి ఉండ్రాళ్లను నైవేద్యము పెటి ఆరోజున వినాయక కథా వృత్తాంతము నాలకించినవారికి సకలైశ్వర్యములు కలిగి ఆచరించు సత్కార్యములన్ని సందేహములేకుండ సిద్ధింపగలవు. విద్యనారంభించునపుడు సిద్ధివినాయకుని గొల్చిన విద్య బాగుగవచ్చును. జయము గోరువాడు గొల్చిన తప్పక విజయము కలును. ★

# అత్తగారూ అరటికాయపొడి

## — భానుమతీ రామకృష్ణ —

"రేపు నిజ శ్రావణంలో వచ్చే వరలక్ష్మీ వ్రతం నాటికి, గెలతో బాటు పిలకల్ని కూడా వేయాలి అరటి చెట్టమ్మా" అంటూ మా అత్తగారు పెరటివేపు తులసికోట వెనక వున్న ఖాళీస్థలంలో మంచి అరటికాయలు కాచే అరటిమొక్క ఒకటి నాటారు... మడిలో వున్నారు గనక మడినీళ్ళే ఓ బిందెడు ఆ అరటిచెట్టుకు పోశారు ఆయుర్దాయం పోసినట్టు—అపక్కనే పందికొక్కు తవ్వి పడేసిన కరివేపాకు మొక్కను పదహారో సారి పాతి తిరిగీ ఆ మొక్కకు మడినీళ్లతో ప్రాణప్రదానం చేశారు.

అసలు మా అత్తగారి చేతిమీదుగా ఏదైనా చెట్టూ చేమా నాటితే, పూతా, పిందె సమృద్ధిగా కలిగి చిరంజీవిగా వర్ధిల్లుతుందని మా అత్తగారియొక్క అవ్వగారు అంటూండేదని మా అత్తగారు అంటూటారు అప్పుడప్పుడూ.

కాని మా పెరట్లో చాలాకాలంగా వున్న కాయలుకాయని నాలుగు అరటిచెట్లూ మా అత్తగారు నాటినవే–బహుశా వాటికీ ఈ సంప్రదాయం తెలిసిఉండదు.

ఆ చెట్లు కాయలుకాయని కారణం ఏమిటని మా అత్తగారిని అడిగితే, ఆమె ఒక్క చిరునవ్వునవ్వి "అవి కాయలుకాచేజాతి అరటికాదర్రా... ఒట్టి ఆకులకోసమే వేశాను" అని శెలవిచ్చారు–కాబోలు అనుకున్నాను.

కాని మా పెరటో వున్న కాయలు కాయని అరటిచెట్లయొక్క పిల్లల్ని నాలుగు వీధుల అవతలవున్న తెలిసినవాళ్ళు తీసికెళ్ళారు వాళ్లి పెరట్లో నాటి పెంచుకోడానికి. కొన్ని మాసాంతర్వాత ఒకరోజు వాళ్ళింటి నుండి కొన్ని నవనవలాడే మంచి అరటికాయలు పంపించారు పనిమనిషి చేత–ఎక్కడివని విచారిస్తే, "మీ యింటినుంచి తీసికెళ్ళిన అరటిచెట్ల కాయలేనమ్మా" అన్నదా పనిమనిషి... నేను తెల్లబోయాను. పనిమనిషి చెప్పింది వంటింట్లోవుండే విన్న మా అత్తగారు కాసేపు అక్కడే పనిగా వుండిపోయారు, ఆ పనిమనిషి వెళ్ళిపోయిందాకా...తర్వాత చాలాసేపటికి వంటింట్లోంచి బయటికొచ్చారు.

"పనిమనిషి చెప్పింది విన్నారా?" అన్నాను. "ఆహా...విన్నాను—అదే ఆలోచిస్తున్నాను...బహుశా ఆ నాలుగు అరటిచెట్లూ మన పెరట్లో కాయలు కాయకపోవడానికి కారణం భూదేవి." అన్నారు మా అత్తగారు సీరియస్‌గా ముఖంపెట్టి... రెండవకారణం నీరుపారుదల చాలదు అన్నారు...యీసారి మా అత్తగారు చెప్పిందానిమీద నాకు నమ్మకంకలగలేదు...అసలా అరటిచెట్లు కాయలు కాయకపోవడానికి ఒకవిధంగా మా అత్తగారే కారణం... తెరిపి లేకుండా, తల్లులూ, పిల్లలతోసహా మా అత్తగారి భోజనానికి ఆకులు అందించడంతోనే సరిపోయిందా అరటిచెట్ల జీవితం... కాయలుకాచే అవకాశం మా అత్తగారు యివ్వందే!...రెక్కలుతెగిన పక్షుల్లా నిలబడ్డ ఆ అరటి స్తంభాల పాలిటి మరొక రాక్షసుడుకూడా వున్నాడు. వాడు, 'వాడేవీడు' లాంటి మా వంటవాడు—పేరు అప్పలు... పూర్తిపేరు అప్పలాచారి...మా అత్తగారే వాణ్ణి ముద్దుగా అప్పలూ అంటారు–మేమంతా వాణ్ణి చారీ, చార్లూ, చారూ, చారీ, వగైరా లోకపేర్లతో పిలుస్తుంటాం...అప్పలు, ఒట్టి ఆచారిమాత్రమే కాదు బ్రహ్మచారికూడా... తనను పెళ్ళాడాల్సిన మేనమామకూతురు పెళ్ళాడనని ఖచ్చితంగా చెప్పేసిందట... చెప్పడమే కాదు "అసలు నీలాంటి అడంగి వాడికి పెళ్లి అనవసరం—ఏ పిల్లనో పెళ్ళాడి, దాని జీవితం నాశనంచేయక, ఎక్కడో చోట వంటచేసుకుని బ్రతుకు"—అని మా వాడికి సలహాకూడా యిచ్చిందట... "మరి పెళ్ళిలేకుండా జీవితాంతం బ్రహ్మచారిలా వుంటావుట్రా! ఎవరో ఒక పిల్లని చూసి పెళ్ళాడాలిగాని"...అంటూ మా అత్తగారు అంటే "నాకెవరు పిల్లనిస్తారమ్మా ...నన్నెరూ తెలిసినవాళ్ల యిళ్ళల్లోని పిల్లలు చేసుకోరు..."అని కండ్లు తుడుచుకునేవాడు మా అప్పలు ఆడదానిలా—

"ఛీ పిచ్చికుంకా! నీకేంరా విశేషంలా వున్నావు...వుండు నేను విచారిస్తాను ఏదైనా సంబంధంవుందేమో...అంటూ మా అత్తగారే అప్పలు పెళ్లి బాధ్యత అమాంతంగా నెత్తిన వేసుకున్నారు ఒకరోజు...

ఆనాటినుండీ అప్పలు మా అత్తగారి యొక్క భక్తుడూ, భృత్యుడూకూడా—ఆమె కష్టపడకుండా అన్ని పనుల్లోనూ సహాయపడుతుండేవాడు—ఒక్క వంటపనిలోతప్ప.

ఆమె సంతోషిస్తుందని ప్రొద్దుటే పూజా మందిరం ముందుకూర్చుని భక్తిగా సుప్రభాతం చదివేవాడు...

వంటయ్యాక మా అత్తగారి కెదురుగా కూర్చుని సంగీతం పాడేవాడు. యింతాచేసి చివరకు భోజనాలదగ్గిరి కొచ్చేసరికి అరిటాకుల విషయంలో మా అత్తగారిని మోసగిస్తుండేవాడు. ప్రతిరోజూ మా అత్తగారికంటే ముందేవెళ్ళి వుండేవాటిల్లో మంచి అరిటాకు కోసుకొచ్చుకుని దొంగతనంగా అటక మీద దాచేవాడు. వంటా గింటా ముగించుకుని తీరిగ్గా అరిటాకు కోసం కత్తి పట్టికెళ్లేవారు మా అత్తగారు... అంతకు ముందురోజు ఆమె చూసిన మంచి అరిటాకు కనబడేదికాదు... వెంటనే ఆవిడ పెరట్లోంచే గర్జించేది... "ఒరేయ్ అప్పలూ దొంగవెధవా! వున్న ఒక్క అరిటాకూ



కోసుకెళ్ళావుట్రా .... యిప్పుడు నాగతే మిట్రా!..." అంటూ

"అ-కోసుకోనిరాక ఏమ్ చేయమంటారు. మంచి ఆకులన్నీ మీరుదా కోసే నాగతీ చూసిదానే కావాల..." అని అప్పలు తనలో తను సణుక్కుంటూ వుండడం ఒక సారి వంటింటివేపువెళ్లిన నేను విన్నాను... అప్పలు నన్ను చూసి తెల్లబోయాడు... వికిలినవ్వునవ్వుతూ మాట మార్చాడు... చూస్తిరా అమ్మా! పెద్దమ్మగారు నామీద నిందా అభాండం వేస్తారూ... ఆమెకోసందా అరిటాకు కోసికొచ్చి అడపామీద వుంచి వుంటె..."

నిజం మా అత్తగారికి తెలిస్తే అప్పలు డేంజర్లో పడతాడు... ఏదో సంబంధం చూసి అప్పలు పెళ్ళిచేయిస్తానంటున్న మా అత్తగారి ఔదార్యానికి మధ్య అరిటాకు పేచీవస్తే, అప్పలుకు పెండ్లికంటె ముందు "అంపకాలు" జరుగుతుంది... నేను చూసీ చూడనట్లు వినీ విననట్లు వూరుకున్నాను.

సుమారైన అరిటాకు కోసుకుని మా అత్తగారు వంటింటోకి వస్తూండగానే ఎటూ దొంగతనం బయట బడ్డదిగదా అని అటకమీద దాచిన అరిటాకును "మీకోసందా కోసి తెస్తినమ్మ" అంటూ ఎంతో శ్రద్ధాభక్తులతో మా అత్తగారికి సమర్పించాడు అప్పలు ... వెంటనే మా అత్తగారిముఖం అరిటాకంతయింది ... మంచి అరిటాకు దొరికిందన్న సంతోషంలో అప్పలుమీద కోపాన్ని మర్చిపోయి కృష్ణా అంటూ ఆకువేసుకుని భోజనానికూర్చున్నారు మా అత్తగారు—

అలవాటు ప్రకారం మా అత్తగారువీపు ప్రపంచంవేపుతిప్పి, తను గోడవేపు తిరిగి ఆకు వేసుకు భోంచేస్తున్నారు.

ఆమె యెదురుగా వున్న గోడలో ఎర్రైనా ఏ నరసింహావతారమో ఎత్తి ఆమె ఏం భోంచేస్తోందో తిలకిస్తే తప్ప మానవమాత్రులకు ఆమె ఏం వంటచేసుకుందో తెలియనివ్వదు.

పోనీ కమ్మని కరివేపాకు తాళింపు ఘుమఘుమలనుబట్టి అయినా ఆమె ఆ పూట ఏం వంటచేస్తోందో పసికట్టవచ్చు కొంత వరకూ—యితర్ల ముక్కులదాకావస్తే మైల పడుతుందని మా అత్తగారు తను వేసే తాళింపును కూడా ఆచారపు హద్దుల్లో వుంచేది... కాని ఆమె భోంచేసేచోట వున్న మడి వూరగాయల జాడీల్లోనుంచి వచ్చే రకరకాల వాసనలనుమాత్రం ఆమె అరికట్టలేకపోయేది ... వంటింటి గడపదాటి ముందు హాల్లోదాకా ఏమిటేమిటో వాసనలు గుబాళించేవి మా అత్తగారి మడి వూరగాయల జాడీల్లోంచి ... ఒకసారి మా అత్తగారు

# ★ అత్తగారూ అరటికాయ పొడీ ★

భోజనానికి కూర్చున్నప్పుడే మా వారూ, భోజనానికి కూర్చోడం తటస్థించింది.

మరి ఆవిడ భోజనానికి కూర్చోబోతూ ముడివూరగాయలుండే జాడీలు కదిలించారో ఏమో గుప్పున ఏవేవో వాసనలు మావారి ముక్కులదాకా దూసుకొచ్చాయి.

"అబ్బ ... ఏమిటీవాసన! బత్తాయిపండ్లు ఏ మేనా కుళ్ళిపోయాయా! ... కాదే... ఉండుండు ఏదో వాసన ... పెరటి వేపు అంట్లు తోమేచోటు రోజూ పనివ్వునిషి శుభ్రంచేయడంలేదా! ... ఏంచేస్తున్నావ్ యింట్లో కూర్చుని ..." అంటూ నన్ను కోప్పడ్డారు మావారు.

అదేంకాదని నచ్చచెప్పేసరికి తలప్రాణం తోక్కొచ్చింది. భోంచేస్తుండగానే మా వెనకనుండి మా యిద్దరి కంచాల్లోనూ ఏదో వల్లటిపదార్థం టప్పున పడ్డది.

ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాను. మా అత్తగారు ముసిముసి నవ్వులు నవ్వుతూ చేతిలో గిన్నె పట్టుకుని 'క్వశ్చన్‌మార్క్' లాగా నించున్నారు.

"ఏమిటమ్మాయిదీ?" అన్నారు మావారు వూరుకోక.

"కనుక్కోరా చూదాం.." అన్నారు మా అత్తగారు నవ్వుతూ.

"అబ్బో నీవంట ఏది ఏదో కనుక్కోడం నా చేత కానిపని" అన్నారు మావారు. నాకు నవ్వొచ్చి పొరబోయింది.

"పోనీ నువ్వైనా చెప్పవే చూదాం." అన్నారు మా అత్తగారు నా భుజంపట్టి కుదుపుతో ... విషమ సమస్య ... ఏం చెప్పేది! కంచంలో వడ్డించిన వెంటనే కమ్మటి వాసన రావడానికి బదులు అప్పుడే నాలుగు వర్షం కుంపర్లుపడి భూమి తడిసిన తర్వాత వచ్చే మట్టివాసన గుబాళిస్తోంది ఆ పదార్థంలోంచి.

పోనీ చింతపండా అంటేకాదు — కాకుండాను పోలేదు - చింతగింజ ఒకటే నేనున్నానని తొంగి చూస్తోంది ఆ పదార్థంలోంచి...యిక చింతపండు పచ్చడే నని తీర్మానిద్దామా అంటే ఏవో తాళ్ళు తాళ్ళుగా కనిపిస్తున్నాయా పదార్థంలో. ఏదో ఒకటి చటుక్కున చెప్పేసి అత్తగారి ముందు అవమానం పాలు కాకూడదని నా బాధ.

"పోనీ నువ్వుకాస్త నోట్లో వేసుకుని రుచిమాసి చెప్పరా" అన్నది మా అత్తగారు కొడుకు నుద్దేశించి.

"అబ్బే అదెట్లా - నీ కోడల్ని అడిగావు ముందు నీకోడల్నే చెప్పమను...అదేం పదార్థమో తేలిందాకా నేను ముట్టుకోను" అని తప్పుకున్నారు దొంగ.

"యీలోపుగా మీ భోజనాలే పూర్తయ్యేట్లున్నాయే—" అన్నారు మా అత్తగారు.

"మరీ మంచిది...అసలా పదార్థం ఏమిటో నీ కోడలు కనుక్కుంటుందో ఓడిపోయానని ఒప్పుకుంటుందో కనుక్కో" అన్నారు మావారు నన్ను ఏడిపించడానికి.

"బాబూ నేను ఓడిపోయాను...నిజంగానే నాకు తెలీలేదత్తా" అన్నాను.

అంతవరకూ నవ్వు బిగబట్టుకుని వడ్డిస్తూన్న అప్పులు నేను ఓడిపోయాను అనేసరికి ముప్ఫయి రెండు గొగ్గిరి పండ్లూ బయట పెట్టి నవ్వాడు. "హాయ్యో అదేం నిండాకష్టమని అమ్మగారూ... నన్ను చెప్పమంటురా! ఆపతార్థం ఏమని..!" అన్నాడు సింగరాయకొండలో పుట్టి శ్రీరంగంలో పెరిగిన మా అప్పులు—

"చెప్పరా-" అన్నారు మావారు; ఆ వల్ల పదార్థాన్ని మా అత్తగారు చూడకుండా అప్పడంకిందకితోస్తూ—అప్పులు నిర్లక్ష్యంగా నవ్వుతూ తేలిగ్గా "వంకాయ పెచ్చెడి" అన్నాడు—ఫక్కున నవ్వేసరికి మావారికీ నాకూకూడా పొరబోయి దగ్గొచ్చింది—శబ్దంలేకుండా మూతిమీద వేలేసుకుని మా అత్తగారుకూడా కాసేపునవ్వి...

"ఓరి నీతాడు తెగా వంకాయ కాదురా వంకాయ అని ఎన్నిసార్లు చెప్పాన్రా— యిన్నాళ్ళుగా మాయింట్లో వంట చేస్తూ యింకా నీకు తెలుగు సరిగావచ్చి అఘోరించలేదమిరా పిచ్చికుంకా..."అని మందలించారు - అప్పులు సిగ్గుపడ్డాడు—

"పోనీ యిప్పుడైనా తినండ్రా. పచ్చడి పేరు తెలిసిందిగా—"అన్నారు మా అత్తగారు—

"అయ్యో నాకు సయించదీ పచ్చడి-"అని తప్పుకున్నారు మావారు—

"అదేవిట్రా చిన్నప్పుడు ఆ చెంచురాక్షసిచేస్తే తినేవాడివిగదూ యీపచ్చడి" అన్నారు మా అత్తగారు కాస్తచిన్నబుచ్చుకుని.

చెంచురాక్షసి అసలుపేరు చెంచులక్ష్మమ్మ మా అత్తగారి చిన్నవాడబడుచు-ఎంతో మంచిదని మావారు చెబుతూంటారు. భర్త పోయాక మామామగారిదగ్గరే వుండి వంటవండి పెడుతూ మావారిని తల్లికంటే ఎక్కువగా సాకిందట. ఆమె పోవడం, మావారు కాలేజీలో చేరడం హోటలు భోజనం చేయడం అన్నీ ఒకేసారి జరిగాయట. వాళ్ళమ్మ వంటచేసి తను భోంచేసింది వేళ్ళమీద లెక్కించవచ్చంటారు మావారు... చెంచ త్తమాట రాగానే మావారి ముఖం గంభీరం అయిపోయింది.

"నిజమే చెంచత్త వంకాయపచ్చడి చేస్తే ఎంతయినా తినేవాడిని...అరిటికాయ పొడి అంటే నాకెంతో ఇష్టమని తరచుగా అరటికాయ పొడి చేసిపెట్టేది"—అన్నారు మా వారు చిన్నప్పటిరోజులు జ్ఞప్తికి తెచ్చుకుంటూ.

"ఓరి తిక్కన్నా...అరిటికాయ పొడి చేయడం ఏమంత భాగ్యంరా...నీకిష్టమని తెలిస్తే ఈపాటికి ఎన్నోసార్లు చేసిపెట్టే దాన్ని. రేపోమాపో చేస్తానే అరిటికాయ పొడి"...అన్నారు మా అత్తగారు ప్రేమతో.

మావారు హడలిపోయారు. "అబ్బే... ఒద్దమ్మా...వూరికే అన్నాను" అని తప్పుకోడానికి తంటాలు పడ్డారు.

మా అత్తగారు విడిచిపెట్టలేదు – "నీవు వూరికే అను, నిజంగా అను, మనఅరిటిచెట్టు కొత్తగా గెలవేసింది - మొదట మొదట ఆకాయలుకోసి నీకోసం అరిటికాయ పొడి చేయబోతాను—సరేనా?" అన్నారు మా అత్తగారు.

"యిప్పు డొద్దులేమ్మా ... ఎవరైనా

బంధువు లొచ్చినప్పుడు చేద్దువుగానిలే అరిటి కాయ పొడి" ...అన్నారు మా వారు ఏమీ తోచక తికమక పడుతూ

"బాగుందిరా నువ్వనేది! అరిటి కాయ పొడికోసం బంధువుల్ని రమ్మంటావా ఏమిటి తెలీకడుగుతా. అరిటికాయ పొడంటే నీకిష్టమన్నావు గనక నీకోసమే ముందొక సారి అరిటికాయపొడి చేస్తాను. చుట్టా లొస్తే మళ్ళీ చేసుకోవచ్చు. అరిటికాయ పొడికేం భాగ్యంరా..."

ఆ సమయంలో మా వారి అవస్థ చూస్తే నాకే జాలివేసింది...

ముజ్జిగన్నంకూడా సరిగా తినకుండా చేయి కడుక్కోడానికి లేచారు ......

"అయినా మీ కెందుకు అనవసరంగా శ్రమ ...అప్పలుచేత చేయించండి అరిటికాయ పొడి..." అన్నాను మా వారిని ఆపదనుండి కాపాడానికి.

"అయ్యో నెత్తిరాత! అప్పలికీ అరిటి కాయపొడికీ ఆరువందల మైళ్ళ దూరం అని నీకుమాత్రం తెలీదా ఏమిటే! అయినా నాకేం శ్రమగనకా! నా కోసం కావాలంటే పొడిచేసుకోనూ!" ... అంటూ పచ్చడిగిన్నె అప్పలుచేతికిచ్చి పెరటి వేపు వెళ్ళారు మా అత్తగారు—

* * *

చేయి కడుక్కొని మూతి తుడుచుకుంటూ వచ్చిన మావారు నా చెవులో "త్వరగా చేయికడుక్కొని రా — నీతో ఒకమాట చెప్పాలి" అంటూ మేడమీది కెళ్ళారు. చేయి కడుక్కొని అంట్లగిన్నెలు పనిమనిషికి వేయమని చెప్పి, పాందాను తీసుకుని పైకి వెళ్ళాను.

ఏదో ఆలోచిస్తూ వాలుకుర్చీలో నడుం వాల్చి వాసాలు లెక్క పెడుతున్నారు మావారు—

నన్ను చూడగానే చివాలున లేచివచ్చి పాందానులోని వక్కపొడి కొస్త తీసి నోట్లో వేసుకుంటూ—"చూడూ నిజంగానే రేపు మా అమ్మ అరిటికాయపొడి చేయబోతోందా" అన్నారు భయపడుతూ—

"ఆహా—ఆమె అన్నంతా చేసితీరుతుంది—మీరు తిన్నదాకా విడిచిపెట్టదు కూడా"—అన్నాను వచ్చే నవ్వు ఆపుకుంటూ—

"బాబోయ్ అయితే నేను రేపు ఇంటికి భోజనానికి రాను...నా స్నేహితు డెవడో గృహప్రవేశం కాబోతున్నాడు- వాడింటో భోంచేస్తాను రేపు-ఆ సంగతి మా అమ్మకు చెప్పు...ముందె చెప్పక-ఆమె అరిటికాయ పొడి చేశాక చెప్పు"—

నాకు నవ్వొచ్చింది మావారి చాదసానికి-

"ఏమీ లాభంలేదు—రేపు తప్పించుకుంటే ఎలుండి! ఆ తర్వాత! అరిటిగెలలో కాయ లున్నన్నాళ్ళూ మీరుతప్పించుకోలేరు—" అన్నాను—

"ఆ గెలలో ఎన్ని కాయ లున్నాయేమిటి! నా ప్రాణానికి. ." అన్నారు భయపడుతూ—

"కనీసం యిరవై, ముప్పయి—"

"చచ్చాన్రా దేవుడా—అంటూ వాలు కుర్చీలో కూలబడ్డారు—కాసేపుండి "ఆ—అయిడియా చూడూ! నేను చెప్పినట్లు చేస్తావా!" అన్నారు లేచి కూర్చుంటూ—

"ఏంచేయాలి! అన్నాను"

"మరేంలేదు. ఆ అరిటిగెల కోసేసి ఎవరికైనా దానం చేసెయ్...నన్ను రక్షించిం దానివవుతావ్" అన్నారు మావారు ప్రతిమాలుతూ.

"బాబోయ్! మీఅమ్మ బ్రతికుండగానే! ఆమె చూసిందంటే..."

"ఆమె చూడకుండానే ఆ గెలకోసి నా కారువెనక డిక్కీలో పడేయ్ — ప్రొద్దుటే వెళుతూ వెళుతూ మన పక్కింటి భాస్కరం గారింట్లో పడేసిపోతాను..." అన్నారు

పోనీ ఆదేదో గృహప్రవేశానికి వెళ్ళాలన్నారుగా రేపు వాళ్ళింటికే పట్టికెళ్ళండి"- అన్నాను.

"అది రేపు కాదులే...వచ్చే శుక్రవారం."

"మరి భోజనానికి వెళ్ళాలన్నారుగా రేపు..."

"ఏం! హోటళ్ళు లేవూ!"—

"అయ్యో ఏం ఖర్మం అండీ హోటల్లో భోంచేయడానికి...పోనీ దూరంగా వున్న తెలిసినవాళ్ళింటికెవరింటికైనా పట్టుకెళ్ళి యివ్వకూడదూ ఆగెలను?

"ఏం పక్కింటివాళ్ళేం పాపం చేశారు!" అన్నారు మావారు—

"పొరపాట్న మీ అమ్మకు తెలిస్తే..."

"నిన్నెవరు చెప్పమన్నారు ఆమెకు- అంతగా గొడవచేస్తే గృహప్రవేశానికే పట్టికెళ్ళానని చెప్పు...గృహప్రవేశం ఎప్పుడో, ఏమిటో ఆమె అడగొచ్చిందా ఏమిటి... ఏం! సరేనా," అన్నారు నా సమాధానం కోసం...

"అలాగే" అన్నాను. చివర్న మావారు చెప్పింది నచ్చింది.

"కానీ చీకటితో లేచి అరిటిగెల కోసి కార్లో పడేస్తాను...మరి మీ అమ్మ లేచే ముందే మీరు కారు తీసికెళ్ళిపోవాలి... లేకపోతే చిక్కొస్తుంది" అన్నాను తొమ్మిదింటికి నిద్రలేచే మా వారికి వార్నింగ్ యిస్తూ—

"ఓ యస్ అలాగే-అలారంపెట్టు అయిదింటికి...అన్నారు ఆవలిస్తూ—

* * *

మర్నాడు తెల్లారుగట్ల, అలారంమోతకు అదిరిపడి లేచాను. మావారు మంచి గుర్రుపెట్టి నిద్రపోతున్నారు, అలారం పెట్టమన్న పెద్దమనిషి...అరిటిగెల కోసిందాకా మా వారిని లేపదల్చుకోలేదు...

చప్పుడుకాకుండా మేడదిగివెళ్ళి పెరట్లో ఓమూల గుడిసెలోవున్న తోటవాడు ఏడుకొండల్ని పిల్చాను నెమ్మదిగా 'ఎవరది' అంటూ గుడిసెలోంచి దూసుకొచ్చాడు ఏడుకొండలు...నన్ను చూసి కళ్ళు నులుపుకుంటూ "అమ్మగారా!" అన్నాడు ఖంగారు పడుతూ..."ఉస్...అరవక మాడూ కత్తి తీసుకుని నావెంటరా" అంటూ ముందుకునడిచాను డిటెకివ్ నవల్లోని విలన్‌లాగా...

ఏడుకొండలు కత్తి తెచ్చాడు అందంగా వున్న ఆ అరిటిగెల కోయించేసెయ్యడానికి నా మనస్సు ఎంతో బాధపడ్డది. ఆనాడు పితృవాక్య పరిపాలనకోసం పరశురాముడు తల్లిని నరికేసినట్లు భర్తృవాక్యపాలన కోసం



# ★ అత్తగారూ అరటికాయ పొడీ ★

నేనా అరటిగెలను కోయించక తప్పలేదు... కోయించిన గెలను కార్లో పెట్టించి మళ్ళీ చప్పుడుకాకుండా మేడమీదికెళ్లాను... మావారు బ్రహ్మాండంగా గురకపెడుతున్నారు... యింక నేనే ఒక అలారంగాక తప్పలేదు...

పులిక్కిపడి లేచారు. "లేవండి త్వరగా అరటిగెల కోసేశాను."

'ఎందుకూ!' అన్నారు నిద్రమత్తులో...

'ఎందుకేమిటి! మీరేగా కోయించమన్నారు. త్వరగా లేచి తీసికెళ్లి పక్కింటి వాళ్ళకిచ్చిరాండి... కార్లో పెట్టానుగెల—'

"అబ్బ..నీవే తీసికెళ్ళి యివ్వు...నన్ను డిస్టర్బ్ చేయక నిద్రోస్తుంది..."అని అటు తిరిగి పడుకున్నారు...

చచ్చాన్రా భగవంతుడా! కథ అడ్డం తిరిగింది—"చూడండీ-మిమ్మల్నే-మీఅమ్మ లేచే టైమయింది.. మీరు ఏమాత్రం బద్ధకించినా మీఅమ్మ చేయబోయే అరటికాయ పొడి తినాల్సివుంటుంది...యీరోజునుండి వరసగా గెలలో కాయలు అయిపోయిందాకా...'

"బాబోయ్....ఇదుగో లేచాను" అంటూ మావారు తేలుకుట్టినట్లు ఉలిక్కిపడి లేచారు... అప్పటికిగాని మావారి నిద్రమత్తు వదలేదు.

పెరటి వేపు తలుపుతీసిన చప్పుడైంది... నా గుండెల్లో రైళ్లు పరుగెత్తడం మొదలెట్టాయి...మా అత్తగారు లేచారు—పెరటివేపు వెళుతూనే అరటిగెల కనిపించకపోతే, ఏడుకొండల్ని కేకేసి అడుగుతుంది. వాడు చెప్తాడు. నన్ను పిలుస్తుంది. "ఏమండోయ్ త్వరగా కారు తీసికెళ్ళండి.. మీ అమ్మ లేచారు" అన్నాను ఖంగారుపడుతూ.

"అయ్యొయ్యొ - యిదుగో వచ్చేశాను" అంటూ ముఖం కడుక్కుని చొక్కా వేసుకొని గబగబ మెట్లుదిగి కిందికెళ్లారు. బెడ్ కాఫీ తీసుకుని అప్పలు ఎదురయ్యాడు...

ఛీ! ఛీ! దరిద్ర శకునం...పోయిందిరా యీరోజంతా ఖరాబ్ నీ శకునంతో అంటూ నాలుగడుగులు వెనక్కి వచ్చి, తిరిగీ మెట్లు దిగి, కారుతీసుకొని గేటు బయటకు వెళ్ళిపోయారు మావారు.

ఉన్నట్లుండి మా అత్తగారి కేకలు మేడమీదకు వినిపించాయి...వచ్చాను యిక నన్ను పిలుస్తుంది...పిలుస్తుందేమిటి...పిలిచింది. "వస్తున్నానత్తా" అంటూ బల్లో కెళ్ళినట్లు పెరటివేపు వున్న మా అత్తగారి దగ్గిరకెళ్ళాను.

"అదికాదు! అరటిగెల అంత తెల్లారకట్ల కోయించాల్సిన అవసరమేమొచ్చింది. కార్లో పెట్టించావట్నే! ఎందుకూ! అసలు కారేదీ"

"మీ అబ్బాయే తీసికెళ్ళారు..."

"మరి కార్లో నీవు అరటిగెల పెట్టిన సంగతి వాడికి తెలుసా?

"ఆ... ఆయనే కోయించి కార్లో పెటమన్నారు. తన స్నేహితుడింట్లో యీరోజు గృహప్రవేశం అట...తీసికెళ్ళారు వాళ్ళకు యివ్వడానికి"...అన్నాను నీళ్లునములుతూ...

"అయ్యొ నెత్తిరాత! శ్రావణశుక్రవారప్పూటా తొలిసారి వేసిన నిక్షేపంలాంటి అరటిగెలను నీ వెట్లాకోసిచ్చావు— వాడెట్లా తీసికెళ్ళాడూ! ... హవ్వ ... అయినా నీవు నన్నెందుకు లేపలేదూ!"...

ఏం చెప్పేది! ... తలవంచుకుని మాట్లాడక వూరుకున్నాను...

అప్పలు చేతులు కట్టుకుని వినయంగా మా అత్తగారిముందు నిలబడాడు...

ఏడుకొండలు అరటిచెట్టు పక్కనే నిలబడాడు తలవంచుకుని దోషిలాగా...

"యింకా చూస్తూ నిలబడ్డావేమిట్రా! గెలకోసిన వెంటనే అరటిచెట్టుకొట్టేయ్యాలని తెలీదూ!"...అని గర్జించారు మా అత్తగారు...

అరటిచెట్టు మొదలంటా నరికేసి పూచలు తీసుకొచ్చి మా అత్తగారి ముందుంచాడు.

"ఎందుకూ యివి! అఘోరించవా! తీసికెళ్లి దిబ్బలో పారెయ్ ... బంగారంలాంటి అరటిగెల వూళ్ళోవాళ్ళకిచ్చి యీ బోడి పూచలు తింటానికా ఇన్నాళ్లూ పెంచిందా అరటిచెట్టును!...ఛీ ఛి...మనుషులకు బుద్ధి, జ్ఞానం అంటూ వుండాలి ... అసలన్నీ వాడి- తండ్రిబుద్ధులే వచ్చాయి ... ఆయనా అంతే ... వార్థం, వర్థం చూడకుండా, ఏదంటే అది యింట్లోనుంచి తీసికెళ్ళి వూళ్లోవాళ్ళకిస్తూండేవారు ... అయినా మాట్లాడో పోట్లాడో ఇది మంచీ, యిది చెడూ, అని చెప్పాలిగాని మరీ మొగుడు ఏది చెబితే దానికంతా తాళం వేస్తూంటే ఎటా! యిదుగో యిట్లాగే వుంటుంది..." అంటూ నాకో రెండు చురకలు తగిలించారు మా అత్తగారు ... తల ఒగ్గాను... వాళ్లబ్బాయికోసం...

ఆ పూట వంట ఆలస్యంగానే ఆరంభించారు మాఅత్తగారు...కొడుకువస్తే నాలుగు చీవాట్లేసి అడగాలని చాలాసేపు ఎదురుచూసిందామె...

మా వారూ రాలేదు, కారూ రాలేదు...

పన్నెండు గంటలయినా మావారు రాలేదు. బహుశా వాళ్ళమ్మకు భయపడి ఏ స్నేహితుడింటికో వెళ్ళివుంటారనుకున్నాను.

* * *

గేటు బయటే కారు ఆపి, చప్పుడు కాకుండా మేడమీదికెళ్లి, ఒక నిద్రపోయి లేచి, తాపీగా స్నానం గీనం ముగించుకుని, బటలు మార్చుకుని, కాఫీ కూడా అడక్కుండా, వాళ్ళమ్మ కంట బడకుండా వుంటే చాలని అడుగులో అడుగేసుకుంటూ మెట్లు దిగివస్తున్నారు మావారు... నేను ఎదురయ్యాను...

"ఆలాగేరా...వెనక్కి వెళ్లకు...మంచి శకునం...చూడూ మా అమ్మ ఇప్పుడెక్కడుంది! కేక లేసిందా!..."అన్నారు రహస్యంగా...

"అదంతా ఎందుకు అడుగుతారు లెండి ....యింతవరకూ మీకోసం కాచుకున్నది మీరు వస్తే నాలుగు చివాట్లేసి అడగాలని... ఇప్పుడే వంటచేసుకోడానికి వెళ్లింది లోపలికి."

"బాబోయ్...అయితే నన్ను త్వరగా వెళ్లనీ..."

"అయితే యింతకీ మీ భోజనమో?"

"హోటల్లో...

"అమ్మో ఏం గ్రహచారమండీ! అరటికాయలు లేవుగా యింట్లో! యీ పూట యింట్లో భోంచేయండి..."అన్నాను బ్రతిమాలుతూ...

"అబ్బ చెప్తే వినవుగదా! అసలే మా అమ్మ కోపంగా వుంటుందిరోజు... ఆమె వెయ్యబోయే ప్రశ్నలన్నింటికీ అబద్ధాలు చెబుతూ కూర్చోవాలి...నా చేత కాదు—మా అమ్మ అడిగితే—వుందిగా గృహప్రవేశం—అక్కడికే వెళ్లానని చెప్పు..."

"ఆ...నాకిదేపని...నేనేనా తీరిగా మీకోసం అబద్ధాలాట్టాని కూర్చున్నాను..! మీ అమ్మచేత చీవాట్లు, సూటిపోటి మాటలు నేను తినలేను...అంతకన్నా అరటికాయ పొడేనా తినొచ్చు......అయినా ఇవాళ కాపోతే రేపు మాత్రం మీరామె కంటబడరా!"...అన్నాను.

"రేపటికి ఆమెకోపం చల్లారిపోతుందిలే —అంటూ మెట్లుదిగి హాల్లో కెళ్లారో లేదో

సాక్షాత్ తిరుపతి వెంకటేశ్వరస్వామిలాగా పట్టెనామాలతోనూ, చేతిలో సంచీతోనూ, ప్రత్యక్షమైనారు మా బావగారు "ఏంరా! అంతా ఖులాసాయేనా!" అంటూ...మా వారు గబుక్కున్నారు..."రా అన్నయ్యా యిదేనా రావడం! యింటిదగ్గర వదిన పిల్లలూ అంతా ఖులాసాగా వున్నారా!" అంటూ వాళ్లన్నయ్యను హాల్లోకి ఆహ్వానించారు. ఎవరో అనుకుని లోపలికెళ్ళిపోయిన నేను మా బావగారి గొంతు గురుపట్టి హాల్లోకొచ్చాను. నన్ను చూస్తూనే "ఏమ్మా బాగున్నావా! మీ అక్కయ్య నిన్ను చాలాచాలా అడిగినట్లు చెప్పమన్నది...పిల్లలంతా నిన్ను చూడాలని కలవరిస్తున్నారు!..." అన్నారు. అవును బావగారూ యింతవరకూ వాళ్ళను మా యింటికి తీసుకురానేలేదు. పోనీ యీ సారైనా తీసుకురాకపోయారా అక్కయ్యనూ పిల్లల్ని...అన్నాను... "ఎక్కడమ్మా నా వుద్యోగంతోనే సరిపోతోంది—యీ సారీ ఆఫీసుపనిమీద వచ్చాను. నాలుగు రోజులు లీవులో—అలాగే మిమ్మల్నీ చూసి వటవుతుందని అనుకున్నాను...అన్నట్లు కక్కి ఏదీ కనబడదేం!" అన్నారు మా అత్తగారికోసం వెదుకుతూ...

"ఆమె వంటింట్లో వున్నారు...పిలుస్తాను"...అంటూ మా బావగారికి కాళ్ళకు నీళ్ళుకూడా తేవడానికి పెరటి వేపు వెళ్ళాను...

అప్పుడే అరిటాకుకోసం కత్తిపట్టుకుని బయలేరారు. మా అత్తగారు. బావగారొచ్చారన్నాను.

"ఎప్పుడూ! యింత పొద్దెక్క ఏంబండి వుందీ"

"ప్రొద్దుటే వచ్చారులావుంది. బహుశా, పాకమ్మవాళ్ళింటికివెళ్ళి వచ్చివుంటారు. అందుకే ఆలస్యమైందనుకుంటాను" అన్నాను.

"అయితే భోంచేయలేదన్నమాట!... అయ్యో నత్తిరాతా...యీపూట ఆ అరిటిగెలే వుంటే లక్షణంగా పొడి చేసేదాన్ని...వాడికూడా అరిటికాయ పొడి అంటే ఎంతో యిష్టం అని మా తోడికోడలు చెప్తుండేది... ఈ పూట వట్టి పత్యంమెతుకులు పెట్టాల్సిందే వాడికి—అరిటిగెల గొడవలో ఈ పూట అప్పులు కూరగాయలు తీసుకురాలా మార్కెట్ నుంచి—ఒట్టి సాంబారుచేసి అప్పడాలు వేయించాడు—నేనూ ఒటి పచ్చడి మెతుకులు చేసుకున్నాను—యిప్పటికే పన్నెండు దాటింది. ఇప్పుడిక కూరగాయలు మార్కెట్ నుంచి తెప్పించీ, వంటచేసీ, వాడికి ఎప్పుడు అన్నంపెట్టడం! అన్నట్లు నీ మొగుడు గృహప్రవేశానికి వెళ్లాడన్నావుగదూ!...ప్రొద్దున కారు తీసికెళ్ళి నవాడింకా రాలేదేం? అక్కడే భోంచేసి వస్తాడా ఏకంగా"?—అన్నారు మా అత్తగారు.

"అవ్వే లేదు-ఇప్పుడే ఆయన వచ్చారు—వెనకాలే బావగారూ వచ్చారు"—అన్నాను.

"అయ్యో నత్తిరాతా!...ఈ పూటే ఇంట్లో కూరగాయలు లేకుండాపోవాలా! సరేనీవువెళ్ళి సింహాడికి కాళ్ళకు నీళ్ళిచ్చిరా. నేనేదో తంటాలుపడతాను"—అంటూ పెరటి వేపు వెళ్లారు మా అత్తగారు-బతికాం అనుకుని మా బావగారి కాళ్ళకు నీళ్ళు తీసుకెళ్లాను.

"కక్కి భోంచేస్తోందా!" అన్నారు మా బావగారు"—లేదండీ మీరు భోంచేశాకే చేస్తుందట అన్నాను.

"అట్లాగా!...అయితే లేవరా పాపం కక్కి మనకోసం కాచుకున్నట్లుంది"... అన్నారు మా బావగారు లేవబోతూ—నా గుండె గతుక్కుమంది. మా అత్తగారి వుత్తరువు లేందే వీళ్ళు భోజనానికి వెళ్లడానికి లేదు—ఆవిడ ఏదో తంటాలు పడతానంది మరి ఇంకాసేపు పడనిస్తే మంచిదనుకుని "లేదు బావగారూ ఆమే పిలుస్తానన్నారు" అన్నాను. "అయితే సరే-నాకేం తొందర లేదు—ప్రొద్దుటే తిన్న టిఫిన్ ఇంకా అరగలేదు—కక్కి కోసం చెప్పాను"—అన్నారు.

"అవునూ అమ్మను భోంచేయమని చెప్పు—అప్పులున్నాడుగా వడ్డనకు? ఇంకా ఆమెందుకూ!" అన్నారు మా వారు—కొంపతీసి వాళ్ళమ్మ ఏ పదార్థమైనా వడ్డించడానికి వస్తుందేమోనన్న భయంతో— "ఆమే స్వయంగా మీకు వడ్డిస్తారట." అన్నాను మావార్ని ఏడిపించడానికి.

"అదేమిటి! భోంచేసిందాకా. అమ్మ మడిలో వుంటుందిగా!" అన్నారు మావారు యింకా సందేహనివృత్తి కాక...

"వుంటారు...అప్పులు వడ్డిస్తుంటే పర్యవేక్షణ చేస్తారు. ఆమె ఏదైనా పచ్చడీ పులుసూచేస్తే మీ కంచాలో ఎత్తిపడేస్తారు." అన్నాను...మా బావగారు పక్కున నవ్వారు...మావారు నన్ను నమిలిమింగేట్లు చూసి మరుక్షణం తనూ నవ్వేశారు—

ఆమాటా యీమాటా మాట్లాడుతూండగానే ఒంటిగంటయింది...లోపల్నుంచి మాఅత్తగారి పిలుపొచ్చింది—నాకోసం... వెళ్లాను వంటింట్లోకి—"చూశావుటే! నా మనసులో ఏదైనా అనుకుంటే అట్లాగే జరుగుతుందని మా అవ్వ అంటుండేదని అప్పుడప్పుడు నేను నీతో అంటుంటాను జ్ఞాపకంవుందా!...యింతకూ ఫస్టైన అరిటికాయ పొడిచేశాను" అన్నారావిడ సంబరపడిపోతూ.

"ఆ!" అన్నాను గుడ్లు తేలేసి...నోట మాట రాలేదు నాకు—యిందాకట్నుంచీ ఆమె పడుతున్న తంటాలు యిదేనా? "అయినా ఎక్కడివి అరిటికాయలు" అని అడిగాను వుండబట్టలేక—

"పక్కింటి భాస్కరం భార్యను మన పిట్టగోడమీదనుంచి కేకేసి, యిట్లా లొచ్చాను, యిట్లా అసందర్భం అయిపోయింది, వేళా మించిపోయింది; కాబట్టి ఏవేనా కూరగాయలు మిగతావుంటే నాలుగిమ్మన్నాను...లోపల్నుంచి ఆమె ఫస్టైన అరిటికాయలు తెచ్చియిచ్చింది ... చెప్తే నమ్మవేమో మన అరిటిగెల్లో కాయల్లాగే నవనవలాడుతూ చూడముచ్చటగా వున్నాయి...యివిగో యింకా మూడు కాయలెత్తిపెట్టాను"...అంటూ మిగతా అరిటికాయలు చూపించారు మా అత్తగారు.

—ఏం చెప్పేది!...భూమి 'గుండ్రముగా నుండును' అన్నట్లు తిరిగి మా యింటికే వచ్చాయి గెల్లో కాయలు...మంచివేళ. భాస్కరంభార్య అసలు విషయం చెప్పలేదు మా అత్తగారితో...బతికించింది... బహుశా మా వారు వాళ్ళమ్మకు తెలినివ్వవద్దని 'పాలిషడ్'గా చెప్పివుంటారు—ఆయన దెబ్బనుండి తప్పించుకోవాలని తంటాలుపడ్డారో. ఆ అరిటికాయ పొడి విశ్వరూపం ధరించింది...

నేను దిగులుగా నిలబడివుండటం చూసిన మా అత్తగారు హుషారుగా "ఏమిటే అట్లా దిగాలుపడి నిలబడ్డావూ! మన అరటిగెల పోతే పోయింది......పక్కింటివాళ్ళ పుణ్యమా అంటూ మంచి అరటికాయలు దొరికాయి సమయానికి...నీ మొగుణ్ణీ, సింహాణ్ణీ భోజనానికి రమ్మను...ఒరేయ్ అప్పులూ, వాళ్లిద్దరికీ వడ్డించరా" అన్నారు.

అరిటికాయ పొడి మా అత్తగారు చేశారన్న విషయం తెలిస్తే మావారు అసలు భోజనానికి కూర్చోరేమో! మళ్ళీ నాకు విషమ సమస్యయింది.

హాల్లోకెళ్లాను..."అత్త భోజనానికి పిలుస్తోంది" అన్నాను నెమ్మదిగా.

"మేము ఎప్పుడో రెడీ......లేవరా" అంటూ పైన తువ్వాలు వేసుకుని మా బావగారు లేచారు. మా వారు నన్ను చూసి, వాళ్ళమ్మ ఎక్కడుంది! అరటిగెల సంగతి మళ్ళీ ఏమైనా గొడవ చేస్తుందా! ఏమైనా

# ★ అత్తగారూ అరటికాయ పొడీ ★

వడ్డించబోతొందా! ఏం'మూడ్'లో వుంది. కోపంగా వుందా! యిత్యాది ప్రశ్నలన్నీ భరతనాట్య భంగిమల్లో, సైలెంట్ గా అభినయించారు. అన్నిటికీ చిరునవ్వునవ్వి వూరుకున్నాను...ఏం చెప్పినా చిక్కే...

భోజనానికి కూర్చున్నారు అన్నదమ్ములిదరూ..."ఏంరా, సింహం!... ఎన్నాళ్లయిందిరా నిన్ను చూసి! కొచ్చావ్! మమ్మల్నంతా మర్చిపోయినట్టున్నావే!" అంటూ చేతిలో అరిటికాయపొడిగిన్నె ధరించి రంగంలో, ప్రవేశించారు మా అత్తగారు. ఎక్కడ అరటిగల సంగతి వస్తుందోనని భయంతో తలవంచుకుని కూర్చున్నారు మావారు...

"ఎక్కడ కక్కా...పిల్లల్తోనూ, నా వుద్యోగంతోనూ సరిగ్గా వుంది. పెద్దపిల్ల కాలేడుకొచ్చింది; రెండవ వాడికి టైఫాయిడ్ వచ్చి యిప్పుడే లేచి తిరుగుతున్నాడు...చంటిదానికి ఎప్పుడూ ఏదో జబ్బు - నీకు తెలీందేముంది! యిల్లు కదలడానికి అవకాశమేది!" అన్నారు బావగారు.

"మరి సంసారం అన్న తర్వాత వుండవ్వుటా! నీవంటే మీ అబ్బకు ఒక్కడే కొడుకువుగనక రాజులాగా పెరిగావు—మరి నలుగురు పిల్లలూ జల్లలూ అన్న తర్వాత మాటలా, ఏదో సామెత చెప్పినట్లూ... ఒరేయ్ అప్పలూ అన్నం వడ్డించరా వాళ్లిద్దరికీ—" అని ఆజ్ఞాపించారు మా అత్తగారు—మావారు యింకా వాళ్ళమ్మ చేతులో గిన్నె చూడలేదు—అప్పలు అన్నం వడ్డించిన వెంటనే వార్నింగు లేకుండా మా అత్తగారు అరిటికాయపొడి వడ్డించేశారు.

మావారు గతుక్కుమన్నారు...

కాని అసలు ఏమి వడ్డించిందో పసికట్టలేకపోయారు...

మా అత్తగారి వంటలో అదోక విశేషం. వడ్డించిన వెంటనే ఫలానా అని కనుక్కోడం బ్రహ్మతరం కాదు—

"యిదేమిటికక్కా!"...అన్నారు మా బావగారు పొడిని పరీక్షిస్తూ...

"అయ్యో తెక్కన్నా! ఏమిటని అడుగుతావేమిట్రా! అరిటికాయ పొడిరా!..." మావారు ఉలిక్కిపడ్డారు...నావైపు కోపంగా చూశారు... నేను తలుపు వెనక్కి తప్పుకున్నాను...

"నీకూ వాడికీ యిష్టమనే చేశా(నా అరిటికాయపొడి—ఏమిటో వెళ్లమించి పోయిందని అదరా బదరా చేశాను—ఎట్లా వుందో ఏమో"—అంటూ వంటింట్లో కెళ్ళారు మా అత్తగారు—

"అదేమిటికక్కా—మా కోసం యీ వేళప్పుడు నీవు కూడా భోంచేయకుండా యీ మాత్రం చేసిందే ఎక్కువ...యింకా ఎట్లా వుంటం ఏమిటి నీవు చేస్తే బాగుండకుండా వుంటుందా?"—అంటూ మా బావగారు అరిటికాయ పొడి కాస్త నోట్లో వేసుకున్నారు—

తత్ క్షణం-గరగరా, గరగరా, అనే శబ్దం బయలుదేరింది మా బావగారి నోట్లోంచి.

"ఏమిటన్నయ్యా..." అన్నారు ఖంగారు పడుతూ మావారు...

"అబ్బే...ఏమీ లేదురా...యీ అరిటికాయ పొడి వుంది చూశావూ...కాస్త జాగ్రత్తగా చేయాలి...ఏమాత్రం అజాగ్రత్తగా చేసినా కష్టం..." అంటూ గ్లాసుడునీళ్లు నోట్లో పోసుకుని గర గర శబ్దాన్ని గలగరించి మింగారు మా బావగారు...

"యిదుగో-యీపొడి బాగా కుదిరిందిరా—వేడివేడిగా కూడా వుంది. కాస్త తిని చూడండి" అంటూ మా అత్తగారు వంటింట్లోంచి మరికాస్త అరిటికాయపొడి తీసుకొచ్చి ఒడ్డింటున్నా వినకుండా బలవంతంగా వడ్డించింది అంతవరకూ మావారు కతాసేలేదు అరిటికాయపొడి...

ఎంతో ఆప్యాయంగా మా అత్తగారు రెండవసారి వడ్డించిన అరిటికాయపొడిని విధిలేక భయపడుతూ కాస్త నోట్లో వేసుకున్నారు మా బావగారు. అన్నగారేమైనా అనుకుంటారనో ఏమో మావారూ ధైర్యం చేసి కాస్త పొడినోట్లో వేసుకున్నారు... ఈసారి కరకరా, కరకరా, శబ్దాలు బయలుదేరాయి-ఒక్కక్షణం నోరుమూసుకుని అన్నదమ్ములిద్దరూ ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు. ఆశబ్దాలు ఎక్కణ్ణించి వస్తున్నాయీ అని. వాళ్లిద్దరినోట్లోనుంచే వస్తున్నాయని గ్రహించినవెంటనే గబుక్కున చెరో గ్లాసుడునీళ్లు నోట్లోపోసుకుని ఆకరకరా శబ్దాన్ని మింగేశారు...

మా అత్తగారు కూతిమీద కేలేసుకొని వాళ్లిద్దర్నీ ఆశ్చర్యంగా చూస్తూ—"ఇదేమిట్రా ! అరిటికాయ పొడి తింటానికి యింత అవస్థపడుతున్నారు!" అన్నది.

"అబ్బే...లేదు కక్కా...అరిటికాయ పొడి తింటానికి అవస్థేముందీ!" అన్నారు మా బావగారు గ్లాసు కిందపెడుతూ.

"మరేమయినా రాళ్లు రప్పలున్నాయా?"

"అబ్బే. అవుంటే దొరికిపోతాయి—సాధారణంగా వేపుడుతో కలిసిపోయేవి బొగ్గులు; తాళింపులో కలిసిపోయే వాటిల్లో ఆవాల్లోని ఇసక....ఇవి రెండూ కాస్తజాగ్రత్తగా చూడకపోతే చిక్కు—అంతే" అన్నారు బావగారు.

"ఏమోరా! అన్నీ సరిగానే చూసి వేశానే! నేనుకూడా కాస్త నోట్లో వేసుకుని రుచి చూశాను...మరి నువ్వనే ఇసకా బొగ్గులూ నా నోటికి తగల్లేదే!" అన్నారు మా అత్తగారు.

"దానికో కారణం వుంది కక్కా...మాకు పండ్లు వున్నాయి...గనక నమిలాం...నీకు పండ్లు లేవు గనక మింగేసుంటావ్. అందుకే నీకు తెలీలేదు అరిటికాయ పొడిలో అరిటికాయ కాక యింకా ఏమేమున్నాయో..." అన్నారు మా బావగారు మావారితో బాటు మజ్జిగన్నం కలుపుకుంటూ...తలుపు వెనక వున్న నేను నవ్వు ఆపుకోలేక తంటాలు పడ్డాను.

"అయ్యో నా తిరాతా...యింతకూ ఇద్దరూ తినలేదేమిట్రా అరిటికాయ పొడి! అంటూ దవడలు నొక్కుకున్నారు ఆశ్చర్యంగా మా అత్తగారు.

"అదేమిటి కక్కా..."గంగగోవు పాలు గంటెడైనను చాలు" అన్నట్లు, ప్రేమతో వడ్డించింది ఏ కాస్త తిన్నా తిన్నట్టే... అన్నారు మా బావగారు...కక్కా మనసు కష్టపడటం ఇష్టంలేక.

"పోనీ రేపుమళ్ళీ చేసిపెడతాన్లేరా అరిటికాయ పొడీ అన్నీ జాగ్రతగా చూసీ..." అన్నారు మా అత్తగారు.

"అబ్బే...ఎందుక్కక్కా-యీ సాయంత్రం బండికి వెళ్ళిపోతున్నాను..." అన్నారు చేయి కడుక్కోడానికి లేస్తూ.

"అదేమిట్రా ఇంత తొందరగా నా వెళ్లావు!" అన్నారు మా అత్తగారు ఆశ్చర్యంగా.

"అవును కక్కా...అర్జంటు పనులున్నాయి...ఏమీ అనుకోవద్దురా" అన్నారు మావారివైపు తిరిగి.

"అబ్బే...నీ పనులాపుకుని వుండమంటానా! తీరుబడి చూసుకుని మళ్లీ వద్దువుగానిలే అన్నయ్యా" అన్నారు మావారు—మళ్ళీ అన్నగారికోసం వాళ్ళమ్మ చేసే అరిటికాయ పొడి తినాల్సొస్తుందన్న హడలుతో.

"అయినా నాలుగురోజు లుంటానన్న మా బావగారికి అర్జంట్ పనులన్నీ అనుకోకుడాం రావడానికి కారణం మా అత్తగారా?...అరిటికాయ పొడా? ★

# నక్షత్ర ఫలితాలు

## [17-9-58 మొదలు 23-9-58 వరకు]

| | కే | కు | |
|---|---|---|---|
| | శే 17 దీ మొదలు 23 వరకు గ్రహస్థితి. | | |
| | తుల, వృశ్చిక, దనుర్మకరములలో చంద్రుడు. | | బు శు |
| | శ | గురా | ర |

### * అశ్విని [చూ, చే, చో, లా] *

ఈ వారము వినోదములలో పాలొనుట, దధిక్షీరమధురపదార్థయుక్త భోజనం వెండిపాత్రలలో చేయుట, తలచిన కార్యములలో జయము, జల ప్రయాణము, తెల్లనివస్తువులు కొనుటవంటి యోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, తెలనివస్త్రములు, వెండి, బియ్యము, ద్రవపదార్థ వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలుకాలము. వారమంతా శుభయోగములున్ననూ, 19, 23 తేదీలు భయాందోళనలతో కూడివుంటవి.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము ధనధాన్యవృద్ధి, పశుసంపద, కృషిమూలకముగా లాభము. వివాహాది శుభకార్యాలోచనలు చేయుట, ఇష్టవస్తులాభము, పరోపకారమువల్ల కీర్తి, వంటి రాజయోగములు కలుగుతవి. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా చదువు బాగా సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 19 న కుటుంబకలహము, ఆ పైని శుభయోగములు.

### * కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] *

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ. రాబడి తక్కువ. గృహావసరములు తీరనందున కలతలు. ఆరోగ్యము సరిగాలేని సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందడమే కాకుండా, గ్రహారాధనైన రవికి శాంతి చేయించుట మేలు. ఉద్యోగస్తులకు క్రొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. 19 కార్యభారము ఆటంకములు, కలతలు. 20, 21, 22 పిత్రువర్గ సహాయము, కార్యలాభము. 23 ఆరోగ్యభంగము రాజకీయవాదులకు ఆందోళన.

### * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారం మీకు మిశ్రమయోగం. మొదట్లో నిరాశగావున్నా మిత్రసహాయంవల్ల కార్యలాభం పొందుతారు. ధనలోపంవల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు ఏమంత బాగుండదు. వర్తకులకు మాంద్యము. విద్యార్థులకు బద్ధకంవల్ల చదువు సాగదు. ఆప్తుల ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. వారంలో అవయోగములున్నా మిత్రసహాయం, కార్యసిద్ధివంటి శుభయోగములు కూడా వుంటాయి.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారం మీరు సహాయం పొందదలుచుకున్న వ్యక్తివల్లనే కార్యహాని అవుతుంది. ధనాభావం కూడా ఎక్కువ. ఇంట్లోవారి

## బి. నరసింగరావు

ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. అయినా ఆధ్యాత్మికచింతవల్ల కార్యలాభం పొందుతారు. ఉద్యోగస్తులకు వత్తిడి; వ్యాపారస్తులకు నిరాశ. విద్యార్థులకు మంచికాలం కాదు. దైవదర్శనం విచిత్రములు చూచుటవంటివి జరుగును. వారమంతా అవయోగశుభయోగ మిశ్రమంగా వుంటుంది.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారం మీకు అనుకూలతకన్నా ప్రతికూలత ఎక్కువ. యత్నకార్యాలు ఎక్కువ శ్రమతో ఫలిస్తాయి. కోర్టువాదాలు అనుకూలిస్తవి. ఇతరులకు సాయం చేయబోయి, ఫలించక నిందలు పొందుతారు. ఇచ్చిపుచ్చుకోడంలో వివాదాలు ఏర్పడుతవి. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ, తోటివారి సహకారం వుంటవి. వర్తకులకు వారమంతా నిరాశ, వారాంతంలో మేలు.

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారం ఎన్ని అవాంతరాలు వచ్చినా పట్టుదలతో యత్నించడంవల్ల కార్యసిద్ధి అవుతుంది. ఆశించిన సొమ్ము సమయానికి అందక అప్పు చేస్తారు. దెబ్బలు తగిలే ప్రమాదములు జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు, లోహ, రంగుల వ్యాపారస్తులకు కష్టముతో కూడిన లాభం. యంత్రములు నడుపువారికి, ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు మేలుకాలము.

### * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈ వారం మీకు యోగకాలం. అధికారుల సహాయం. బంధు సహాయం కలుగుటచేత ఆటంకములు గడిచి కార్యసాఫల్యం పొందుతారు. ఆదాయం వృద్ధి అవుతుంది. వైద్య జ్యోతిష శాస్త్ర ప్రసంగాల్లో పాల్గొంటారు. కవులు నూతన రచన చేస్తారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషిస్తారు. విద్యార్థులకు ఉత్సాహంగా వుంటుంది. వారమంతా మంచియోగములున్నా భయాందోళనలు కూడా వుంటవి.

### * ఆశ్లేష [డి, డూ, డే, డో]

ఈ వారం మీకు మంచి భాగ్యయోగం. అనుకున్న డబ్బు చేతికివస్తుంది; ఇబ్బందులు తీరుతవి. దావాలలో గెలుపొందుతారు. బిడ్డల సంతోషాలకై చేసే ప్రయత్నాలు ఫలిస్తవి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. న్యాయస్థాన ఉద్యోగులకు, న్యాయవాదులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుకాలము.

### * మఖ [మా, మీ, మూ, మే] *

ఈ వారం మీకు యోగదాయకం. ధనయోగమువుంటుంది. కవితాగోష్ఠి, సంగీతసభలువంటి వినోదాలలో పాల్గొని మృష్టాన్నభోజనం చేస్తారు. ఆప్తబంధువుల క్షేమవార్త తెలుస్తుంది. శుభకార్యాలలో పాల్గొంటారు. నూలు, బట్టలు, బియ్యం, వెండి వర్తకులకు లాభం. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలుకాలము.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### మో, టా, టీ, టూ

ఈ వారం కూడా గతవారంవలెనే యోగకరంగా వుంటుంది. అసంపూర్తికార్యములు లాభకరంగా ముగుస్తవి. శుభ, పుణ్యకార్యాలలో పాల్గొంటారు. నూతన గృహనిర్మాణమునకు ప్రయత్నిస్తారు. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో ఎక్కువ లాభం. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. వారమంతా శుభయోగంతో కూడినవున్నా మనోచాంచల్యము, ఆందోళన కలుగుతవి.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [టే, టో, పా, పీ]

ఈ వారం రాబడి తక్కువ. కార్యభారం ఎక్కువ. గృహావసరములు తీరక స్పర్థలువస్తవి. అనారోగ్య సూచనలు కనబడగానే చికిత్స పొందడం, రవికి శాంతి చేయించడం మంచిది. ఉద్యోగస్తులకు

# ★ నక్షత్రఫలితాలు ★

కొత్త సమస్యలు, వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. వారమంతా భయాందోళనలతో వున్నా పితృవర్గమునుండి ధనసహాయం కార్యలాభం కలుగుతవి.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారం మొదట్లో నిరాశగావున్నా మిత్రసహాయంవల్ల కార్యలాభం అవుతుంది. ధనలోపంవల్ల ఆందోళన. ఇంట్లోవున్న వారి అనారోగ్యంవల్ల అశాంతి కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్పఅనుకూలత. వర్తకులకు వారాంతమున లాభం. వారమంతా ఉద్రేకంతో వుండి, విదేశీయుల పరిచయం, అపురూప వస్తుసంపాదన కలుగుతవి.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారం మీకు మిశ్రమయోగం. ఆశించిన సహాయం లభించక అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. అయినప్పటికీ దైవానుగ్రహంవల్ల కార్యసిద్ధి పొందుతారు. వుద్యోగస్తులకు అధికారుల అనాదరణ, వర్తకులకు చాంచల్యము. పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసం కలుగుతుంది. వారమంతా అశాంతిగావున్నా నష్టద్రవ్యలాభం పొందుతారు.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారం అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ఇచ్చిపుచ్చుకునేపట్ల వివాదములువచ్చి మనోవ్యథకలుగుతుంది. కోర్టు వ్యవహారాలు అనుకూలించినా అమిత ఖర్చులవల్ల అసంతోషం ఉండదు. భార్యకు అనారోగ్యము కలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు ఉప్పు నువ్వులు,నూనెవ్యాపారస్తులకు లాభయోగం. ఇతర జాతివారివల్ల గౌరవంకలుగుతుంది.

### * విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈవారము ఎంత ప్రయత్నించినాయత్న కార్యాలకి ఆటంకాలు కలుగుతునే వుంటవి. అయినప్పటికీ పట్టుదలవల్ల కార్యలాభం పొందుతారు. సోదరసహాయంవల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. దెబ్బలుతగిలేప్రమాదం జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, లోహ, ఖనిజ వ్యాపారస్తులకు, భూస్వాములకు కష్టముతోకూడిన లాభము. పోలీసుశాఖ వుద్యోగులకి మేలుకాలము.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈవారం మీకు యోగదాయకం. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. ధనలాభం కలుగుతుంది. ఈశాన్యదిక్కునుంచి క్షేమ సమాచారములు తెలుస్తవి. శుభకార్యములలో పాల్గొనుట. బంధుదర్శనం, గణిత జ్యోతిషశాస్త్రచర్చలువంటివి జరుగుతాయి. ప్రత్తి, దూది, నూలు,బట్టలు, ఇత్తడి, కంచు వర్తకులకు లాభయోగం. కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలం.

### జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈవారం మీకు శుభయోగం. ఆశించిన డబ్బు చేతికివస్తుంది. ఇంట్లో శుభకార్యాలు జరుగుతవి. పుణ్యకార్యాచరణ, ఆకస్మిక ప్రభుత్వ సన్మానము, వైద్యజ్యోతిషశాస్త్ర ప్రసంగములవంటివి కలుగుతవి. విద్యార్థులు నూతనాంశాలు నేర్చుకుంటారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు వారమంతా మేలుగావున్నా కొంచం ఆందోళన కూడా వుంటుంది.

### * మూల [యే, యో, బా, బీ] *

ఈవారం మీరు తలపెట్టిన కార్యములలో జయమును పొందుతారు. వెండిపాత్రలలో దధిక్షీరమధురపదార్థయుక్తభోజనం చేస్తారు. వినోదములలో పాల్గొంటారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యం, ద్రవపదార్థ వస్తువుల క్రయవిక్రయాలలో వర్తకులకు లాభం. విద్యార్థులకు మంచికాలం. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగం.

### *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢా]*

ఈ వారం మీకు యోగప్రదము. ధనధాన్య వృద్ధి వుంటుంది. వివాహాది శుభకార్యములలో పాల్గొంటారు. ఇష్టవస్తు లాభం, పరోపకారంవల్ల కీర్తి కలుగుతవి. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయాలలో వర్తకులుఅమిత లాభం పొందుతారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలం.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారం కార్యభారం ఎక్కువ. వింత మాటలు వినుట, పరాక్రమంవల్ల ఘనత, ధనలాభం,ప్రయాణం వుండును. అకాలభోజనంవల్ల అనారోగ్య సూచనలు కనబడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగులకు స్వల్ప అనుకూలత. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితో బాటు అనుకూలము.

### *శ్రవణము [జూ, జే, జో, ఖా]*

ఈ వారం తలపెట్టిన పనులు నెరవేరవు. ప్రతిపనికి అనవసరంగా ఆలస్యం కలుగుతుంది. వర్తకులకు లాభం తక్కువ. ఆత్మీయుల ఆరోగ్యం చికాకుకలిగిస్తుంది. ఉద్యోగస్తులకు ఏమంత అనుకూలంగా వుండదు. వారమంతా చికాకుగా వున్నా వారాంతంలో విదేశీయుల సహాయంవల్ల కార్యసిద్ధి కలుగుతుంది.

### * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారం ధనాభావం ఎక్కువ. ఎవరి సహాయంవల్ల కార్యసాధన చేదామనుకుంటారో వారివల్లనే ఆటంకములు కలుగుతవి. అయినా దైవచింతవల్ల క్రమేణా కార్యానుకూలం అవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యం బాగుండదు. ఉద్యోగస్తులకు వత్తిడి, వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచిరోజులు కావు. వారంలో ఎంత ఆందోళనవున్నా సాధు సాంగత్యము, కార్యానుకూలత, నష్ట ద్రవ్యలాభం కలుగుతవి.

### * శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈ వారం అనుకూలతకన్నా ప్రతికూలత ఎక్కువ. యత్నకార్యాలు శ్రమాధిక్యంతో ఫలిస్తవి. కోర్టు వ్యవహారాలు అనుకూలిస్తవి. పరోపకారానికి యత్నపడి నిందలు పొందుతారు. భార్య ఆరోగ్యం సరిగా వుండదు. ఇచ్చిపుచ్చుకునేపట్ల వివాదములు. ఉద్యోగస్తులకు అధికారుల వత్తిడితోబాటు తోటివారి సహకారం వుంటుంది. వర్తకులకు వారమంతా నిరాశ, వారాంతంలో లాభం.

### *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈ వారం ఎన్ని అవాంతరాలు వచ్చినా పట్టుదలతో యత్నించి కార్యసిద్ధిని పొందుతారు. ఆశించిన ధనం సమయానికి అందక అప్పు చేస్తారు. సోదర సహాయం వుంటుంది. ఆత్మీయులవల్ల నిందలపాలవుతారు. దెబ్బలు తగిలే ప్రమాదం జాగ్రత్తవల్ల తప్పవచ్చును. భూస్వాములకు, ఇంజనీరింగుశాఖ వారికి, రంగులు, లోహపు సామానుల వ్యాపారస్తులకు శ్రమతో కూడిన లాభము.

### *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]*

ఈ వారం మీకు యోగప్రదం. అధికారుల సహాయంతోను, బంధుసహాయంతోను ఆటంకములు గడిచి ఫలం పొందుతారు. ఆదాయం వృద్ధి అవుతుంది. వైద్య జ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్యదిక్కునుంచి క్షేమం తెలుస్తుంది. విద్యార్థులకు మంచికాలం. కవులకు,శిల్పులకు నటీనటులకు యోగకాలం.

### * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారం మీకు యోగదాయకంగా వుంటుంది. ఆశించినడబ్బు చేతికి వస్తుంది. నూతనకార్యాలు ప్రారంభిస్తారు. కోర్టు వ్యవహారాల్లో కొంత అనుకూలం. పండితులతో గోష్ఠిజరిగి నూతనవిషయాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగములున్నా కొంత ఆందోళనకూడా వుంటుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన వుద్యోగులకు, ఉపాధ్యాయులకు, పండితులకు మేలుగా వుంటుంది. ★

# ★ చిఱుచెమటలూ చందనం ★

(12 వ పేజీ తరువాయి)

తన గది కిటికీలో, గుంటకెదురుగా, గువ్వలాగ కాళ్ళుముడుచుకుని, తలవెనకకి తలుపుకి జారవేసుకుని చెక్కిళ్ళనిండా కన్నీళ్ళు కారుతూ, కూచునివుంది అలివేలు.

"నాగప్ప పదాలు పాడాలి. లేపోతే నిద్రోస్తావుంద"న్నారు చింతాలు మరదళ్ళు.

"ఆ! నా పిచ్చపదాలకేంగాని. ఎయ్యండి పిల్లా, పోటు. అయినా నాకేం కుశాలగా లేదు ఇయ్యాల" అంది నాగమ్మ తనూ రోకలి పుచ్చుకుంటూ.

సత్యంగారి పాలేరు, పోతురాజు, చింతాలుదగ్గరికి పుగాకొచ్చాడు. రాత్రంతా నిద్రకొస్తూ.

"మీ కాపం దు కట్టావున్నట్టూ?" అన్నాడు చింతాలు.

"రాత్రి సందకాడ బత్తీనించీ డాకటేరుని తీసుకొచ్చాడుగా, జమిందారుగారు. మా పెద్ద చెయ్యంటలే. అదేంమందో అదేం కతో, జీవదారపుల్లలై పనిచేసిందంటే; ఇక పరవానేదంట. బతుకుతాడంట. నీకింకా తెల్దా?" అన్నాడు పోతురాజు.

"మా మంచోడయ్యా. మా గొప్ప స్నేహాలు చేసాడుగా. కనికారం గలోడు మారాజు" అన్నాడు చింతాలు.

పోతురాజు స్వరం వినబడగానే అలివేలు చెవులు రిక్కించుకుని విన్నది. అదృశ్య దేవతలకి చేతులు జోడించింది.

మళ్ళీ వచ్చేటప్పటికి నాగమ్మ పిచ్చిపదం వినబడుతూంది.

"వేసవికాలాన పూసేను బూరగలూ,"
ఊం... ఊం. ఎయ్యండి పిల్లా ఎయ్యండి...

"అసితో నిలకలూ ఆరునెలలుంటే
పువ్వుపూ సేవరకు పుడికొమ్మనుంటే
కాయకాసేవరకూ కడకొమ్మనుంటే
పండుపండేవరకు పలవల్లి ఉంటే
తినబోతె దూదాయె, తీపిలేదాయె.
మళ్ళండి చిలకల్లార మనమన్న బూరువు
లకూ..."

* * *

అలివేలు కదిలింది. పల్చని చీరలోనించీ నెల వెలుగులో, మసకగా మెరిశాయి మెళ్ళో మంగళసూత్రాలు... చెమ్మగిల్లిన కన్నుల మల్లె... ★

# ★ మరలివచ్చిన మనస్సు ★

(16-వ పేజీ తరువాయి)

గురించిన ఆలోచనలు రానాగాయి. తనదై, స్వంతమైన లోకంలోకి వెడుతున్నట్లుంది అతనికి......

వీధి మలుపుదగ్గర కనుపించాడు చిన్న తమ్ముడు "అన్నయ్యా!" అని అరిచి బండి వెనకాల పరుగెత్తుకొచ్చాడు. "అమ్మ నిన్న అంటోంది అన్నయ్య వస్తాడేమోనని—చిన్నన్నయ్య దసరాకిగానీ రాడు." ఆయాసపడుతూ ఏవో చెప్తున్నాడు. యింకా బండినిదాటి పరుగెత్తుకువెళ్ళాడు వాడు.

బండి గేటుదగ్గర ఆగేసరికి చెల్లెలు, రెండో తమ్ముడు పరుగెత్తుకొచ్చారు. వాళ్ళని కళ్ళతో చూశాడేకానీ- మెడవంచి గుమ్మంలోకి తొంగిచూశాడు. అతని గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. ఏనాడో రగుల్కొన్న అగ్నిపర్వతం లాంటిది తన బాంధవ్యంలోని విభేదం, యీనాడు బ్రద్దలవుతే!...

గుమ్మంలో అక్క నిల్చునివుంది. తల్లి—ముసలిదైపోతోంది మా అమ్మ అనుకున్నాడు మాధవరావు. "మాధవా, రానాయనా. సాయంకాలం బయలుదేరావా, చిట్టీ! వదిన ఏను తింపవులే బండిలోంచి?"—మాధవరావు నీరసంగా నవ్వాడు. "తీసుకురాలేదు. అక్కడేవుంది. నాన్న ఏడీ? ఎల్లావుంది నాన్నవంట్లో?" ప్రశ్నలు రావడంలేదు అతనికి - వదిన! ఎందుకు వీళ్ళకి ఆమె అజ!

తల్లిముఖంలో ఆశ్చర్యం చూశాడతను. "అదేమిట్రా, అమ్మాయి ఎల్లా వుంటుంది వంటరిగా: "వాళ్ళ వాళ్ళెవరైనా వున్నారా అక్కడ?" అన్నదామె.

"ఎవరూ లేరు. తనే వుంది." అన్నాడు లోపలకువస్తూ.

ఘర్షణలులేవు. తను పూర్వం సెలవులకి వచ్చినప్పుడు ఎలావుందో యిప్పుడూ అల్లాగేవుంది. తను వీళ్ళలోనివాడు—ఆనందంగా, సంపూర్ణంగా వుంది యీ వాతావరణం.

స్నానం చేయడానికి వెడుతుంటే దొడ్లో అడిగింది అక్క "మాధవా, మా మరదలు ఎల్లా వుంటుందిరా, చక్కని దాన్నిగానీ మాధవుడు పెళ్ళాడడు అంటుంది అమ్మ. నిజమేనా?" అని.

అప్రయత్నంగా సిగ్గుపడుతూ నవ్వాడు మాధవరావు.

"ఏమో! మరినా కళ్ళు పెట్టుకునిచూస్తే బాగానే వుంటుంది." అన్నాడు.

స్నానం చేసినతర్వాత, తండ్రితో కలిసి భోజనం చేశాడు. తండ్రి కుశల ప్రశ్నలు, ఉద్యోగవివరాలు, రాజకీయాలు, ఊళ్ళో విషయాలు మాట్లాడి మంచంమీద వ్రాలాడు. విసనికర్ర చేత్తో పుచ్చుకుని, "కానీ—నువ్వు కోడలుని తీసుకువస్తే బాగుండేది. నలుగుర్నీ చూడక్కర్లేదూ తను మాత్రం?" అన్నాడాయన.

లోకంలో చిత్రాలు జరుగుతాయి, మనుష్యులు చిత్రంగా మాట్లాడతారు—ఇదే దానికి తార్కాణం అనుకున్నాడు మాధవరావు.

"ఎన్నాళ్ళు సెలవు పెట్టావు అబ్బాయీ?"— రెండోనాటిరాత్రి దగ్గర కూర్చుని అన్నం పెడుతూ అడిగింది తల్లి. తండ్రి పురాణానికి వెళ్ళాడు; అక్క దూరపు బంధువులింట్లో శుభకార్యానికి సాయంచేయడానికి వెళింది, పిల్లలు వసారాలో చదువుకుంటున్నారు.

"25 వరకు పెట్టాను...అమ్మా, మీ అందరికీ చాలా కష్టం కలుగలేదుటే, నేను విధవరాలిని పెళ్ళి చేసుకున్నందుకు?"

"ఛీ పూరుకో, అప్రాచ్యపు మాటలు కోడల్ని గురించి అల్లాంటి అమంగళకరమైన మాటలు అనకూడదు" అన్నది తల్లి.

మాధవరావుకి నిజంగానే నవ్వొచ్చింది. "అమ్మా, నీ కొడుకు భార్యకాబట్టి అంత పవిత్రమూ అమ్మా నీకు? అదికాదు. చెప్పు. నాన్న ఏమన్నారు అప్పట్లో? నువ్వేమనుకున్నావు? చెప్పమ్మా..."

లాంతరు వెలుగులో తల్లి చేతిగాజులు మెరుస్తున్నాయి. ఆమె తెల్లనిజుట్టు తేలిగా గాలికి కదులుతోంది. దీపం పూగిసలాడుతూంటే, ఆమె ముఖంమీద వెలుగునీడలు, కష్టసుఖాల్లా పడుతున్నాయి.

"మీ నాన్న నాలురోజులు కేకలేశారు. అందరిమీదా – రాత్రిళ్ళుమాత్రం పదేపదే అనుకునేవారు పెద్దవాడిల్లా చేశాడని...నా సంగతి కేమున్నది మాధవా, ఇప్పుడు అక్కయ్య రాతచూసి నేను కుమిలిపోవడం లేదూ, అది యిప్పుడైతే కొంచెం మనిషైంది కానీ, మొదట్లో ఎల్లావుండేది? అల్లాంటిబాధ ఒక ఆడుదానికి తప్పిందని అనుకున్నాను."

అవతలిగదిలో గిన్నెపడిన చప్పుడైతే, లేచివెళ్ళింది ఆమె. పెరుగు తీసుకువచ్చి వడ్డించింది కొడుక్కి.

"మా నాన్న చిన్నవాడు నీ జాతకం గీసినప్పుడే చెప్పాడు నీకు అనువైన కళ్యాణం జరుగుతుందని- రెండేళ్ళక్రితం పురుషోత్తం

# మరలివచ్చిన మనసు

గారు చెప్పారు నీకు సంసారసౌఖ్యం వుందని- ఎన్నిసార్లో అనుకున్నాను యీ విషయాలు...నీ మనస్సు మంచిదని నాకు తెలుసు. కానీ మాధవా, నువ్వు రాధని యెందుకు తీసుకురాలేదు చెప్పు?"

రాధా, మాధవుడు! బాగున్నాయి తల్లి నోట యీ పేర్లు వినడానికి.

"నాకేం తెలుసమ్మ యిక్కడి సంగతులు? తీరా ఇక్కడికి వచ్చిన తర్వాత నాన్న కేకలేసి, నలుగురూ పెడముఖాలు పెట్టుకుంటే రాధ ఎంత బాధపడుతుంది? మీరంతా శాంతించిన సంగతి తమ్ముడూ వ్రాయదులేనాకు..."

రాధది అసలే సున్నితమైన మనస్సు— అబద్ధం! ఈ సానుభూతి మెదిలింది తనమనస్సులో! బాధతో ముడుచుకుపోతోంది అతని హృదయం!

"అయ్యో పిచ్చినాయనా...మీ నాన్న కాగితం మీద మాత్రం నీపేరు వ్రాశారు కాదు. మాతో ఐనా అన్నారనా నిన్ను చూడాలని వుందని?...అవునుగానీ, అక్కయ్యకి చిన్నవాడు వ్రాశాడు, రాధమ్మ చిన్నదేటగా? తల్లీ, తండ్రికికూడా దూరమైంది పాపం. నాలుగురోజులపాటు ఇక్కడుంటే మనస్సుకు శాంతిగా వుండును. నీ సంగతే నీకు పట్టదు, అమ్మాయి సంగతి ఏం చూసున్నావో నువ్వు...అదేమిటి అన్నం త్రోసేస్తున్నావు ప్రక్కకి?"

"ఎక్కువైందమ్మ" అన్నాడతను చేయి కడుక్కుంటూ.

అతను ఆరుబయట వెన్నెల్లో పడుకున్నాడు. అమ్మవచ్చి మంచంమీద కూర్చుంది అతనిమీద చేయివేసి కాస్సేపాగి అన్నదామె.

"మాధవా, నువ్వు కలతపడుతున్నావు. మనస్సులో ఏవీ ఉంచుకోకు. ఏదో కాదన్న పని చేసినంతలో రక్తస్పర్శలు ఎక్కడికి పోతాయి? ఆయన నీకు తండ్రి కాడా, నువ్వాయనకు కొడుకువి కావా? నీమనస్సుకి నచ్చిన పని మా అందరికీ మాత్రం ఎందుకు కష్టం కలిగిస్తుంది?..."

కోల పాడినట్లు, మధురంగా సత్కావ్య పఠనంలా పవిత్రంగావుంది ఆమె వాక్కు మాధవరావు చెవులకి.

"రాధమ్మ పుట్టింటినిగురించి తల్చుకుంటూ వుంటుందా ఎప్పుడేనా?" మాధవరావు మాట్లాడలేదు.

తల్లి నవ్వింది: "తల్చుకుని ఏడుస్తూంటుందా? నిజానికి-ఎవరూ లేరుటగా రాధకి? పాపం-" తల్లి కంఠం రుద్ధమైందా అనిపించింది అతనికి.

"తమ్ముడు వ్రాశాడులే అన్నీ-ఇంతకీ ఒక్కత్తే ఉందన్నమాట, ఇరుగు పొరుగు వున్నారా?"

మాధవరావు ప్రక్కకు తిరిగి పడుకుని, కళ్లకి అడ్డంగా చేయి పెట్టుకున్నాడు. "నాకు నిద్రొస్తోంది అమ్మ-మధ్యాహ్నం పడుకోలేదుకదూ? నాన్న వచ్చినట్లున్నారు చూడు" అన్నాడు. అతనికంఠం పొడిగావుంది.

* * *

తెల్లవారుఝామున తల్లి లేస్తూనే మాధవరావు పరుపు చుట్టేసివుండటం చూసింది. అతని గదిలో దీపం వెలుగుతూండడం చూసి, వెళ్లింది ఆవేపు.

"నేను 5 గంటల బండికి వెడుతున్నానమ్మ-కొంచెం కాఫీ చేసియ్యి." అన్నాడు మాధవరావు హోల్డాలు కడుతూ.

"ఇంకో రెండు రోజులుంటానన్నావు కాదట్రా?" అన్నదామె.

"లేదమ్మ...పనుంది-కాగితాలు కొన్ని కాలేజీలో ఇవ్వాలి-నాన్నకి చెప్పు."

ఆ ప్రభాత సమయాన రైల్లో కూర్చుంటే తల్లి, తండ్రి, అక్క—తనని గంట్రకితం సాగనంపినవాళ్ళెవరూ స్మృతిలో లేరు మాధవరావుకి.

రాధ ఆరోజు సాయంకాలం గుమ్మం దగ్గర ఎంత దీనంగా వుంది! తనకి ఆసమయంలో ఆమె కళ్లలోని విషాదచ్ఛాయలు కనుపించలేదు—ఆవేదనలోతులు స్ఫురించలేదు. కానీ యిప్పుడు!...

ఆమె ఎటువంటిదో తెలియని యీవ్యక్తులంతా ఎందుకు ఆప్యాయంగా మాట్లాడుతారు ఆమెను గురించి? వీళ్లంతా ఏం చేశారు ఆమెకి? ఆమె వీరియెడల ఏమి ప్రేమాభిమానాలు చూపించింది అదృశ్యంగా, మౌనంగా వుండి?—తూర్పున పొడసూపిన బంగారు సూర్యకిరణం అతని కళ్లను తాకింది.

ఎవరికి ఎవరు ఏమి చేస్తారు జీవితంలో, తన తల్లి తనని కని, పెంచి పెద్దచేసినందుకు కృతజ్ఞత చూపాలని కోరుతుందా? అవ్యాజంగా, అయాచితంగా చూపే చల్లని ప్రేమ అది. 'అమ్మ, నువ్వు నాజీవితానికి యింత చేశావు' అని తను అన్నా, ఆమె చిరునవ్వు నవ్వుతుంది కానీ, ఆ మాట మనస్సులో నిల్పుకుంటుందా? అల్లాంటి అలౌకికమైన, ఉత్కృష్టమైన బాంధవ్యం అది.

తనది, తన భార్యది మాత్రం యింత ఉత్కృష్టమైన బాంధవ్యం కాదూ? కానక్కరేదూ?, ప్రేమ, ఆదరం చూపడానికి మనిషిలో ఎంత సౌజన్యం, గొప్పతనం అవసరమో, మనస్ఫూర్తిగా అందుకోవడానికి అంత ఔన్నత్యం కావాలి...రాధ జీవితాన్ని నిర్విచారంగా స్వీకరించి, మౌనంగా ఒడుదుడుకుల నన్నిటినీ అధిగమిస్తోంది. తనలో తానే ఘర్షణలు పడి, ఆమెలో ఏవో ఆపాదించి, కలతలు కల్పించుకున్నాడతను.

'అయ్యో, రాధ ఏమైపోతోందో ఒంటరిగా!' అని రైలుకూతలో కలిసిపోయేలా—సన్నగా—బిగ్గరగా అనుకున్నాడు మాధవరావు.

★

# నానని నువ్వుగింజ

నువ్వీవిషయం చెప్పవద్ద"ని చేతిలో చెయ్యివేయించుకున్నాడు.

"సరే నాయనా!" అని ఆమె తిరుగుముఖం పట్టగా: "అమ్మా ఆఖరిసారిగా నమస్కరిస్తున్నా"నని ఆమె కాళ్ళని కళ్ళ కద్దుకున్నాడు కర్ణుడు.

ఆమె కర్ణుణ్ణి కౌగిలించుకుని కన్నీరు గ్రుక్కుకుంటూ, ఇంటికి వెళ్ళిపోయింది.

* * * *

"తరవాతేమయిందితాతా?" అని అడిగిందిసీత.

"అనంతరం యుద్ధం ముగిసింది దుర్యోధనాదులు, కర్ణుడితో సహా మరణించారు. యుద్ధంలో మరణించిన తన ఆప్తు లందరికీ ధర్మరాజు తిలోదకాలిస్తున్నాడు, అపరకర్మలు నెరవేర్చి.

అప్పుడు కుంతీదేవి వచ్చి అంది కదా:

"నాయనాధర్మజా—కర్ణుడికికూడా కర్మచెయ్యి"

ఎందు కన్నాడు ధర్మరాజు.

ఎందుకంటావా నిట్టూర్చింది కుంతి.

చెప్పవమ్మా అని ధర్మరాజడుగగా: "అతను నీఅన్నే—మీ అందరికంటే పెద్దవాడు" అని విలపించి, పూర్వకథ చెప్పింది.

"ఇది నువ్వు ముందరే చెబితే నేను యుద్ధం అన్నగారితో చేసేవాణ్ణేనా?" అని కోపపడ్డాడు; బాధపడ్డాడు.

కుంతి అందికదా.

"నాయనా మీ అన్నని యుద్ధం ముందర ఇక్కడికి వచ్చెయ్యమని బ్రతిమాలేను. వినలేదు. స్వామి ద్రోహం చెయ్యలేనన్నాడు. నీవీసంగతి తమ్ముడితో చెప్పవద్దని ఒట్టు వేయించుకున్నాడు; అందుకని నీతో చెప్పలేదు నాయనా."

ధర్మరాజుకి కోపం, ఏడుపూ ఒక్కసారి ముంచుకు వచ్చేశాయి. రహస్యాన్ని దాచే శక్తి, ఓరిమి స్త్రీకి ఉండడంవల్లనే కదా తను అన్నగారిని చంపవలసి వచ్చింది అని బాధపడి.

"ఇది మొదలు స్త్రీకి రహస్యం దాచే శక్తి ఉండకపోవుగాక" అని శపించాడు.

ఆనాటినుండి ఆడవారికి తెలిసిన ఏ విషయమూ నలుగురికీ తెలియకుండా ఉండదు. అదేకారణం ఆడదానినోట్లో నువ్వుగింజ నానదనడానికి. చాలా తక్కువ కాలంలో నువ్వుగింజ నానుతుంది. ఆ నువ్వుగింజ నానే పర్యంతరమైనా స్త్రీ తననోట దాన్ని ఉంచుకోలేదన్నమాట! అందుకనే అప్పణ్ణించీ అలాటివాడుక వచ్చింది అని తన కథ ముగించాడు తాతయ్య.

"బాగుంది తాతయ్యా—ఇదా కారణం!" అని తాతయ్య దగ్గిరే నడుంవాల్చింది మనవరాలు. ★

# ★ జీవనలీల ★

(27 వ పేజీ తరువాయి)

తీరుస్తూఉంటాయి. మట్టివాసన-రకరకాల పువ్వులవాసనలతో గాలి రివ్వున కొడుతూంటుంది. మతి ఇవేవీచూడదు. ఏమీవినదు. దేన్నీ ఆఘ్రాణించదు. కాటిన్‌పులోని ఏకాంతాన్నిమాత్రం హాయిగా అనుభవిస్తుంది. ఎవరూచూడకుండాఉంటే కట్టుకున్నచీర విప్పెయ్యమన్నా ఆనందమేఆమెకి.

ఇంట్లో పనులేవిచెయ్యదని కుసుమ మతిని తిడుతుంది. ఇంట్లో పని ఎగగొట్టి, కాటిన్‌పులోకివచ్చి, భవిష్యత్తునుగూర్చి ఆలోచించుకుంటూ కూర్చుంది మతి ముందు సుదేవ్ చచ్చిపోవాలి అని దీవించాక కాని ఏ ఆలోచనా రాదు ఆమెకి.

గొప్పయింటి కోడల్ని కావాలని, శశిలాంటి భర్త లభించాలని మతి మనసులో ఎప్పుడూ కోరుకుంటూ ఉంటుంది. పనిఉండకూడదు, తిట్టు—చీవాట్లు ఉండకూడదు. పోట్లాటలుండకూడదు, ఇల్లు ఎప్పుడూ శుభ్రంగా అందంగా ఉండాలి. చక్కగా నవ్వుతూ మాట్లాడుతూండాలి, చీట్లు—గవ్వలూ ఆడుకుంటూ గ్రాంఫోను వింటూండాలి—గడంపుచ్చుకుని, సిగ్గుతో ఎరుపెక్కిన తన ముఖాన్ని పైకెత్తి 'మా కోడలు,—అచ్చగా మహాలక్ష్మి, కుందనబొమ్మ—ఇలా ఉండాలి కోడలంటే—ఇల్లంతా కళకళలాడేట్టు...' అని మెచ్చుకుంటూఉండాలి.

మతి కనే కలలు అనంతం. ఓ గొప్ప శ్రీమంతులయింటో ఒక వైపున కూర్చునిఉంది తాను. ఒంటినిండా నగలు ధగధగలాడుతున్నాయి. నిగనిగలాడే చీరకట్టుకునిఉంది. మేలిముసుగులో చందనంబొమ్మ దిద్దిన తనముఖం సిగ్గుతో ఎంత ఎర్రబడింది! ఆనందంతో చిన్న చిన్న నిట్టూర్పులు విడుస్తోంది తాను. బయట శ్రీమంతుల యిళ్లలోఉండే సందడి విన్పిస్తోంది. శశిసోదరిలాఉన్న ప్రక్కయింటి పడుచు ఎవరో తనతో ఆత్మీయంగా మాట్లాడి వెళ్లింది. యామినీ కవిరాజ్ గారి భార్యలాంటి ఓ చక్కని ఆవిడ—తనకి బహుశా ఆడబిడ్డ అయిఉండొచ్చు—తమలపాకులబుట్ట తనదగిర పెట్టి, తమలపాకుల చిలకలుచుట్టవమ్మా వదినా! చిన్నారి వదినా! అన్నది.

తర్వాత ఎవరో—'మీలో ఎవరైనావెళ్లి కొత్తపెళ్లికూతురికి ఫలాహారం తెచ్చిపెట్టండి' అన్నారు.

ఏమయితేయేం—కాళ్ళచెరువుదగ్గర కనుల పండువగా ఉండే ప్రకృతిలోంచి ఇంటికి తిరిగి వచ్చేప్పుడు—మతిమళ్లీ 'సుదేవ్ చచ్చిపోను' అని మనసారా కోరుకుంటూ ఉంటుంది.

కుసుమతో ఈ మధ్య మరీ చీటికీమాటికీ ఏదో తగాదా వచ్చి పడుతోంది మతికి. ఎవరూ లేనప్పుడు కుసుమ శశిసంగతి తీసుకొచ్చి మతిని మరీ వేళాకోళం చెయ్యటం మొదలెట్టింది...

## ★ జీవనలీల ★

"ఒంట్లో బాగా లేదామతీ? అందుకనా అలా మాట్లాడకుండా కూర్చున్నావ్? అయ్యో పోనీలే, చినబాబుకి కబురంపనా? పరీక్షచేసి మందిస్తాడు..." అన్నది.

"ఎందుకిలా వేధిస్తావ్ వదినా? నీకు నేనే అపకారం చేశానని?"

"కళ్లు జలజలలాడుతున్నాయి-అదిగో: చూశాడంటే చినబాబుకి గుండె బ్రద్దలైపోతుంది".

"ఏ-ఫో-చావైనారాదేం నీకు!"

"నీకు తెలుసో తెలియదో మతీ? రాత్రంతా నువ్వే తలపుకు రావటంతో చినబాబుకి అసలు నిద్రేపట్టలా. మతీ, మతీ, మతీ! అంటూ అలాగే స్మరణచేస్తూ కూర్చున్నాడు. నువ్వేకనుక నిన్నిచ్చి చేస్తే చినబాబు తాళ్లచెరువులో దుమికి ఆత్మహత్య చేసుకుంటాడు".

"నువ్వే తాళ్లచెరువులో మునిగిచావు. చచ్చి దయ్యమవు"

మతి ఇహ అక్కడినుంచి వెళ్లిపోబోయింది. కుసుమతో మాటాడి నెగ్గగలదా ఆమె. కాని కుసుమమాత్రం మతిని విడిచిపెట్టలేదు. చటుక్కున మతిని చెయ్యిపట్టుకుని ఆపింది. తన ముఖాన్ని ఆమె ముఖం దగిరగాపెట్టి, కన్నార్పకుండా చూస్తూ, పళ్లు బిగబట్టి, "సిగ్గులేదూ నీకు? ఇన్నేళ్ళు వచ్చాయి-ఇంత పెద్దదానివయావ్. సిగ్గులేదూ నీకు? పూటకి టికాణాలేని గొల్లయింటిపడుచువి చినబాబుతో పోల్చిచూస్తే నువ్వు తక్కువదానివికాక ఏమిటి? ఎందుకు నీకింత మిడిసిపాటు? నువ్విలాచేస్తావ్ కనుకనే చిరాకుపుట్టి చినబాబు రావటం మానేశాడు" అంది.

అలా అనగానే మతి కుసుమ చెయ్యి కొరికింది. ఆమెని వదిలించుకుని, తన కొరికిన చేతిని అటూ యిటూ త్రిప్పి మతి పంటి గుర్తులు చూసుకుంది కుసుమ.

"కొరికావు! నువ్వు నన్ను కొరికావుకదూ! ఉండు, నిన్ను ఏంచేసానో చూడు"

ఏంచేస్తుంది కుసుమ మతిని ఏంచేస్తుంది? మతి గుండె దడదడలాడిపోయింది. ఓవేళ చినబాబుతో చెపుతుందా యేంకొంపతీసి తాను కుసుమచెయ్యి కొరికానన్న సంగతి వింటే చినబాబుకి పెద్ద కోపం వచ్చేస్తుంది అని మతి అనుకుంది.

కాసేపయేసరికి మళ్లీ మతి కుసుముచుట్టూ తిరగటం మొదలెటింది. మధ్యలో ఓసారి ధైర్యంచేసి "ఏదీ? బాగా నొప్పి ఎక్కిందా? చూడనియ్" అని అడిగింది.

కుసుమ నిఘంటువులో 'క్షమ' అనేమాటలేదు. ఆమె మతిని అనుకరిస్తూ "నొప్పిఎక్కిందావదినా అంటున్నావా? కొరికి పైగా ఏమీ ఎరగనిదానిలా వస్తావేం?" అన్నది.

మతి బయటికివచ్చి స్తంభానికి చేరగిలపడి నుంచుని, 'వదిన ఎంత భయంకరమైనవ్యక్తి! తిన్నగా వెళ్లి చెప్పేస్తుందేమో' అనుకుంది. తెరచి ఉన్న గుమ్మంలోంచి పినతల్లి కన్పిస్తూ ఉంటుంది. ఆమెకి ఇటీవల మాట పూర్తిగా పోయింది. మాటాడకపోతే గొంతులోంచి 'ఉస్, ఉస్' అని ధ్వనులు వస్తూంటాయి — అంతే ఏంమాట్లాడలేదు. మతినిచూసి, ఆమెని దగిరరమ్మని చెయిఊపి సైగచేసింది. తలయెత్తి చెయ్యి నోటిదగిర పెట్టుకుని, 'దాహం' అన్న అర్థాన్ని వ్యక్తంచేసింది. మతి ఆమెనిచూసినా, చాలాసేపటిదాకా అక్కడినుంచి కదల్లేదు.

"వసున్నా - వస్తున్నా. ఎందుకంత తొందర?

"ఎవరే పిలుస్తున్నది మతీ?" అని అడిగింది మోక్షదా.

"పిన్ని - పిన్ని. ఆవిడకి మంచినీళ్లు కావాలిట!"అన్నది మతి.

(ఇంకా వుంది)

---

## ★ కలంస్నేహం ★

(9-వ పేజీ తరువాయి)

దేవి మైమరచి, స్వర్గంలో విహారిస్తుంది!

సుబ్బారావుకు కునుకు పట్టబోయే సమయానికి, వీధిగుమ్మంలో పాలవాడి కేక వినిపించింది!

* * *

ఇందిరాదేవికి ఉత్తరంరాసి వారం రోజులైంది. ఇంకా ఆమె దగ్గర్నుంచీ ఏ జవాబూ రాలేదు. ఈ వారం రోజులుగా సుబ్బారావూ తన మనస్సూ ఒకచోటలేదు-అతనిలోంచి ఆ మనసు ఎగిరిపోయి, ఎక్కడెక్కడో విహరించసాగింది! రోజూ రామ్మూర్తి రూమ్‌లో కూచోటం—వచ్చేపోయే పోస్టుమాన్‌ను పలకరించటం — ఇది అతని కార్యక్రమం!

సుబ్బారావు ఉదయాన్నే ఎనిమిది గంటలకు 'ఇందిరాదేవి'ని తల్చుకుంటూ లేచాడు. స్నానంచేసి బట్టలు వేసుకుని రామ్మూర్తి గదికి శరీరాన్ని లాక్కుపోతూ దారంతా ఆలోచించసాగాడు. ఇందిరాదేవికి తన ఉత్తరం అందిందా లేదా? అది కొంపదీసి ఇంకెవరన్నా చదివారా? ఆమెకు తను నచ్చలేదా? తన ఉత్తరానికి ఆమె నవ్వుకున్నదా? లేకపోతే ఈ ఇందిరాదేవి ఇదంతా వట్టికల్పనా? — ఈ ఆఖరి ప్రశ్న కలగగానే సుబ్బారావుకు భూమికింద ఏదో పగిలినట్టూ తను ఆ అగాధంలో కూలిపోతున్నట్టూ భ్రమ కలిగింది. అంతలోనే కాళ్లు నిలదొక్కుకుని "ఆఁ! ఇదంతా నా ఆలోచనేగాని—కల్పన ఎందుకవుతుందీ!" అనుకుంటూ రామ్మూర్తి గది చేరుకున్నాడు.

"వచ్చిందిరా ఉత్తరం వచ్చింది" అన్నాడు బ్రహ్మాండంగా రామ్మూర్తి ఎనిమిదిన్నర కృతిలో, సుబ్బారావుకు ముచ్చెమటలూ పోసినై. రామ్మూర్తి వాడి గది అంతా పచ్చగా కనిపించింది కాళ్లూ చేతులూ వణకసాగినై. ఆత్రుతగా తీసుకుని, చించి చదవసాగాడు. చదువుతున్నంతసేపూ అతని గొంతును ఎవరో అటూ ఇటూ వూపుతున్నట్టుంది! శ్రీ సుబ్బారావుగారికి—

మీ లేఖ చేరింది. నాకు మహదానందమయింది. మీ వంటి స్నేహితుల కోసమే నేను ఎదురుచూస్తున్నాను. నేను ఈ వూరి కాలేజీలో రెండో సంవత్సరం చదువుతున్నాను. నాకు పుస్తకాలు చదవటమంటే మహా ఇష్టం. అక్కర్లేదు. సినిమాపాటలు పాడతాను. అప్పుడప్పుడూ పత్రికల్లో స్త్రీల పేజీల్లో చిన్న చిన్న వ్యాసాలూ లేఖలూ రాస్తూ వుంటాను. కథలుకూడా కొన్ని రాశానుగాని — పత్రికలకు పంపలేదు. మీ ఉత్తరంలో మీ భావాలు నాకు నచ్చినై. అంతంత భావాలతో ఉత్తరాలు రాద్దామనుకుంటానుగాని — భయం! 'సుబ్బశ్రీ' అనే పేరుతో రెండు మూడు గేయాలు చదివినట్టు జ్ఞాపకం. ఇంగ్లీషు సినిమాలు మా వూళ్ళో వారానికోసారి వేస్తారు. ప్రతీ సినిమాకూ పోతాను. ఈ మధ్య మీరేమయినా ఈ మధ్య కొత్తచిత్రాలుచూస్తే విమర్శించండి. తెలుగు రచయితలలో మీ అభిమాన రచయిత లెవరు? వెంటనే జవాబు రాస్తారని భావిస్తున్నాను.

ఇట్లు,
ఇందిర

"శాభాష్" అన్నాడు రామ్మూర్తి కెవ్వున.

"ఇందిరా" అని సుబ్బారావు ఆ వుత్తరాన్ని గుండెకు హత్తుకుని "దేవతల్లారా—నాపై పుష్పవృష్టి కురిపించండి. కోకిలా—నీలోవున్న సంగీతం అంతా పాడు. పూర్ణచంద్రమా—పూర్తిగా వికసించి నీ చల్లని వెన్నెల్లో నన్ను స్నానమాడించు! మధుర మారుతమా! కమ్మగా వీచి పరవశుణ్ణి

చెయ్యి!" అన్నాడు అటూ ఇటూ చూసి అరుస్తూ.

"ఏ నాటకంలో సంభాషణలురా ఇవి?" అన్నాడు రామ్మూర్తి 'కూల్'గా.

"నా పరువు పోగొట్టావురా దుర్మార్గుడా! ఒకడి నాటకంలో సంభాషణలు చెప్పే ఖర్మం నాకేంరా? స్వంతం—కేవలం స్వహస్తంతో లిఖించుకున్నది!"

లిఖించుకున్నదా—సరే; ఇప్పటికిప్పుడు అశువుగా చెప్పింది కాదన్నమాట, రక్షించావు! జవాబు రాయి మరి—" అన్నాడు రామ్మూర్తి.

"ఈ సారి గుప్పిస్తా" అని వెకిలిగా నవ్వి "సుబ్బారావు అంటే వెర్రి వెధవనుకున్నావేమో—హుఁ! అమ్మాయిలను ఆకర్షించే పవర్ ఫుల్ మాగ్నెట్!" అన్నాడు కళ్ళు మెరిచిపోయి. ఆ ఉత్తరాన్ని తీసుకుని రామ్మూర్తి మరో రెండుసార్లు చదివాడు. "ఏది నీ చెయ్యి" అని కరస్పర్శ చేసి ఊపుతూ "నీ కోరిక ఫలించాలని కోరుకుంటున్నాను" అన్నాడు సీరియస్‌గా. సుబ్బారావు వెకిలిగా గొప్పగా అదోగా, హాయిగా నవ్వాడు!

* * *

ఇందిరాదేవికీ సుబ్బారావుకూ ఉత్తర ప్రత్యుత్తరాలు విరివిగా జరుగుతున్నై. ఉత్తరాలన్నీ రామ్మూర్తి కూడా చూస్తూ తగిన సలహాలిస్తున్నాడు. ఇన్నాళ్లుగా ఉత్తరాలన్నీ మామూలు ధోరణిలో నడిచినై, రామ్మూర్తన్నట్టు—ఇందిరాదేవితో బాగా పరిచయమైపోయింది—ఇక అసలు విషయంలోకి దిగాలి!

ఏమయితే అవుతుందని, సుబ్బారావు ఇందిరకు మొదటిసారిగా ప్రణయలేఖ తయారుచేశాడు. "ప్రియమయిన ఇందిరాదేవికి—" అని ప్రారంభించి ఆమె-తనకు ఎట్లా నచ్చిందో, తనకూ ఆమెకూ ఎట్లా మనసులు కలుస్తాయో, ఆమె ఉత్తరం రావటం అరగంట ఆలశ్యమైతే తనెంత మధనపడతాడో, రోజూ రాత్రులు నిద్రపోకుండా ఆమెను ఊహించుకుంటూ ఎట్లా కలలుగంటున్నాడో—ఆమె లేకుండా తన జీవితం ఎట్లా వ్యర్థమో, మొదలయిన విషయాలన్నీ రాస్తూ—ఈ ప్రేమను తృణీకరించవద్దనీ, ఇది నిర్మలప్రేమనీ, శాశ్వతంగా నిల్చేది అదొక్కటేగాని ఉత్తరాలు కావనీ, తనను పూర్తిగా నమ్మమనీ, తన సర్వస్వమూ ఆమె కేననీ, మనసులు కలిసిన తమవంటివాళ్లు పెళ్ళి చేసుకోవటం ఆవశ్యకమనీ—రాశాడు. ఈ పుత్రం నిండా కావలసినంత కవిత్వమూ, భావాలు, వర్ణనలూ ఉద్రేకమూ, విషాదమూ మొదలయిన అన్ని రసాలు కనిపిస్తునై.

ఈ ఉత్తరాన్ని ఒకటికి రెండుసార్లు చదివి, రామ్మూర్తి తప్పులేదన్నారు. అవశ్యం పోస్టు చెయ్యమని, సుబ్బారావుకు ధైర్యం చాలక పోగా తనే పోస్టులో వేశాడు. ఆక్షణం నుంచీ సుబ్బారావు వొంటిమీద తేళ్ళూ జెర్రులూ పాములూ ప్రాకటం మొదలెట్టినై. ఈ పుత్తరానికి ఎటువంటి జవాబు వస్తుందో సుబ్బారావు వూహించలేకపోతున్నాడు! తిడుతుందా? అసలే రాయదా? లేక 'నాకీ ప్రేమాగీమా. అసహ్యం' అంటుందా? ఏం జరగబోతోందో ఎవరు చెప్పగలడు? సుబ్బారావు రకరకాలుగా కించపడసాగాడు.

"ఎంతయినా సుబ్బారావు అదృష్టవంతుడు" అన్నాడు రామ్మూర్తి. నాలుగు రోజులు తిరక్కముందే ఇందిరాదేవి అతని ప్రేమను స్వీకరిస్తూ తన ప్రేమను వెళ్ళబోస్తూ ఎనిమిది పేజీలవుత్తరం రాసింది! ఆక్షణంనుంచీ సుబ్బారావును ఎవడూ పట్టలేకపోయాడు. ఆ వుత్తరంరాగా అతను ఎనిమిదిసార్లు చదవగా రామ్మూర్తి పదిహేనుసార్లు చదివాడు. తను కూడా సుబ్బారావునే నమ్ముకున్నాననీ, అతని మొదటి లేఖ చదివినప్పుడే తనకు అతని మీద 'ప్రేమ' ఏర్పడిందనీ, ఆ మాట చెప్పేందుకు ధైర్యం చాలలేదనీ, ఎన్ని ఆటంకాలు వచ్చినా ఈ ప్రేమ నిర్విఘ్నంగా కొనసాగి ఆదర్శ వివాహానికి దారి తియ్యాల్సిందిగా తనపట్టుదలనీ—మొదలయిన విషయాలన్నీ కవిత్వంకట్టి రాసింది.

సుబ్బారావు అఖండ సామ్రాజ్యాలనూ జయించిన మహారాజులాగా పెట్టి, ఠీవిగా నడవసాగాడు. అతనిలో సంతోషం కట్టలు దాటి ప్రవహించసాగింది. ఇందిరమీద అతనికి అప్పుడే అధికారం ఏర్పడినట్టూ తన భార్య ఐనట్టూగానే మాట్లాడసాగాడు రామ్మూర్తితో. రామ్మూర్తికూడా ఒకటి, రెండుసార్లు 'నీభార్య' అనే అన్నాడు!

ఈ సారి సుబ్బారావు ఇందిరకు ఏకవచనంలోనే స్వేచ్ఛగా విరహాన్ని ప్రకటిస్తూ "పెద్ద" వుత్తరాన్ని రచించాడు! "మృదుభాషిణీ, ప్రియరమణీ, ఇందిరామణీ" అని సంబోధిస్తూ జాగ్రత్తగా ఆలోచించి మాటలు వేసి పూర్తిచేశాడు. ఈ వుత్తరంలో, ఆమెనుచూసే అదృష్టం ఇంకా కలగలేదు కాబట్టి, కనీసం ఫోటోనయినా వెంటనే పంపాల్సిందిగా అర్థించాడు!.

* * *

పెద్దకళ్ళూ, చక్కనిముక్కూ, నవ్వుతున్న చిన్న పెదవులూ మృదువైన కోలముఖమూ, చూసి సుబ్బారావు ముగ్ధుడయ్యాడు!

# ★ కలం స్నేహం ★

"కేవలం గుణవతే కాదు—రూపవతి కూడాన్నూ—నా జన్మతరించిందిరా రామ్మూర్తీ—ఇదంతా పూర్వజన్మ సుకృతం!" అని కేకలుపెట్టి ఇందిర ఫోటోను గంటలతరబడి చూస్తూ వెర్రెత్తిపోయాడు సుబ్బారావు.

"చాలా అందగత్తె" అన్నాడు రామ్మూర్తి. విజయసూచకంగా నవ్వి తల ఆడించాడు సుబ్బారావు ఫోటోను చూస్తూ.

ఆరాత్రి సుబ్బారావు కంటిమీద కునుకు పడితే ఒట్టు! తన తల్లిదండ్రులకు ఈ ఫోటోను చూపించి, ఎట్లాగన్నా వాళ్ళచాత ఒప్పించాలి. ఒప్పుకోక పోతే తనకు ఆత్మహత్యే శరణ్యం అనాలి. మరి ఇంది రేమవుతుంది? ఆమెకూడా ఏ బావినో, రైలునో చూసుకుంటుందా?—ఈ నిర్మల ప్రేమకు అటంకాలేవన్నా కలగబోతే అది తన తల్లిదండ్రుల అభ్యంతరమే తప్ప ఇంకేం కాదు. ఈ ఫోటో చూసి, వాళ్ళు తప్పక ఆమోదిస్తారనే ధైర్యం వుండనే వున్నది... కాని— ఏమీ చెప్పలేం! వాళ్ళు అడ్డపెట్టినా తెగించి ఈ పెళ్లి జరుపుకోవాలి... లేకపోతే...

నీట్లో మునిగిపోతున్నవాడు కాలూ చెయ్యీ కొట్టుకున్నట్టు అటూ ఇటూ కొట్టుకోసాగాడు ఆమంచంమీద అతను. లైలామజ్నూ కథా, రోమియో జూలియట్ నాటకమూ, దేవదాసు సినిమా—ఇవన్నీ వొంకర్లుగా తలలో తిరిగినై. అతనికి ఏకోశానా కాలూ చెయ్యీ ఆడలేదు!

అదే రాత్రి రామ్మూర్తికి నిద్ర పట్టలేదు. ఎంత కళ్ళు మూసుకున్నా అతనికి 'ఇందిర బొమ్మే' గుర్తువస్తున్నది. ఆహా! ఏం లావణ్యం! ఏం అందచందాలు! వెధవ—సుబ్బారావుగాడు భలే ఛాన్సు కొట్టాడు. ఏ నాడయినా వాడు ఇటువంటి అవకాశాన్ని పొందగలడని కలగన్నాడా? ఐనా ఇదంతా వాడిగొప్పా ఏమిటి? తను తగిన సలహాలివ్వక పోతే, ఉత్తరాలు రాసేటప్పుడు భావాలూ, మాటలూ సరఫరా చెయ్యకపోతే, విడిమొహం –విడినా ఇందిర ప్రేమించేదా? ఇందులో వాడిప్రజ్ఞ ఏం ఏడిసింది గనక?—రామ్మూర్తికి సుబ్బారావుమీద ఎక్కడాలేని 'జెలసీ' ఏర్పడింది. ఈ ఇందిర తను దక్కించుకోటానికి అవకాశాలు ఏమున్నయ్యో వెతకసాగాడు! ఇంతవరకూ సుబ్బారావు రాసిన ఉత్తరాలన్నీ వాడు రాసినవి కావనీ అవన్నీ తను రాసినవనీ ఒక ఉత్తరం ఇందిరకు రాస్తే?... సుబ్బారావు అందవికారమయినవాడనీ, అతనికి ఏఅభిరుచులు లేవనీ, వట్టి మొద్దు అనీ కల్పిస్తే?... ఇవేం లాభం లేదేమో!

సుమారు రెండుగంటలవేళకు రామ్మూర్తికి అపూర్వమైనదీ, ఎవడికీ తట్టనిదీ, బ్రహ్మాండమైనదీ ఒక వ్యూహం కలిగింది. ఈ వ్యూహంతో అతను పరమానందభరితుడై సంతోషంగా నిట్టూర్చి ఒళ్ళు మరచి నిద్రపోయినాడు!

* * *

ఇందిరాదేవి నుంచి ఉత్తరం వస్తుందని రామ్మూర్తి గదికివచ్చిన సుబ్బారావుకు రామ్మూర్తి సంచిలో గుడ్డలుపెడుతూ కనిపించాడు.

"కాంపేమిట్రా?" అన్నాడు సుబ్బారావు.

"అవున్రా. అర్జెంటుగా ఇంటికి రమ్మని మానాన్న వైర్ చేశాడు. ఏదో భూముల తగువులే అయి ఉంటాయి!"

"మొన్న మొన్న వెళ్ళొచ్చావుగా"

"వీటికి అంతూ పొంతూ ఏమిట్రా? ఈ భూము లున్నవాడికంటే లేనివాడే సహస్రాంతం నయం!... రెండుమూడురోజుల్లో వచ్చేస్తాను. గదితాళం నీదగ్గరే వుంచు!" అని తాళంచెవి సుబ్బారావుచేతిలో పెట్టి తనకు వేళయిందని చరచరా బయలుదేరాడు. కాకీ ఖటల మనిషి ఎవడయినా కనిపిస్తున్నాడేమో నని డాబామీదికొచ్చి వీధిలోకి చూడసాగాడు సుబ్బారావు!

* * *

తనవూరికి వెళ్తున్నానని బయలుదేరిన రామ్మూర్తి సరాసరి ఇందిరాదేవి వూరు చేరుకున్నాడు. హోటల్లో స్నానం చేసి, శుభ్రంగా గుడ్డలు వేసుకొని ఇందిరఅడ్రసును బట్టి ఆపేటకు దారితీశాడు. సాయంత్రం నాలుగున్నర కావస్తోంది. ఇందిర కాలేజీ నుంచి వచ్చే వేళ. ఇంటిదగ్గరకువెళ్లి పిలిస్తే వాళ్ళు 'ఎవరునువ్వు?' అంటే?— అందుకనే ఆలోచించి రామ్మూర్తి సరిగ్గా కాలేజీ వదిలేవేళకు ఆవీధిలో ఆమెకోసం ఎదురు చూడసాగాడు!

ఒకచేతిలో పుస్తకాలు, రెండోచేతిలో ఏదో వస్తువు పట్టుకుని, వయ్యారంగా హంసల్లే నడుస్తూవస్తున్న ఇందిరను రామ్మూర్తి సులభంగా గురుపట్టాడు. అవేకళ్ళు— అదే ముక్కు—అవే పెదవులు... ఆమె బాగాదగ్గరవుతున్నది... రామ్మూర్తి కాళ్ళూ చేతులూ గుండే అన్నీ కంపం చెయ్య సాగినై. బలవంతాన ఆ చప్పుడును అరికట్టి, ధైర్యం చిక్కబట్టి, గొంతు సవరించుకుని చెట్టను అనుకుని–ప్రక్కగాపోతున్న ఆమెను చూసి "మిస్ ఇందిరాదేవి?" అన్నాడు దరాగా. ఆమె ఆగి అతనికేసి అగమ్యంగా చూసింది.

రామ్మూర్తి మెల్లిగానవ్వి— "నేను మీ... సుబ్బారావును!" అన్నాడు!

"ఓ- ఎప్పుడొచ్చారు? రండి మాయింటికి పోదాం" అన్నది ఆత్రుతగా.

"కాదు. కాస్త రహస్యంగా మాట్లాడుకోవాలి. అటు ఎటన్నా పోదాం" అన్నాడు రామ్మూర్తి ధైర్యంగా.

"అభయం ఏమీ లేదు. మాయింట్లో మాట్లాడుకోవచ్చు—రండి!" అన్నది.

రామ్మూర్తి మెల్లిగా ఇందిరను అనుసరించాడు. ఇల్లు చేరగానే ఆమె లోపలకు పోయి పుస్తకాలు పెట్టివచ్చి రామ్మూర్తికేసి దీనంగా చూస్తూ "క్షమించాలి సుబ్బారావుగారూ! స్నేహితులు వచ్చి కూచున్నారు. వాళ్ళుండగా మనం మాట్లాడుకోటం బాగుండదు. రేపు వుంటారుగా – వుదయం తప్పక రండి. మా అన్నయ్యకూడా వుంటాడు – మిమ్మల్ని పరిచయం చేస్తాను!" అన్నది మెల్లిగా. రామ్మూర్తి అమాయకంగా ఆమెకళ్ళలోకి చూసి – "సరే, పొద్దున్న ఎనిమిది గంటలకు వస్తాను" అన్నాడు. ఇంతలో లోపల్నుంచీ ఎవరో "అమ్మడూ" అని కేకవేశారు. "వస్తానండీ – సారీ" అని చరచరా వెళ్ళిపోయింది. రామ్మూర్తి నీరసంగా కదిలాడు తన "డ్రెస్" కేసి చూసుకుంటూ!

తనే సుబ్బారావునని చెప్పటానికి రామ్మూర్తి ముందుగా చాలా ఆలోచించాడు. తనుపోయి సుబ్బారావుమీద అసహ్యంగా మాట్లాడితే, ఆమెకు సుబ్బారావుమీద ప్రేమ తగ్గవచ్చునేమోగాని— తనమీద కలిగేందుకు అవకాశం లేదు. "ఈ ఉత్తరాలన్నీ నేనేరాశాను. ఈ ప్రజ్ఞ అంతా నాదే. నాపేరు రామ్మూర్తి – నేను సుబ్బారావు స్నేహితుడిని!" అన్నా ఆమె ఒప్పుకోదు. ఇందులో కుట్ర వున్నట్టుగా అనుమానిస్తుంది. అందువల్ల ఆమె ఎట్లాగూ సుబ్బారావును చూడలేదు కాబట్టి – తనే ఆ పేరు పెట్టుకుంటే, తను సుబ్బారావుననే భావంతోనే ప్రేమను కురిపిస్తుంది. తర్వాత ఎప్పుడన్నా ఆమె సుబ్బారావును చూసినా నమ్మదు! 'అసలు సుబ్బారావు'అని నమ్మినా మొదటిసారిగా ఆ పేరుతో తనను చూడబట్టి, తనముద్ర ఆమెలో స్థిరపడబట్టి, సుబ్బారావుమీద ప్రేమ తగ్గటానికి అవకాశాలుండవచ్చు. ఒకవేళ తగ్గినా తగక పోయినా, ఈ పేరు చెప్పటంవల్ల కనీసం రెండు రోజులపాటన్నా ఆమెతో హాయిగా వున్నాననే తృప్తివుంటుంది. తర్వాత ఏమయితే మాత్రమేం గనక?—

రామ్మూర్తి హోటల్ రూమ్ చేరుకుని, మర్నాటి ఉదయం ఎనిమిది గంటలకు ఇంకా ఎంత 'టయిము' వుందో గడియారం చూసుకున్నాడు!

* * *

ఆపూట సుబ్బారావుకు ఇందిరనుంచి ఉత్తరం చేరలేదు. అతనికి ఏదో చెప్పరాని

ఆ వేదన కలగసాగింది. ఇందిర రూపమే తప్ప అతనికి ఇంకో వస్తువు కనిపించటం లేదు. గదిలో అటూ ఇటూ తారట్లాడ సాగాడు. రామ్మూర్తి కూడా లేదేమో, అతనికి అసలు తోచటం లేదు.

సుబ్బారావుకు ఠపీమని ఒక ఆలోచన తోచింది. ఇందిరను చూడాలనీ, ఆమెతో మాట్లాడాలని తను ఎట్లాగూ తహతహలాడుతున్నాడు - ఇవాళే బయల్దేరివెళ్లి కలుసుకుంటేనే?—గదికి తాళం వేసి గాలిలో ఎగురుతూ ఇల్లు చేరుకుని స్నేహితుడి పెళ్ళికి అర్జెంటుగా వెళ్ళాల్సి వచ్చిందని ఇంట్లో చెప్పి, కొంత డబ్బు ఎక్కడో అప్పుచేసి, ఆ సాయంత్రం బండికి ఇందిర వూరుకు బయలుదేరాడు!

* * *

ఉదయం సుమారు ఎనిమిది గంటలవేళ తనను ఎవరో పిలిచినట్టుకాగా, ఇందిర వీధి గుమ్మంలోకివచ్చి చూసింది. నీటుగా డ్రెస్సు వేసుకుని, నవ్వుతూ ఓ కుర్రాడు కనిపించాడు. "ఇందిరా" అన్నాడా కుర్రాడు ప్రేమ ఘట్టంలో ప్రియుడు పలికినట్టు.

"ఎవరు?" అన్నది ఇందిర అగమ్యంగా.

"ఆఁ! నన్ను ఎరగవూ— నేనునీ...సుబ్బారావును" అన్నాడు సుబ్బారావు నవ్వుతూ అమితానందంగా. ఇందిరకు కొన్ని క్షణాల పాటు ఈ లోకం కనిపించలేదు. నిన్న వచ్చాడు సుబ్బారావా—ఇవాళ ఇతనొక సుబ్బారావు?...ఇదేమిటో ఆమెకు అర్థం కాలేదు. ఇందులో ఏదో వున్నట్టుందని గ్రహించి, అంతలోనే సర్దుకుని ఆప్యాయంగా అతన్ని లోపలకు ఆహ్వానించింది.

"నీ కోసం ఎంత తహతహలాడానో దేవుడు కూడా లెక్కకట్టలేడు!" అన్నాడు సుబ్బారావు నవ్వుతూ.

ఇందిర చిరునవ్వునవ్వి, "ఇప్పుడే వస్తా" నంటూ లోపలకు వెళ్ళింది. సుబ్బారావు ఆ యింటి అల్లుడిగా దర్జాగా కుర్చీలో కూచుని సిగరెట్టు ముట్టించాడు!

కొన్ని నిమిషాల్లో ఎవరో వీధిలోంచి "ఇందిర వున్నదా?" అని అడగటం విని సుబ్బారావు గిరుక్కున వెనక్కి తిరిగి చూడగా—రామ్మూర్తి! రామ్మూర్తి కేవలం రాతిబొమ్మల్లే ఐపోయి—క్షణం పోయాక నెమ్మదిగా "సుబ్బారావు" అన్నాడు పెదవులతో. రామ్మూర్తిని చూడగానే సుబ్బారావూ అగమ్యంలోపడి, 'రామ్మూర్తి' అన్నాడు గొంతులోనే.

"ఎప్పుడొచ్చావ్?" అన్నాడు సుబ్బారావు.

రామ్మూర్తి తడబడుతున్న రెండుకాళ్లూ గట్టిగా నిలదొక్కుకుని—"అక్కడ బయలుదేరటమే సరాసరి ఇక్కడకు చేరాను!" అన్నాడు ఏమాత్రం జంకూ గొంకూ లేకుండా—నీట మునిగిపోదామనుకున్న వాడు 'చలి'కి భయపడటం అనవసరం అని గుర్తువచ్చి.

"మీవూరు వెళ్ళాలన్నావుగా" అన్నాడు సుబ్బారావు.

"వూరికే అన్నాను" అన్నాడు రామ్మూర్తి ముక్తసరిగా.

"నాతో ఈమాట చెప్పలేదేం?" అన్నాడు అధికారంగా సుబ్బారావు.

"అనవసరం అని"

ఈసారి రామ్మూర్తి సమాధానం 'పెడ'గా వున్నట్టు సుబ్బారావు గ్రహించి— "ఇక్కడ నీకేం పని?" అని గద్దించాడు.

"నువ్వేం పనిమీద వచ్చావో నేనూ ఆ పనిమీదే వచ్చాను. సుబ్బారావ్—ఇక ముసుగులో గుద్దులాట ఎందుకు? నేను ఇందిరను గాఢంగా ప్రేమించాను. నిన్ననే ఆమెను కలుసుకుని అన్నీ మాట్లాడేశాను. ఇప్పుడు నా పేరు సుబ్బారావు. ఇక్కడ నీకేం హక్కూ, అధికారమూ లేవు. నువ్వు వెళ్ళొచ్చు!" అన్నాడు సీరియస్ గా రామ్మూర్తి. రామ్మూర్తి ఏం మాట్లాడుతున్నాడో సుబ్బారావుకు అర్థంకాలేదు. ఇది కలా, నాటకమూ, ఏదన్నా సినిమా ఘట్టమూ అనిపించింది. నిజంగా రామ్మూర్తే ఇట్లా మారిపోయాడా?—

"ఏమిటి...నువ్వేం మాట్లాడుతున్నావ్ రామ్మూర్తి!" అన్నాడు కోపంగా సుబ్బారావు.

"వున్నది వున్నట్టు మాట్లాడుతున్నాను. అవును-ఇది నిజం."

సుబ్బారావు ఆ పాదమస్తకం కంపించిపోతూ లేచినించుని, పళ్లు పటపటలాడిస్తూ— "ద్రోహీ!...స్నేహితుడవనినమ్మి..." అనబోతే.—

"డైలాగులు తప్పచెప్పటం అనవసరం. దయచేసి బయటకు వెళ్లు!" అన్నాడు రామ్మూర్తి.

ఇంతలో ఇందిర అక్కడికి వచ్చింది.

"హలో ఇందిరా" అన్నాడు రామ్మూర్తి.

ఇందిర మాట్లాడలేదు. ఇద్దర్నీ చూస్తూ నించున్నది.

"ఇతను నా పేరు పెట్టుకునివచ్చిన రామ్మూర్తి. దుర్మార్గుడు. నేను - సుబ్బారావును!" అన్నాడు ఉక్రోషంగా అసలు సుబ్బారావు.

"నోర్ముయ్! ఇందిరా - నేను సుబ్బారావును కానూ - వీడెవడో నా పేరు పెట్టుకొచ్చి మోసం చేదామనుకుంటున్నాడు" అన్నాడు నకిలీ సుబ్బారావు.

"గెటవుట్" అని అరిచాడు సుబ్బారావు కళ్ల నీళ్ల పర్యంతమై.

"నువ్వెవడివయితే నాకేం? రా ఇందిరా పోదాం" అన్నాడు రామ్మూర్తి ముందుకు పోతూ.

"ఆగండి" అన్నది ఇందిర.

రామ్మూర్తి ఆగాడు. సుబ్బారావులో సంతోషం ఉదయించింది.

"ఇదంతా నాకు అర్థం కాకుండావున్నది. ఎవరు సుబ్బారావో నాకేం తెలియటం లేదు. ఋజువు చెయ్యండి!" అన్నది.

"నేను ఇందిరానీ సుబ్బారావును" అన్నాడు రామ్మూర్తి.

"నేను ఇందిరానీ సుబ్బారావును" అన్నాడు సుబ్బారావు.

"నువు రాసిన ఉత్తరాలన్నీ ఏకరువు పెడతాను" అన్నాడు రామ్మూర్తి.

"ఇందిరా-వీడు నాస్నేహితుడు రామ్మూర్తి. నువురాసిన ప్రతీ వుత్తరం వీడు చదివాడు. నీకు నేను రాసిన ప్రతీ ఉత్తరాన్నీ చూపిస్తే ఇట్లా ద్రోహంచేశాడు. నువ్వు రాసిన ఉత్తరాలన్నీ నేను చూపిస్తాను"

"అదంతా అబద్ధం. నువ్వురాసిన వుత్తరాలన్నీ వీడు నాదగ్గర్నుంచీ దొంగిలించాడు."

"అబద్ధం" అని అరిచాడు సుబ్బారావు.

"ఇష్" అన్నది ఇందిర.

"చూడండీ-మీలో ఎవరు సుబ్బారావో ఎవరు కారో తర్వాత తేల్చుకుందాం. ఇంతకూ, నిజం చెబుతున్నాను వినండి. మీకు రాసిన ఉత్తరాలన్నీ-నేను రాసినవి కావు. అందులో ఒక్క అక్షరం నేను రాయలేదు. అసలు నా పేరుఇందిర కాదు-నిర్మల. అదంతా మాఅన్నయ్య ఆడిన నాటకం. తనే ఇందిరగా రాస్తూ మీరు ఫోటో పంపమని రాయగానే ఏ ఆలోచనా లేకుండా నాఫోటో పంపేశాడు. కలంస్నేహం చేస్తానని ప్రేమలోకి దిగే మీలాంటి ప్రేమ పిచ్చివాళ్ళకు బుద్ధి చెప్పాలని తన సంకల్పం అట. అంచాత, మీలో ఎవరు సుబ్బారావో మా అన్నయ్యే వచ్చి తేల్చుకుని మిగతా వ్యవహారం నెరవేరుస్తాడు. మధ్య నాకెందుకు వాడినే పిలుస్తాను వుండండి!" అని ఇందిర లోపలకు వెళ్ళింది.

సుబ్బారావు మూర్ఛపోయాడు!

రామ్మూర్తి సర్వేంద్రియాలూ స్తంభించిపోయి, రక్త ప్రవాహం ఓక్షణం పాటు ఆగిపోయింది!

కాస్సేపట్లో ఇందిర తన అన్నయ్యను వెంటబెట్టుకుని ముందు గదిలోకి రాగా, రెండు ఖాళీ కుర్చీలు మాత్రం నివ్వెరపోయి నించుని, తర్వాత ఒకదాన్నొకటి చూస్తూ పకపకమని నవ్వుకున్నై! ★

## ★ ఉత్తిష్ఠంతు భూత పిశాచాః ★

(13-వ పేజీ తరువాయి)

కుంటున్నాడా మరి

తనకి కిట్టనివాళ్లందరిమీదా చాడీలు చెప్పడం ప్రారంభించాడు.

తనకి షష్టిపూర్తయిపోయినా సర్వీసులో ఇంకా ఊడిగిలబడుతూ

ఏ సెలవుల్లోంకా నిండని సుబ్బారాయుడు వేగం

పెంచను పుచ్చుకునే ఉపాయం గురించి ఆలోచిస్తున్నాడు.

రామప్పంతులు మావీధి మలుపు తిరిగే సరికి నాదృష్టి మా ఎదిరింటి ఏకాంత రామయ్యగారిమీదపడింది.

ఆయన వసారాలో వాలుకుర్చీలో కూచుని వాసాలవైపు చూస్తున్నాడు.

ఆయనగాని అలాగు తీరుబాటుగా వాలుకుర్చీలో కూచుని వాసాలకేసిచూస్తూ ఆలోచిస్తున్నాడంటే మున్నాడెవరికొంపో ముంచేదన్నమాటే.

పాపం ఆయన కొంప లెన్ని తీసేసేం ఊరవతల పీరాంజనేయస్వామివారికో కోవెల కట్టించేడు!

బ్లాకుమార్కెట్టులో లోకాన్నంత దోసేసేం ఆ మధ్య ఏడుకొండలవాడికి వెళ్లాంచేత నిలువుదోపు ఇప్పించాడు!

అబ్బో ఆయన ఇంకా ఎన్ని ఘనకార్యాలు చేశాడని!

హాయివులలేవ్వించెను! చాటువాటించెను..

ఎక్కడ? తన స్వంత మొఖాసాలో

అతనికంటె ఘనుడు ఆచంట మల్లన్న!

ఏకాంతరామయ్యగారి ఇంటి పక్కనే వున్న ఇంజనీరుగారు!

ఆయన దొరతనంవారికి ఎన్ని బ్రిడ్జిలు కట్టేడు! ఎన్ని డాములు కట్టించేడు! ఎన్ని రోడ్లు వేయించేడు!

అయితే సర్కారువారి కెదికట్టినా ఆ కట్టె నప్పుడలా తన సొంతానికో పెద్దమేడ కట్టిస్తూ వుండేవాడు! కాని పాపం కాప్పీనంపడి ఆ మేడలన్నీ తన సొంతానికి ఉంచేసుకున్నాడా మరి!

ఎవరడిగితే వాళ్లకే ఇచ్చేశాడు అద్దెకి!

ఆ మధ్య తన బంధువులు వెర్రిబాగుల పులయ్యకు కాంతమ్మను కట్టబెటినప్పుడు 'కాకిముక్కుకు దొండపండు' సామెత పాడించింది తాయారక్క.

'తనంత అందగత్తె మరిలేదని ఏం మిడిసిపోయింది కాంతమ్మ! గుంటకి తగిన శాస్తి జరిగిందని సంతోషించింది చుక్కమ్మ.

ఒకరోజున కాంతమ్మ ఎదరింటి దర్జీవాడితో లేచిపోయిందన్నారు.

'జంత ఎంతపని చేసింది!' అని మెటికలు విరిచింది తాయారు.

'అయ్యో ఆ దర్జీసాయిబు నన్ను నమ్మించి ఎంత దగా చేశాడూ విధవ!' అని కడుపులో అరటిపళ్లు పిసుక్కుంది చుక్క.

'మనం ఉత్తినే మాటి మాటికి ఇక్కడా అక్కడా కలుసుకోవడం బాగుండదండీ ఎవరేనాచూస్తే అపోహ పడతారు' అంది సరళ కొనుమేటు కామరాజుతో.

'అపోహపడతారని కాదు నీ భయం— అసలు సంగతి పోల్చేసుకుంటారని, ఆ రామారావు టామ్ టామ్ చేస్తాడని'

'అవును మరి. అవసర నైవేద్యంలా గున్నాను మీ మట్టుకి నేను. పెళ్లి చేసుకుంటాననడానికి దమ్ములేవు మీకు. ఇకనైనా నామానాన నన్ను మర్యాదగా బతకనియ్యండి.'

'అదిగో మరలాగంటే ఎలా! నీ కోసం ప్రాణమైనా ఇవ్వడానికి సిద్ధం. అసలు నువ్వు లేకపోతే బతక లేను.'

'అదో మాటవరస పోనిద్దురూ. అలాగనడం ఈ కాలం కాలేజీకుర్రాళ్ల ప్రేమ కలాపాల్లో మామూలైపోయింది. ఇంతకీ మీ ప్రాణం బలికోరడానికి నే నేం రాకాసినికాను. ఆ వుత్తర మిచ్చేద్దురూ చాలు మీకు పుణ్యముంటుంది.'

సరళచే నిరాకరింపబడి, కామరాజంటే ఈర్ష్యపడే రామారావు వాళ్లమీద 'స్కాండల్సు' మొదలెట్టేడు. సరళ కామరాజుకి రాసినవుత్తరం చేజిక్కించుకుని సరళను 'బ్లేక్ మెయిలు' చెయ్యడం మొదలెట్టేడు.

ఒకరోజు కామరాజు, రామారావులకు సరళా కృష్ణారావుల వివాహ శుభలేఖలు వచ్చేయి. ఇద్దరికీ కళ్ళుతప్పుబారేయి.

సరళ తనకి దక్కకపోతే మానె, కామరాజుకీ దక్కలేదని సంతోషించాడు రామారావు!

ఆమెను అక్కసుదీరా ఆడిపోసుకోవడంలో రామారావుతో రాజీపడాడు కామరాజు—

ఆమె లేకపోతే బతకలేనన్న పెద్దమనిషి!

ఆమెకోసం ప్రాణత్యాగం చేస్తానన్న మహర్షి!

ఇలాగు చుట్టూచూసుకుంటే—

ప్రపంచంలో ఎన్ని చిత్రవిచిత్రమైన పాత్రలు!

ఒక్కొక్క పాత్ర జీవితంలో

ఎన్నెన్ని వింత వింత సన్నివేశాలు!

ఒక్క మట్టిమీద ఒకేతీరుగా వన్నంగా

పుట్టేమానవుల మన స్తత్వాల్లో

ఎంత వైవిధ్యం! ఎంత వ్యత్యాసం!

స్వార్థంలోమాత్రం ఎంత సమానత్వం!

ప్రస్తుతం నాకథకి ఏపాత్రను గ్రహించడం? ఏ సన్నివేశాన్ని ఎన్నుకోవడం? అని ఆలోచిస్తున్నా.

ఇంతలో పేరంటానికి పోయిన మా శ్రీమతి వాయనం పట్టుకు వచ్చింది.

వీధి చీడీలో వున్న నన్ను పలకరించకుండానే ఇంట్లోకి మా చెడ్డ విసురుగా వెళ్ళిపోయింది.

'ఏమిటి చెప్మా సరాసరి పేరంటంనుంచి రాగానే ఇలాంటి వాలకం వేసింది!' అనుకుంటున్నాను.

'ఏమండీ మాట' అంది తంచనుగా లోపలినుంచి.

'కాస్తవుండు కథ మంచిపట్టులోవుంది' అని కుదవి చేసుకున్నాను.

'ఈ కథకేంగాని మీ అసలుకథ బయటపడింది లెండి.'

నేను సరిగ్గా వివిపించుకోకుండానే 'అప్పుడే పడిందా? పత్రికకి పంపించి ఇంకా పదిరోజులు కాలేదు! అప్పుడే కథంటే పత్రికలవాళ్లు...' అని ఇవతలనుంచే కుర్చీలోంచే అంటున్నాను.

'ఏం వెర్రిబాగులవారండీ! అవునుగానీ ఉదయినికలా ఈ తరం రాస్తారా మీరు?' అని ఏదో కొత్తస్వరం పెట్టి గద్దించింది.

ఈ తిప్ప సరశారూల!—

కుర్చీలోంచి లేచాను.

లేస్తూనే 'ఉదయినికేమిటి? నేనేమిటి! ఈ తరమేమిటి! రాయడమేమిటి!' అని బిక్కమొగం వేసినా తెగించి ఒక్కబిగిని అనేశాను.

'మీ వంకనాచితనాలు నాదగ్గర దాచకండి. నాకంతా తెలిసిపోయింది లెండి' అంది సాక్ష్యబలం చూసి తీర్పివ్వడానికి సిద్ధంగా వున్న జడ్జీలా.

పేరంటానికి వెళ్ళి తెచ్చిన వాయనం ఇదా అనుకున్నాను.

అయినా 'ఎవళ్లన్నారంట నీతో నేనుదయిని కుత్తరం రాశానని?' అని మొరాయించాను.

'ఎవలో ఒకళ్లనడమేమిటి ఖర్మ! లోకమంతా కోడైకూస్తూ వుంటేను.'

'అసలెవళ్లన్నారో చెబుదూ!'

'పేరంటం కొచ్చిన అమ్మలక్కలందరూ అదేమాట! వెంకటప్పయ్యగారి పెళ్ళాంతో కళక్కమ్మగారు చెప్పిందిట!'

'కాదు వెంకటప్పయ్యే కలిపించుంటాడు. ఇక్కడ నాకీ పేటకం పెట్టేసి తిరపతిపోతాడా తాను? కక్కమ్మ వెంకటప్పయ్య పుణ్యం గట్టుకుంటే ఇంకేమన్నా వుందా? పుకార్లు కథలుగా పేకెస్తారు. కథలు పొలిమేరలు దాటిపోతాయి' అని విసుగ్గా ముళ్ళొచ్చి వీధి వరండాలో కుర్చీలో కూల బడ్డాను.

అసలు కథానుసంధానమింకా కానేలేదు.

మధ్యలో 'పతాక' లా ఇదొకటి వచ్చిపడింది.

బుర్ర గిర్రున తిరుగుతోంది.

పాత్రలూ సన్నివేశాలూ పటాపంచలైపోయాయి.

'ఉత్తిష్ఠంతు భూత పిశాచాః!' ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.

# పద్మిని కున్నట్టి దేహకాంతి

## మీకున్నూ కలుగును!

సొగసైన పద్మిని, భారత్ ప్రొడక్షన్స్‌వారి "విక్రమాదిత్యన్" చిత్రములో తార



పద్మిని, ఉత్తమ నర్తకి, నటీమణిగానేగాక సౌందర్యము కున్నూ భారతదేశమంతటా ప్రశంసనీయురాలైయున్నది. సర్వ సౌష్టవమైన చర్మము, పద్మిని వంటి సురూపవతులైన సినిమా తారలకైనట్లే మీ కున్నూ గొప్ప సొత్తు. అందుచేతనే, సినిమాతారలు చేయుచున్నట్లు— లక్స్ టాయిలెట్ సబ్బుతో మీ చర్మమును పోషించుకోవలెను. ఇది సొగసైన పద్మిని సూచన: "చర్మ సౌందర్యమును కాపాడుకొనుటకు, నేను వాడుచున్నట్టి శుద్ధమైన, తెల్లని, సబ్బుకంటె అతిసౌమ్యమైనది ఇంకేదీ లేదు ... అది లక్స్ టాయిలెట్ సబ్బు" పద్మిని లక్స్ సబ్బుయొక్క మీగడవంటి నురగకు, మనోహరమైన పరిమళమునకు ఆనంద పరవశురాలౌతుంది. మీరున్నూ అట్లే ఆనంద పరవశులగుదురు ... లక్స్‌ను నేడే వాడి చూడండి!

శుద్ధమైన, తెల్లని

# లక్స్ టాయిలెట్ సబ్బు




సినిమా తారలకు సౌందర్యము నిచ్చు సబ్బు

LTS. 565-X52 TL